వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గతంబైన

# శ్రీ శివగీత

(శివ-రాఘువ సంవాదం)

పారాయణ గ్రంథము

సంకలనకర్త :
వైద్యశ్రీ లొల్ల రామచంద్రరావు (రామ్‌జీ)
కాకినాడ

ప్రకాశకులు : సెల్ : 9700884787
వైద్యశ్రీ లొల్ల రామచంద్రరావు (రామ్‌జీ)
రామ్‌జీ టెక్నాలజీస్, కాకినాడ
www.ramjitechnologies.com.
e.mail : lollaramji@gmail.com

ప్రతులకు : ఫోన్ : 246 2565
మోహన్ పబ్లికేషన్స్
అజంతా హోటే ఎదురుగా
కోటగుమ్మం, రాజమండ్రి - 533 101

 2012 వెల : 250-00

ప్రథమ ప్రచురణ : 2012



రచయిత :

**వైద్యశ్రీ లొల్ల రామచంద్రరావు (రామ్‌జీ)**

రామ్‌జీ టెక్నాలజీస్, కాకినాడ

www.ramjitechnologies.com.

e.mail : lollaramji@gmail.com

ప్రతులకు : ఫోన్ : 246 2565

**మోహన్ పబ్లికేషన్స్**

అజంతా హోటల్ ఎదురుగా

కోటగుమ్మం, రాజమండ్రి - 533 101

Once Visit :- WWW.MOHANPUBLICATIONS.COM





## అంకితం

రుద్రుని అంశగా జన్మించి రామభద్రుని ఆజ్ఞను శిరసావహించి
జానకి జాడను తరచి, రావణుని దర్పమణచి,
సంజీవిని గొనితెచ్చి, సౌమిత్రుని బ్రోచి,
రామదాసునిగా చిరంజీవిగా కొలిచిన
నిన్ను నా గురువుగా తలచి పిలిచిన పలికే హనుమా !
అందుకోవయ్యా ఈ శివగీతను వలచి
భవిష్యత్ బ్రహ్మగా నిలచి

-రామ్‌జీ

## విషయసూచిక

## ముందుమాట

సృష్టి అనంతము, అనంతమైన సృష్టిలో అనంతకోటి నిగూఢ రహస్యములు ఆ రహస్యముల సంక్షిప్త రూపములే వేదములు. వేదాలలో నిగూఢంగా ఉన్న జ్ఞానసంపద పురాణాలలో కథల రూపంగా వ్యాఖ్యానింపబడినది. చతుర్థశ విద్యలలో లెక్కింపబడిన ఇవి పుట్టుకతో అనిర్వచనములు అయినప్పటికీ మిక్కిలి పురాతనములైన చాలా విషయాలు వీటిలో వర్ణించుట చేత పురాణములైనవి భారతం ఆదిపర్వంలోని ప్రథమాశ్వాసము నందలి 204వ శ్లోకం వేదాలు అర్థము చేసుకోవలెనంటే ఇతిహాస, పురాణముల యొక్క జ్ఞానం తప్పనిసరి అని తెలుపుచున్నది.

**ఇతిహాస పురాణాభ్యాం వేదం సముప బృహంక్రాత్**

**బిభౌత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రహరిష్యతి** –భార 1-1-204

ఇతిహాస, పురాణ జ్ఞానములను జోడించి, వేదార్థములను నిర్ణయించాలి. ఆ పురాణ, ఇతిహాసముల జ్ఞానంలేనివారు ఉన్న అపార్థ కల్పనతో ప్రహరించగలరని వేదమాత భయపడుతుంది. అందువల్ల పై శ్లోకం పురాణాల గొప్పతనాన్ని తెలుపుతుంది. అయితే ఈ పురాణాలు ఎప్పుడు ఆవిర్భవించినవి ? ఎవరు వీటికర్త ? అను విషయములమీద అనేక వాదములున్నవి. వేదకాలమునకు, కావ్యయుగమునకు మధ్య ఈ పురాణములు పుట్టినట్లుగా తెలియుచున్నది.

కృతయుగమునందు బ్రహ్మ నూరుకోట్ల విస్తారం కలిగిన బ్రహ్మ సంజ్ఞము అయిన పురాణసంహితా స్కంధమును నిర్మించి దాని సారమును వేదవ్యాస మహర్షి నాలుగులక్షల పరిమితిగల అష్టాదశ పురాణములుగా రచించి సూతులైన రోమమహర్షికి చెప్పెను. అతడు తనకుమారుడైన ఉగ్రశ్రవణునికి బోధించెను. ఆ ఉగ్రశమనుడు నైమిశారణ్యము నందలి శౌనకాది మహర్షులకు చెప్పెను వారు అంగీకరించిన పిదప వ్యాసుడు దాన్ని గ్రంథస్థం చేసెను దాదాపుగా ఈ పురాణములు అన్నియూ వ్యాసునిచే చెప్పబడి రచించబడి ఈ జగత్తులో అనేక విధములుగా వ్యాపించినాయి. అయితే ఇన్ని పురాణాలు వ్రాసిన వ్యాసుని వయసెంత అని ఒక్క వ్యాసుడే రాసాడా అని అనేక సందేహములు కలుగక మానదు. అయితే పూర్వ చరిత్రలు మనం చర్చించుకుంటే అప్పటికాలంలో అనేకవేల సంవత్సరాలు, కల్పాంతాలు జీవించిన మహానుభావులు, చిరంజీవులైన అశ్వాద్ధామ, ఆంజ

నేయుడు, మార్కండేయుడు, వ్యాసుడు మొదలైనవారు ఉన్నారని వారికి ముక్తి కలిగిన విధానాలు మన పురాణాలలో అనేకం గలవు. ఉదా. ముచు కుందుడు కృతయుగకాలంనాటివాడు అతనికి ద్వాపరయుగంలో కృష్ణుని వల్ల ముక్తి కలుగటం, త్రేతాయుగమందు శ్రీరామునిదూతగా వెలుగొందిన హనుమ ద్వాపరయుగమందు భీమునకు ఇచ్చిన దర్శనం, కృష్ణ ఆంజనేయ సంవాదము మొదలైనవి. ఇలా చర్చించుకుపోతే వేలకోట్ల లక్షల సంవత్స రాలు జీవించినవారు అనేకులు మన సంస్కృతి సంప్రదాయాలలో అనేక మంది, అందువల్ల మన సంప్రదాయాలు ఆర్షపురాణాలు వ్రాసిన వ్యాసుడు చిరంజీవియని మన మతము. ఆ పురాణాలు ఏవి అని తెలుపుటకు భాగవతంనందు ఒక శ్లోకం కలదు.

**మద్వయం భ ద్వయం చైవ బ్రత్రయం వ చతుష్టయమ్**

**అనామిపాగ్ని పురాణాని కూస్కంగారుడ యేవచ**

మద్వయమనగా మార్కండేయ మత్స్యపురాణములు, భద్వయమునగా భాగవత, భవిష్యపురాణాములు, బ్రత్రయము అనగా బ్రహ్మ, బ్రహ్మ వైవర్త, బ్రహ్మాండ పురాణములు

వ చతుష్టయం అనగా వాయు వరాహ వామన విష్ణుపురాణములు

న నారద పురాణం, లిం–లింగపురాణం

పా – పద్మపురాణం; అగ్ని – అగ్ని పురాణం

కూ–కూర్మపురాణం; స్కం– స్కంధపురాణం

గారుడ–గరుడపురాణం; వీటినే కొంతమంది వాయుపురాణమునకు బదులు శివపురాణాన్ని చేరుస్తారు. భాగవతమునకు బదులు దేవీ భాగవతమును లెక్కిస్తారు. ఈ పురాణాలలో మొదటిది బ్రహ్మాండ పురాణం రెండవది పద్మపురాణం అని పెద్దల మాట.

ఈ పద్దెనిమిది పురాణములలో పదిపురాణాలు శివునిగూర్చి చెప్పుచు, నాలుగు బ్రహ్మదేవున్ని వర్ణించును రెండు పరాశక్తిని గూర్చి తెలుపును, రెండు పురాణములు శ్రీమహావిష్ణువునకు సంబంధించినవి. ఈ విషయాన్ని స్కాందపురాణంలోని ఈ క్రింది శ్లోకం చెపుతున్నది.

**అష్టాదశపురాణేషు దశభిర్గీయతే శివః**

**చతుర్భిర్భగవాన్ బ్రహ్మా ద్వాభ్యాం దేవీ తథా హరిః**



ఈ మహాపురాణములనేకాక మరొక పద్దెనిమిది ఉపపురాణాలు కూడా ఉన్నవి. ఇవి దాదాపు వందగా లెక్కించారు. కాని ప్రస్తుతం పదిహేను ఉప పురాణములు మాత్రమే లభించుచున్నవి.

వేదజ్ఞానం అపూర్వం, వేదాధ్యయనం, వేదచర్చలు, వేదభాష్యం భారతీ యుల అపూర్వసంపదలు ఇటువంటి వేదాల అర్థమే ఉపనిషత్తులు అట్టి ఉపనిషత్తుల సారమే "గీత"లు ఇటువంటి గీతలు ఎన్నో ఈనాటి పండితుల ద్వారా లోకానికి అందినవి. అటువంటి వాటిలో 1.శివగీత 2. విష్ణుగీత 3. నారదగీత 4. వ్యాసగీత 5. వైద్యగీత 6. శ్రీరామగీత 7. సిద్ధగీత 8. రుద్రగీత 9. అష్టావక్రగీత10. గురుగీత మొదలైనవి. ఇటువంటి గీతల సారం వేదసారం, పురాణసారం ఒక్కటే అదే అంత్యకాలమందు ఆత్మ పర మాత్మలో లీనమవుటకు, ఇటువంటి ఆధ్యాత్మిక సంపద అందరికీ అందు బాటులో ఉండాలని నా చిరుప్రయత్నమే ఈ శివగీత.

ఇప్పటివరకు వచ్చిన శివగీతను గూర్చిన విషయాలు, పుస్తకాలు, ప్రవచనాలు చాలా తక్కువగా నాకు కనిపించినవి. స్వయంగా శివపరమాత్మ చెప్పిన ఈ శివగీత మనిషికి ముముక్షత్వం ఇవ్వగలదని ఆకాంక్షిస్తున్నాను.

ఈ గ్రంథరచనలో నాకు అన్నివిధాల సహాయ సహకారాలు అందించిన విశాఖపట్నం వా॥లు గౌ.శ్రీ పి. వెంకటరావు, శ్రీమతి శిరీష కుమారి గారి కుమారుడు నా మిత్రులు శ్రీ పి. చరణ్‌దాస్ గారికి ప్రత్యేక ధన్యవాదములు. గురుతుల్యులు శ్రీ చిఱ్ఱావూరి శ్రీరామశర్మగారు(రాజమండ్రి), శ్రీ గొట్టు ముక్కల వెంకట సత్యనరసింహశాస్త్రి (భాషాప్రవీణ,కాకినాడ), శ్రీ శంకర ప్రియగారు–(శీల), శ్రీ పమ్మి సత్యనారాయణశాస్త్రిగారు (విజయవాడ), శ్రీ వేదుల శ్రీరామశర్మగారు (శిరీష–కాకినాడ), శ్రీ ఎన్.వి.వి.సత్యనారాయణ గారు(వేళంగి), గౌ. శ్రీ గుణ్ణం నారాయణరావు గారు, శారదాదేవిగారు (కాకినాడ), గౌ. శ్రీ పి. ప్రసాద్, శ్రీమతి ఉష (కాకినాడ) వార్కి, శ్రీ అన్నపూర్ణ విశ్వే శ్వర ఆలయ ట్రస్టువారికి, అర్చకులు గౌ.శ్రీ పుల్లేటికుర్తి సుబ్రమణ్యశాస్త్రి గార్కి (కాకినాడ), నా మిత్రులు ఆంధ్రా సైంటిఫిక్ ఏజెన్సీ ప్రొప్రయిటర్ గౌ.శ్రీ వి. శ్రీనివాస్‌గారికి (కాకినాడ), ఈ పుస్తక ప్రచురణలో తమవంతు సహాయసహకారాలు అందించిన మోహన్ పబ్లికేషన్స్ అధినేత ఆకుల రామచంద్రరావు (రాంబాబు)గార్కి, గౌ॥ ఎన్.ఎస్. ఆర్. శాస్త్రిగార్కి (కొంత మూరు) నా ధన్యవాదాలు.

శివార్పణమస్తు

## గ్రంథ పరిచయం...

శివుడు కల్యాణకారకుడు, మంగళకరుడు, శుభకరుడు అటువంటి శివుని కథలు విన్నా, చదివినా, అష్టఐశ్వర్యములు కలుగుతాయని పెద్దల మాట. గీతలు ఎన్ని ఉన్నా శివగీతకు సాటిరావు మరేగీతలు. ఎందుకనగా ఇది సృష్ట్యాదియందు సాక్షాత్ పరమశివునిచే చెప్పబడిన ఈ శివగీతే అన్ని గీతలకు మూలం. అనగా ఈ గీతలో మనిషికి ముముక్షత్వం ఇవ్వడానికి మోహం వీడమని చెప్పి కర్తవ్యబోధచేసి జీవుని అసలు స్థితిని రమ్యంగా చెప్పిన ఈ గీత సర్వులకు ఆమోదయోగ్యమే.

ప్రస్తుత శివగీతను శివుడు రామునకు చెప్తున్నది అనగా శివరాఘవ సంవాదము అనగా శివకేశవుల సంభాషణము అని మనం చెప్పుకునే విధానంకన్నా ఒక చిన్నమాట మనం జ్ఞప్తికి తెచ్చుకోవాలి. అదేమనగా ఎంతటి ఉత్కృష్టమానవుడైనా,దైవాంశసంభూతుడైనా ప్రకృతికి సంబంధించిన మాయలోపడితే సాధారణ మానవుడే. అటువంటి పరిస్థితిలో దైవ మాయను తెలుసుకొనినవారు పరమాత్మను ప్రార్థిస్తే మోహం వీడికర్తవ్యం సుగమం అవుతుంది. అంతేకాక ఎంతటివారైననూ కర్మకు బద్ధులే. ప్రారబ్ధం అనుభవించి తీరవలసిందే. ఇటువంటి ప్రారబ్ధకర్మ సద్గురువు సాంగత్యం వలననే తీరుతుంది.



రామాయణకాలంలో శ్రీరాముడు దండకారణ్యంలో ఉండగా రాముడు లేని సమయంలో లంకాధిపతియైన రావణుడు సీతను అపహరించుకొని పోగా ఆ విషయం తెలుసుకొన్న శ్రీరాముడు పరిపరి విధములు కలత చెందుచూ ప్రాయోపవేశం (అగ్నిలో దూకుట)కు సిద్ధపడగా సిద్ధగురువైన అగస్త్యమహాముని శ్రీరాముని వద్దకు వచ్చి మోహం వీడమని చెప్పి శ్రీరామునకు పరమరహస్యమైన పాశుపత శివదీక్ష(విరజాదీక్ష)ను ఇవ్వగా శ్రీరాముడు రుద్రాక్షలు, త్రిపుండరములు ధరించి గోదావరి నదీతీరమున గల రామగిరి అందు శివలింగము ప్రతిష్టచేసి శివానుగ్రహం కొరకు రాముడు తపస్సు చేయగా కొంతకాలమునకు రామునిపై అనుగ్రహం కలిగిన శివుడు పార్వతీ ప్రమధగణసమేతంగా మేళతాళధ్వనులతో వస్తున్న శివుని గుర్తించక అదిరాక్షస మాయగా అనుకొనిన రాముడు తనకోదండమును ఎక్కుపెట్టి అనేక అస్త్రశస్త్రములు ఆ ధ్వనివస్తున్న వైపు సందించగా అవన్నీ గొప్పతేజస్సులో లీనమైనవి. అటు పిమ్మట ధనస్సు అమ్ములపొది జారి క్రిందపడి



భస్మమైనవి. అదిచూచిన లక్ష్మణుడు భయపడి మూర్ఛిల్లెను. అప్పుడు శ్రీరాముడు భయకంపితుడై ఏమితోచక భూమిపై మోకరిల్లి శివనామములు స్తోత్రము చేయుచు నమస్కరించెను. అంతట భక్తవత్సలుడైన పరమేశ్వరుడు పరివార పార్వతీసమేతంగా దర్శనమిచ్చి శ్రీరామునకు గొప్పధనస్సును దివ్యమైన అమ్ములపొదిని, పాశుపతాస్త్రమును ప్రసాదించి ఆశీర్వదించెను. అంతట సంశయాత్మకలిగిన శ్రీరాముడు అనేక పరిప్రశ్నలువేయగా భక్తవశంకరుడైన శివుడు అతనిమోహం పోగొట్టుటకు సమాధానాలు చెపుతూ నాటకీయంగా జరిగిన యదార్ధగాధే శ్రీ శివగీత. ఇది వ్యాస మహర్షిచే వ్రాయబడిన పద్మ పురాణాంతర్గత ఉత్తర ఖండములోగల ఈ గీతలో దాదాపు 779 శ్లోకాలు ఉన్నవి. ఇప్పుడు మనం చూస్తున్న చదువుచున్న వాల్మీకి మహర్షికి పూర్వమే రామాయణ కథ జనపదం. అటువంటి రామాయణ కథను ఒక్కో కవి ఒక్కొక్కవిధంగా వ్రాసి పండిత పామరులను రంజింపచేసారు. అయితే చాలా మందికి కలిగే సంశయం ఏమిటంటే ఇది మేము చూడలేదని, మనం చూడడం, చదవటం లేనంత మాత్రాన సృష్టిలో మర్మాలు అనేకం గలవు. మానవులకు గురుకృపవల్ల మాత్రమే ఇటువంటి అపూర్వ హిందూ వైజ్ఞానిక, ఆధ్యాత్మిక విద్యలు లభించగలవు. ఇక్కడ మనం ఒక విషయం చర్చించుకోవాలి.

శ్రీరాముడు శివునికోసం తపస్సుచేసిన రామగిరి ప్రదేశం ఆంధ్రప్రదేశ్ లోనిది అవ్వటం ఆంధ్రుల అదృష్టం. రామగిరి పేరుతో భారతదేశంలో దాదాపు 22 ప్రదేశాలున్నాయి. అయితే గోదావరి నదీతీరమునగల రామ గిరి యందు అని శివగీతలో ప్రస్తావించటంవల్ల భద్రాచలమునకు 55కిమీ. దూరంలోగల రామగిరి కొండలు (కూనవరందగ్గర)లలో శివాలయం రామునిచే ప్రతిష్ఠింపబడిన శివలింగం కలిగి ఉండి భైరవక్షేత్రంగా ఆరాధించబడుతుంది. అలాగే ఉత్తరమున గోదావరి కలిగిన మరొక రామగిరి ఖిలా కరీంనగర్‌జిల్లాలో గలదు. ఇక్కడ రామునిచే ప్రతిష్ఠింపబడిన శివలింగం, యోగరామాలయం మొదలైన రామావతార విశేషాలు ఈ ప్రాంతంలో ఉండి ఇది కూడా భైరవక్షేత్రంగా విరాజిల్లుతున్నది. ఇటువంటి పరమ పవిత్రమైన శివగీత మనగోదావరి ప్రాంతంలోనే శివుడు శ్రీరామునకు చెప్పటం రామాయణ కాలంలోనూ మన ప్రాంతం ఉండటం ఆ ప్రాంతంలో మనం నివసించటం గొప్పవిషయమే.

ఇప్పుడు మనం 28వ మహాయుగంలో నివసిస్తున్నాము. అందులో వైవస్వత మన్వంతరం ఆ వైవస్వత మన్వంతరంలో ఇప్పటికి 14 మంది రాముళ్ళు జన్మించినారని వారి కాలంలో జరిగిన రామాయణంలోకానికి వ్యాసుడు ద్వారా వ్యాప్తిలోనికి రావటం ఇది త్రేతాయుగంలో శ్రీరామ అవతారంగా రావటం ఎప్పుడూ సృష్టిలో జరిగే విషయమే. అయితే మొన్న త్రేతా యుగంలో రామాయణం జరగలేదని పెద్దలు చెప్పటం గమనార్హం. అంతేగాక భాగవతంలో నవమస్కందంలో రామచరిత్ర, భారతంలో అరణ్య పర్వంలో శ్రీరామ కథ చెప్పటమేగాక అనేక పురాణాలలో రామాయణం గూర్చి కథ ఉండటంవల్ల కాలంను ఖచ్చితంగా కనుగొనలేని పరిస్థితి. ఏది ఏమైనా జీవుడు దేవున్ని చేరుకోవటానికి సాక్షాత్ శివునిచే చెప్పబడిన శ్రీ శివగీత, మహాభారతంలో శ్రీకృష్ణ భగవానునిచే చెప్పబడిన భగవద్గీత చెప్పిన అంశాలు చాలా పోలికలతో ఉండటంవల్ల భగవద్గీతకు మూలం శివగీత యని అంగీకరించక తప్పదు.

ఉదా:

| | |
|---|---|
| మయ్యేవ సకలం జాతం | (6-54) |
| అపాణి పాదోऽ హం | (6-56) |
| దేవ ప్రపన్నార్తిహర ప్రసీద | (7-22) |
| యతో వాచో నివర్తంతే | (10-3) |
| యస్తు సర్వాణి భూతాని | (10-9) |
| ధూమాద్రాత్రిం తతఃకృష్ణ | (11-15) |
| యేత్వన్య దేవతాభక్తా | (12-3) |
| అపి చేత్సు దురాచారో | (12-7) |
| నిర్మమో నిరహంకారః | (13-23) |
| యదాసర్వే ప్రముచ్యంతే | (13-31) |
| ఆత్మా నజాయతే నిత్యో | (14-8) |
| దైవీహ్యేషా గుణమయీ | (14-36) |
| సర్వధర్మాన్ పరిత్యజ్య | (14-42) |
| యత్ కరోషి యదశ్నాసి | (14-43) |
| నేహాభి క్రమనాశోస్తి | (16-16) |



ఇలా అనేకచోట్ల చెప్పటంవల్ల ఈ రెండిటిసారం ఒక్కటే మనిషికి కర్తవ్య బోధచేసి కార్యోన్ముఖునిగా చేయటం అయితే భగవద్గీత మహాత్మ్యం వరాహ పురాణాంతర్గతమైనది. శ్రీశివగీత మహాత్మ్యం పద్మపురాణంతర్గతమైనది. అనగా పురాణాలలో జరిగిన విషయాలే మరలా మరలా జరుగుచూ ఉండటంచేత సూతమహర్షికి, వ్యాసుని ద్వారా తెలియటం సూతుడు శౌనకాది మహర్షులకు పురాణాలు చెప్పటం వీరి ఆమోదయోగ్యం అయిన పిదపనే వ్యాసుడు ఈవిషయాలను గ్రంథస్థం చేయటంవల్ల వ్యాసుడు చిరంజీవిగా అందరూ అంగీకరించవలసిందే. అయితే రామాయణ మహాత్మ్యం వాయు పురాణంలో ఉమాసంహిత యందు చెప్పటంవల్ల రామాయణకాలం పురాణ విషయాలు చాలా గోప్యమైయున్నవని వాటి విశేషణాది వివరాలను గురువుల ద్వారామాత్రమే తెలుసుకోవాలని మనవి. అయితే అందరకూ వచ్చేసాధారణమైన సందేహం ఏమిటంటే ఇన్ని శ్లోకాలు ఎలా చెప్పుకున్నారు. అన్నీ శ్లోకరూపంగా యదార్థంగానే చెప్పుచున్నారా యని అయితే విషయంను సాధారణ భాషలోనే చెప్పుకున్నా దాని విషయ విపులీకరణను కావ్యబద్ధంచేసి శ్లోకబద్ధంగా, ఛందోబద్ధంగా ప్రజలకు అప్పటివారు అందించటంవల్ల ఇది అందరికి పూర్తిగా అర్థంగాక గురువులు, మేధావులు యోగులకు మాత్రం అర్థమై సామాన్యులకు ఉపదేశం చేసేవారు. ఆ కారణంవల్లనే వైదికధర్మం గురుముఖతః నేర్చుకోవలసిందేగాని స్వయంగా ఆచరించకూడదు. భగవద్గీత వలే ఈ శివగీత కూడా బహుళ ప్రచారం కావాలని ఆకాంక్షతో పెద్దలుచేసిన ప్రయత్నాలుసరైన ఫలితాలు ఇవ్వలేదు. కారణం సాధారణ మనిషికి అర్థమయ్యే భాషలోకి వారిజ్ఞానం అందిచకపోవటం. ఈ శివగీతలో కొన్ని చోట్ల పాఠాంతరాలు కన్పిస్తున్నాయి. పాతప్రతులను పరిశీలించిన తర్వాతనే ఈ గ్రంథమును పూర్తిచెయ్యగలి గాను. అంతేగాక ఇందు జగతీ, అనుష్టుప్, విరాట్, గాయత్రీ, త్రిష్టుప్ ఛందస్సులు వాడటం జరిగింది. లఘువ్యాఖ్య రాయటంవల్ల అందరకు అర్థమవుతుందని ఆశిస్తున్నాను. ఈ నా చిరుప్రయత్నంను అందరూ ఆమోదంచేసి, నా భాషయందు తప్పులుండినను తర్వాత ప్రచురణలో సరిదిద్దుకోగలవాడను. సర్వులు శ్రీశివగీతను శ్రవణం, పారాయణం చేసి అంత్యమందు శివసాయుధ్యం పొందగలరని ఆశిస్తూ...

సంకలనకర్త :

**లొల్ల రామచంద్రరావు (రామ్‌జీ)**

## అష్టాదశ పురాణాలను మొదట చెప్పినవారు - విన్నవారు

| సం. | పురాణంపేరు | కల్పం | చెప్పినవారు-విన్నవారు |
|---|---|---|---|
| 1. | బ్రహ్మపురాణం | బ్రహ్మకల్పం | బ్రహ్మదేవుడు-మరీచిమునికి బోధించాడు |
| 2. | పద్మపురాణం | పద్మకల్పం | స్వయంభవుమనువు-బ్రహ్మకు బోధించాడు |
| 3. | విష్ణుపురాణం | వరాహకల్పం | పరాశరుడు-వాయుదేవుడునకుబోధించాడు |
| 4. | శివ(వాయు)పురాణం | శ్వేతకల్పం | శివుడు-వాయుదేవునకు బోధించాడు |
| 5. | భాగవతపురాణం | | విషణవు-బ్రహ్మకు బోధించాడు |
| 6. | నారదపురాణం | బృహత్కల్పం | పూర్వభాగాన్ని-సనకాదులు నారదునికి బోధించారు |
| 7. | మార్కండేయపురాణం | శ్వేతవరాహకల్పం | మార్కండేయుడు-జైమినికి బోధించాడు |
| 8. | అగ్నిపురాణం | ఈశానకల్పం | అగ్నిదేవుడు-వశిష్ఠునికి బోధించాడు |
| 9. | భవిష్యపురాణం | అఘోరకల్పం | బ్రహ్మదేవుడు-మనువుకు |
| 10. | బ్రహ్మవైవర్తపురాణం | రథంతర కల్పం | సావర్ణి-నారదునికి |
| 11. | లింగపురాణం | కల్పాంతకల్పం | పరమేశ్వరుడు-నారదునికి బోధించాడు |
| 12. | వరాహపురాణం | మనుకల్పం | విష్ణువు-పృథ్వికిబోధించాడు |
| 13. | స్కాందపురాణం | తత్పురుషకల్పం | స్కందుడు-భూదేవికి |
| 14. | వామనపురాణం | కూర్మకల్పం | బ్రహ్మదేవుడు-పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. | కూర్మపురాణం | లక్ష్మీ కల్పం | విష్ణువు-పులస్త్యమహామునికి |
| 16. | మత్స్య పురాణం | సప్త కల్పం | విష్ణువు-మనువుకు బోధించాడు |
| 17. | గరుడ పురాణం | గరుడ కల్పం | విష్ణువు-మనువుకు |
| 18. | బ్రహ్మాండపురాణం | భవిష్యకల్పం | బ్రహ్మదేవుడు-మనువుకు |



## శ్రీ శివగీత పారాయణ క్రమము

ఓమ్ ! హర ఓమ్ !! శ్రీ శివాభ్యాం నమః

ఓం సహనావవతు సహనౌభునక్తు-సహవీర్యం కరవావహై!
తేజస్వినా వధీతమస్తు-మా విద్విషావహై!!
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః
ఓం పూర్ణమదః పూర్ణమిదం - పూర్ణాత్పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ-పూర్ణమే వావశిష్యతే!!
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః
వందే విశ్వాధికం శాంతం-అనాది నిదనం శివమ్!
సకళం నిష్కళం చైవ-శక్తి జ్ఞాన క్రియాత్మకమ్!!
నమో బ్రహ్మదిభ్యో! బ్రహ్మవిద్యా సంప్రదాయ కర్తృభ్యో!
వంశ ఋషిభ్యో మహద్భ్యో! నమో గురుభ్యః
ఓం నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైక మూర్తయే ।
నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణామూర్తయే నమః ॥
నమశ్శివాయ తారాయ - బ్రహ్మణే సర్వసాక్షిణే ।
నమస్తే శివతరాయ - శతరుద్రాయతే నమః॥
శుక్లాంభరధరం విష్ణుం - శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయేత్ - సర్వవిఘ్నోపశాంతయే ॥
సర్వమంగళ మాంగళ్యే - శివే సర్వార్థ సాధకే ।
శరణ్యే త్ర్యంబకే గౌరి - నారాయణి నమోస్తుతే ।
యశివో నామ రూపాభ్యాం - యాదేవీ సర్వమంగళా ।
తయోస్సంస్మరణా త్పుంసాం-సర్వతో జయమంగళం ॥

### అథ గురు స్తోత్రం

అఖండ మండలాకారం-వ్యాప్తం యేన చరాచరమ్
తత్పదం దర్శితం యేన-తస్మై శ్రీ గురవే నమః 1
గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః-గురుర్దేవో మహేశ్వరః!
గురుసాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః 2
గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణాం ।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః॥ 3

ఈశ్వరో గురు రాత్మేతి-మూర్తిత్రయ విభాగినే!
వ్యోమ వద్వ్యాప్తదేహాయ-దక్షిణామూర్తయే నమః॥ 4

జ్ఞానానందమయం దేవం నిర్మలం స్ఫటికాకృతిం।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే॥ 5

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరం
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకి కోకిలం ॥ 6

వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తేః పౌత్ర మకల్మషం।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం। 7

ఓం అస్యశ్రీ శివ గీతాశాస్త్ర మహామంత్రస్య అగస్త్య ఋషిః। జగతీ ఛందః శ్రీ సాంబసదాశివ పరమాత్మా దేవతా ! ప్రణవో బీజం! సర్వ వ్యాపక ఇతి శక్తిః। హ్రీం కీలకం!

మమ ఉపాత్త దురితక్షయ ద్వారా పరమేశ్వరానుగ్రహ ప్రసాద సిద్ధ్యర్థే, శ్రీ శివగీతాపారాయణే జపే వినియోగః

## అథ గీతాధ్యానము

కలాభ్యాం చూడలంకృత శశి కలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటిత ఫలాభ్యాం భవతు మే !
శివాభ్యాం అస్తోక త్రిభువన శివాభ్యాం, హృదిపున!
ర్భవాభ్యాం, ఆనంద స్ఫురదను భవాభ్యాం నతిరియమ్!! 1

రామాయ ప్రతిబోధితాం భగవతా సాక్షాత్ శివేన స్వయమ్
వ్యాసేన గ్రథితాం పురాణమునినాం పద్మేపురాణే శివామ్।
అద్వైతామృత దాయినీం భగవతీం శ్రీషోడశాధ్యాయినీమ్
అంబ! త్వామను సంస్మరామి శ్రీ శివగీతే భవ ద్వేషిణీమ్॥ 2

వ్యాసం వశిష్ఠ నప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం ॥ 3



వాగర్థావివ సంపృక్తౌ-వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ ॥ 4

ఆపదామపహర్తారం-దాతారం సర్వసంపదామ్।
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహమ్॥ 5

శాంతం పద్మాసనస్థం శశిధర మకుటం పంచవక్త్రం త్రినేత్రమ్
శూలం వజ్రంచ ఖడ్గం పరశుమభయదం దక్షభాగే వహంతమ్!
నాగం పాశంచ ఘంటాం ప్రళయహుతవహం సాంకుశం వామభాగే
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి॥ 8

వందే శంభు ముమాపతిం సురుగురుం వందే జగత్కారణమ్।
వందే పన్నగ భూషణం మృగధరం వందే పశూనాం పతిమ్॥
వందే సూర్యశశాంక వహ్నినయనం వందే ముకుంద ప్రియమ్।
వందే భక్త జనాశ్రయంచ వరదం వందే శివం శంకరమ్॥ 9



## 1వ అధ్యాయము భావము

"నేను సాంబసదాశివుని యొక్క దివ్యానుగ్రహముచే పరిశుద్ధ మైనదియు కైవల్యముక్తి నొసంగునదియు, సంసార దుఃఖమునకు ఔషధము వంటిదియునగు పరమేశ్వర తత్త్వమును (పరమాత్మ జ్ఞానమును) ఉపదే శించు చున్నాను". అంటూ సూతమహర్షి శౌనకాది మహర్షులకు శ్రీ శివ గీతను ప్రారంభించెను.

పుణ్య కర్మలు ఆచరించుట వలన గాని దానములు తపములు చేయుట వలనగాని, కైవల్యమనెడు పూర్ణ స్థితిని మానవుడు పొందలేడు. అది ఒక్క జ్ఞానము వలన మాత్రమే కలుగును.

పూర్వము దండకారణ్యములో నున్న సీతాపతియగు రామునకు పార్వతీ పతియగు శివుడు బోధించిన గీతామృతము రహస్యములలో రహస్యమైనది.

ఎద్దానిని (స్మరణ) చేయుట వలన మానవులకు నిశ్చయముగా మోక్షము లభించునో, అట్టిదే శివగీత! దీనిని పూర్వము కుమారస్వామి సనత్కుమారునకు ఉపదేశించెను. అనంతరము సనత్కుమారుడు వేద వ్యాసునకు బోధించెను.

బాదరాయణుడు నాయందు అపారమైన దయతో శివగీతాజ్ఞానమును అనుగ్రహించెను. అంటూ సూతమహర్షి పేర్కొనుచున్నారు.

ఓ సూతపుత్రా ! ఈ గీతాజ్ఞానమును అనధికారులెవ్వరికి చెప్పకూడదు. నీవు చెప్పినచో దేవతలు కోపించి శపించెదరు. అని వ్యాసమునీంద్రుడు ఆదేశించగా వారినిలా అడుగుచున్నారు.

ఓ మునిపుంగవా ! దేవత లెందుకు కోపించి శపించెదరు ? ఈ శివ గీతను ఇతరులు తెలుసుకొనుటవలన దేవతలకు కలుగు నష్టమేమిటి? ఎందుకు కోపించి శపించెదరు ? అని సూతమహర్షి ప్రశ్నించగా పరాశరుని పుత్రుడగు వ్యాసుడు శిష్యవాత్సల్యముతో ఈ విధముగా విశదీకరించు చున్నారు.

అగ్ని హోత్రాది నిత్యకర్మల నొనర్చు గృహస్థులగు భూసురులే దేవతలకు కామధేనువు వంటివారు. అటువంటివారు యజ్ఞయాగాదులను నిర్వహించుచు దేవతలకు ఏయే పదార్థములు ప్రీతికల్గించునో ఆయా భక్ష్యభోజ్య పేయములు అగ్నిముఖమున దేవతలకు హవ్యముగా సమర్పిం చుచున్నారు.

అందువలన వారు అంతులేని ఆనందమును పొందుచు అగ్నిద్వారా సమర్పించిన వాటిని ప్రేమతో స్వీకరించుచున్నారు. ఇంతకన్న దివిలోనున్న దేవతలు కామితములు తీర్చుకొనుట వేరొకసాధనంలేదు.

పాలునిచ్చు ఆవును ఎవరైనా దొంగిలించి తీసుకొనిపోయినచో ఆ ఇంటి యజమాని ఎంతో దుఃఖము అనుభవించును.





# శ్రీ శివగీతా

## అథ ప్రథమోధ్యాయః

## శ్రీ శివభక్తి నిరూపణ యోగః

సూత ఉవాచ

అథాతః స్సంప్రవక్ష్యామి - శుద్ధం కైవల్యముక్తిదమ్ ।
అనుగ్రహా న్మహేశస్య - భవదుఃఖస్య భేషజమ్ ॥ 1

నకర్మణా మనుష్మానైః - నదానై స్తపసాపివా ।
కైవల్యం లభతే మర్త్యః - కింతు జ్ఞానేన కేవలమ్ ॥ 2

రామాయ దండకారణ్యే - పార్వతీ పతినా పురా ।
యా ప్రోక్తా శివగీతాఖ్యా - గుహ్యా ద్గుహ్యాతమా హిసా ॥ 3

యస్యా శ్శ్రవణమాత్రేణ - నృణాం ముక్తి ర్ధ్రువా భవేత్ ।
పురా సనత్కుమారాయ - స్కందేనాభిహితా హిసా ॥ 4

సనత్కుమారః ప్రోవాచ - వ్యాసాయ మునిసత్తమాః।
మహ్యం కృపాతిరేకేణ - ప్రదదౌ బాదరాయణః॥ 5

ఉక్తంచ తేన కస్మై చి - న్న దాతవ్య మిదం త్వయా ।
సూతపుత్రాన్యధా దేవాః - క్షుభ్యంతి చ శపంతి చ ॥ 6

అథ పృష్టో మయావిప్రో - భగవాన్బాదరాయణః ।
భగవన్ ! దేవతా స్సర్వాః - క్షుభ్యంతి చ శపంతి చ ॥ 7

తాసామత్రా ऽ స్తికాహాని - ర్యయా కుప్యంతి దేవతాః।
పారాశర్యో ऽ థ మామాహ - యత్పృష్టం శృణువత్సల ॥ 8

నిత్యాగ్ని హోత్రిణో విప్రాః - సంతియే గృహమేధినః।
త ఏవ సర్వఫలదాః - సురాణాం కామధేనవః॥ 9

భక్ష్యం భోజ్యంచ పేయంచ - యద్యదిష్టం సుపర్వణాం ।
అగ్నౌహుతేన హవిషా - తత్సర్వం లభ్యతే దివి ॥ 10

నాన్యదస్తి సురేశానా - మిష్టసిద్ధి ప్రదం దివి ।
దోగ్ధ్రీ ధేనుర్యథానీతా - దుఃఖదా గృహమేధినాం ॥ 11

అదేవిధంగా జ్ఞాన, యోగమార్గములను అనుసరించు భాగవతులు దేవతలను మరచి, కర్మలు విడిచి పెట్టినప్పుడు క్రతు భుక్కులగు దేవతలు కూడా మిక్కిలి దుఃఖమును పొందెదరు. అందువల్ల తమ మార్గమును వీడి మోక్షగామియగువారికి పలు విధముల విఘ్నములు కల్గించి పెడ త్రోవను పట్టించెదరు. ఆకారణముగా పరమశివుని యందు భక్తి కలుగదు

ఏవిదంగానైన పరమేశ్వరునియందు భక్తి కలిగినప్పటికీ అది సాధనా కాంలో పలువిఘ్నములు లేర్పడి, విచ్ఛిన్నమగును.

పురాకృత పుణ్యవిశేషంవల్ల శివభక్తి దృఢమైనప్పటికీ, విశ్వాసము లేక శివజ్ఞానం కలుగదు.

ఓ మహానుభావా! సూతాత్మజా! దేవతలీ విధముగా విఘ్నములు కల్గించుచున్నందున; సాధకులు ముక్తినెప్పుడు పొందెదరు? గట్టి పట్టుదల కలవారు ఆటంకములను తొలగించుటకు ఏదైనా ఉపాయమును మాకు తెలుపుము. అని శౌనకాది మహర్షులు ప్రార్థించారు. సూతమహర్షి శివభక్తి యొక్క ప్రాశస్త్యమును వివరించుచున్నారు.

శివుని యందు భక్తి కోటి జన్మలముల నుండి చేయు పుణ్యము వలన కలుగు చున్నది. అందువలన మానవుడు-ఇష్టాపూర్తాది కర్మలను ఆచరించును. అనగా యజ్ఞయాగాదులను నిర్వహించడం, వాపీ కూప తటాకాదులను త్రవ్వించడం మున్నగునవి. వాటిని శివార్పణ బుద్ధిచే, కర్మ ఫలమును ఆశించకుండా ఆచరించినప్పుడు తప్పకుండా శివాను గ్రహము కలుగును.

ఎవనికి శివునియందు దృఢమైన భక్తి కలుగునో వారు మహాపాపముల చేతను, ఉపపాపముల చేతను విముక్తుడగును అనాదముతోగాని, మోసంతోగాని, పరి హాసముతోగాని, అసూయతోగాని ఎవడు శివభక్తి పరు డగునో వాడు సకల పాపముల నుండి విముక్తు డగును. శివునియందు భక్తి ఎల్లలోకములు వ్యాపించియున్నది. ఎవరెవరు కోరిన కామితములను నెరవేర్చుచున్నది. అట్టి భక్తిని ఆచరించి, ఎవడు సంసార బంధము నుండి విముక్తిని పొందడో అంతకంటే మందమతి మరొకడు ఉండడు.

ఎవడు నియమముతో శివునకు మారేడు దళములుగాని, పవిత్ర జలము గాని, భక్తిపూర్వకముగా సమర్పించునో; వానికి అభిషేక ప్రియుడైన శివుడు ముల్లోకముల నొసంగును. జలము సమర్పించుటకు అసమర్థుడై నచో ప్రదక్షిణ నమస్కారముచేసిన పరమేశ్వరుడు సంతుష్టుడగును.

ప్రదక్షిణ నమస్కారము కూడ చేయుటకు వీలుపడనిచో, మనస్సులోనే మహాదేవున్ని చింతించవచ్చును. ఆ విధముగ నడచుచున్నప్పుడుగాని, కూర్చుండునప్పుడుగాని పరమ శివున్నే స్మరించిన వానికి బోళాశంకరుడు కోర్కెలను నెరవేర్చును.



తథైవ జ్ఞానవా న్విప్రో - దేవానాం దుఃఖదో భవేత్ ।
త్రిదశాస్తేన విఘ్నంతి - ప్రవిష్టా విషయం నృణాం ॥ 12

తతో నజాయతే భక్తిః - శివే కస్యాపి దేహినః।
తస్మా దవిదుషోనైవ - జాయతే శూలపాణినః॥ 13

యథాకథం చిజ్ఞాతా పి - మధ్యే విచ్ఛిద్యతే నృణామ్ ।
జాతం వాపి శివజ్ఞానం - న విశ్వాసం భజత్యలమ్ ॥ 14

ఋషయ ఊచుః

యదేవ్యవం దేవతా విఘ్న-మాచరంతి తనూభృతామ్ ।
పౌరుషం తత్ర కస్యాస్తి - యేన ముక్తి ర్భవిష్యతి ? 15
సత్యం సూతాత్మజ బ్రూహి - తత్రోపాయోఽస్తి వానవా

సూత ఉవాచ

కోటి జన్మార్జితైః పుణ్యైః - శివే భక్తిః ప్రజాయతే ॥ 16
ఇష్టాపూర్తాని కర్మాణి తే - నాచరతి మానవః।

శివార్పణ ధియా కామాన్ - పరిత్యజ్య యథావిధి 17
అనుగ్రహాత్తేన శంభో-ర్జాయతే సుదృఢో నరః।

తతోభితాః పలాయంతే-విఘ్నం హిత్వా సురేశ్వరాః॥ 18
జాయతే తేన శుశ్రూషా - చరితే చంద్రమౌళినః।

శృణ్వతో జాయతే జ్ఞానం - జ్ఞానాదేవ విముచ్యతే ॥ 19
బహునాఽత్ర కిముక్తేన - యస్య భక్తి శ్శివే దృఢా ।

మహాపాపోపపాపౌఘ - కోటిగ్రస్తో విముచ్యతే ॥ 20
అనాదరేణ సార్ఠ్యయేన-పరిహాసేన మాయయా

శివభక్తిరశ్చే త్వయా-దాంయ్న్యాజోపి విముచ్చతే ॥ 21
ఏవం భక్తిశ్చ సర్వేషాం-సర్వదా సర్వతోముఖీ ।

తస్యాం తు విద్యామానాయాం యస్తుమంత్యోనముచ్చతే॥ 22
సంసార బంధనా త్తస్మా - దన్యః కోవా విమూఢధీ ।

నియమాద్యస్తు కుర్వీత - భక్తింవా ద్రోహమేవ వా॥ 23
తస్యాపి చేత్ప్రసన్నోఽసౌ - ఫలం యచ్ఛతి వాంఛితం ।

రుద్ధం కించిత్సమాదాయ - క్షుల్లకం జలమేవ వా॥ 24

మారేడు చెక్కతో తీసిన చందనము (గంధము) మారేడుదళములు, అడవులలో లభించే పువ్వులు పండ్లు, మున్నగునవి శంకరునకు ప్రియమైనవి.

భక్త శంకరుడైన శంకరుని వదలి, అన్యదేవతలను ఆరాధించువాడు భాగీరథియైన గంగానదిని వదలి, ఎండమావులను కోరువాడే! అనేక జన్మములలో పాపకర్మలు చేసిన మోహమనే అంధకారము ఆవరించిన వారికి ఉపదేశము ప్రకాశించదు. అనగా జ్ఞాన హీనునకు శివతత్త్వము బోధపడదు.

శివుని ఆరాధించుటకు ఆయా కాలములనిగాని, ఆయా దేశములని గాని, ఆయా స్థలములనిగాని నియమములేదు. ఏ కాలమునైన, ఏ దేశమునైన ఏ స్థలమునైన చిత్తములయించి దివ్యానుభూతి కలుగునో; ఆ సమయమున అక్కడ తన ఆత్మస్వరూపుడగు శివుణ్ణి ధ్యానించునేని సాధకుడు శివ సాయుజ్యమును పొందును. అనగా కైవల్యపదమును చేరును. పరమేశ్వరుడు సకల లోకములకు కర్త అక్షయమైన సకలైశ్వర్య సంపన్నుడు. విభూతిధారి.



శివోహం "శివుడునేను" అనే భావమును అభ్యాసము చేసిన సాధకుడు ఎవడైనను వానిని శివుడు తనలో ఐక్యము చేసుకొనును. అనగా సాయుజ్య ముక్తిని అనుగ్రహించును.

ఓ శౌనకాది మునులార ! మునీంద్రులు ఏ వ్రతము చేసి ధర్మము, అర్ధము, కామము, మోక్షము అనే చతుర్విధ పురుషార్ధములను పొందెదరో; అట్టి పాశుపత వ్రతమును గూర్చి చెప్పెదను వినుడు.

విరజాదీక్షలో విభూతిని రుద్రాక్షలను ధరించవలెను. వేద సారమైన 'శివసహస్రనామము'ను జపించుచున్న యెడల మీరు మర్త్యత్వమును వదలి, శివ సంబంధము తనువును పొందెదరు. తర్వాత లోక శంకరుడగు శంకరుడు ప్రసన్నుడై, మీకు ప్రత్యక్షమై కైవల్యము నొసంగును.

పూర్వకాలమున దండకారణ్యంలో తన భార్యను కోల్పోయిన శ్రీరామ చంద్రునకు అగస్త్యమహాముని ఏ యోగశాస్త్రమును ఉపదేశించి యుండెనో అట్టి దానినే సర్వమును మీకును బోధింతును. కనుక అత్యంత భక్తి గలవారై ఆలకించండి అని సూతముని శౌనకాది మునులకు ఉపదేశించెను.

ఇది వ్యాసోక్త శ్రీపద్మపురాణాంతర్గతంబైన శివగీతలో శివభక్తి నిరూపణ యోగము అను మొదటి అధ్యాయం సమాప్తము.



యోదత్తే నియమేనాఽసౌ - తస్మై దత్తే జగత్త్రయం ।
తత్రాఽప్య శక్తో నియమా - న్నమస్కారం ప్రదక్షిణాం ॥ 25
యః కరోతి మహేశస్య - తస్మై తుష్టో భవేచ్ఛివః।
ప్రదక్షిణా స్వశక్తోఽపి - యస్స్వాంతే చింతయేచ్ఛివం ॥ 26
గచ్ఛ న్నముపవిష్టో వా - తస్యాఽభీష్టం ప్రయచ్ఛతి ।
చందనం బిల్వకాష్టస్య - పుష్పాణి వనజాన్యపి ॥ 27
ఫలాని తాదృశాన్యేవ యస్య ప్రీతికరాణివై ।
దుష్కరం తస్య సేవాయాం కిమస్తి భువనత్రయే ॥ 28
వన్యేషు యాదృశీ ప్రీతి-ర్వర్తతే పరమేశితుః।
ఉత్తమేష్వపి నాస్త్యేవ గ్రామ జేష్వపి తాదృశీ ॥ 29
తం త్యక్త్వా తాదృశం దేవం - యస్సేవే తాన్య దేవతామ్ ।
సహి భాగీరథీం త్యక్త్వా - కాంక్షతే మృగ తృష్ణికామ్ ॥ 30
కింతు యస్యాస్తి దురితం - కోటి జన్మసు సంచితమ్ ।
తస్య ప్రకాశతే నాఽయం త్వర్థో మోహాంధ చేతసః॥ 31
నకాల నియమో యత్ర- సదేశస్య స్థలస్యచ ।
యత్రాస్య రమతే చిత్తం - తత్ర ధ్యానేన కేవలం ॥ 32
స్వాత్మత్వేన శివస్యాఽసౌ-శివసాయుజ్య మాప్నుయాత్ ।
అతి స్వల్పతరాయు శ్శ్రీ-ర్భూతేశాంశాధిపోఽపియః॥ 33
సతు రాజాఽహమస్మీతి - వాదినం హంతి సాన్వయం।
కర్తాఽపి సర్వలోకానా మక్షయైశ్వర్య వానపి ॥ 34
శివశ్శివోఽహమస్మీతి వాదినం యంచ కంచన ।
ఆత్మానా సహ తాదాత్మ్య భాగినం కురుతే భృశమ్ ॥ 35
ధర్మార్థకామ మోక్షాణాం-పారం యాస్యంతి యేనవై ।
మునయ స్తత్ప్రవక్ష్యామి వ్రతం పాశుపతాభిదమ్ ॥ 36
కృత్వాతు విరజాం దీక్షాం - భూతి రుద్రాక్షధారిణః।
జపంతో వేద సారాఖ్యం శివనామ సహస్రకమ్ ॥ 37
సంత్యజ్య తేన మర్త్యత్వం - శైవీం తనుమవాప్య చ ।
తతః ప్రసన్నో భగవాన్ - శంకరో లోకశంకరః॥ 38
భవతాం దృశ్యతా మేత్య - కైవల్యం వః ప్రదాస్యతిః
రామాయ దండకారణ్యే - యత్ప్రాదా త్కుంభసంభవః॥ 39
తత్సర్వం వః ప్రవక్ష్యామి శృణు ధ్వం భక్తి యోగినః॥ 40

ఇతిశ్రీపద్మపురాణేశివగీతాయాం ప్రథమోధ్యాయః

## 2వ అధ్యాయము భావము

ఋషులు సూతమహర్షిని ఈ విధంగా ప్రశ్నించుచున్నారు. ఓ మహా ముని దండకారణ్యంలోనున్న శ్రీరాముని వద్దకు అగస్త్యమహాముని ఎందుకు విచ్చేసెను? ఏవిధంగా శ్రీరామునికి విరజాదీక్ష నొసంగెను? ఆ తర్వాత రాముడేమి ఫలము ఆర్జించెను? ఆ సమస్తము మాకు వివరంగా చెప్పవలెనని ప్రార్థించగా...

సూతమహర్షి ఈ విధంగా పల్కుచున్నారు.

ఎప్పుడైతే సహధర్మపత్నియగు సీతాదేవి రావణాసురునిచే అపహరించ బడినదో అపుడు శ్రీరాముడు ప్రియురాలి విరహదుఃఖము వలన రాత్రిపగలు నిద్రలేమి, సరైన ఆహారము, అహంకారంలేనివాడై తన తమ్ముడైన లక్ష్మణు నితో సహా మరణించుటకు ప్రయత్నించెను.

ఈ సంగతి తెలిసికొనిన లోపాముద్రపతియైన అగస్త్యమహర్షి శ్రీరా ముని వద్దకువచ్చి ఈ సంసారముయొక్క నిస్సారతను ఈ విధంగా బోధిం చెను.

ఓ రాజేంద్రా! నీవెందుకు బాధపడుచున్నావు? కాంత ఎవరో విచారించి చూడుము. ఈ దేహము జడమైనది. ఇది పంచభూతములతో నిర్మింపబడి నందున పాంచభౌతికమైనది.

ఆత్మ–ఎట్టి సంబంధములేనిది. అంతటా నిండియున్నది. సచ్చిదానంత స్వరూపమైనది. అది పుట్టదు, చావదు, దుఃఖమును పొందదు.

సూర్యుడు సకల లోకములకు నేత్ర భూతుడైనప్పటికీ; నేత్రదోషములు సూర్యుణ్ణి అంటవు అట్లే సకల భూతములలో నుండు ఆత్మ; ఆయా ఉపాధులు పొందే దుఃఖములను అనుభవించదు.

ఈ దేహము మలపిండాత్మకమైనది. ఇది అవసాన దశయందు జీవము తొలగినప్పుడు జడమై, దహింపడుచున్నది. లేదా నక్కలు కుక్కలు...మున్నగు వానిచే భక్షింపబడుచున్నది. ఇట్టి దేహమునకై ఎందుకీ వ్యథ ?





# శ్రీ శివగీతా

## అథ ద్వితీయోధ్యాయః

## వైరాగ్యోపదేశయోగః

ఋషయ ఊచుః

**కిమర్థ మాగతోఽగస్త్యో – రామచంద్రస్య సన్నిధిమ్ ।**
**కథం వా విరజాం దీక్షాం – కారయా మాస రాఘవమ్ ॥ 1**
**తతః కిమాప్తవాన్ రామః ఫలం తద్వక్తుమర్హసి ।**

సూత ఉవాచః

**రావణేన యదా సీతాఽపహృతా జనకాత్మజా ।**
**తదా వియోగదుఃఖేన – విలపన్నాస రాఘవః॥ 2**
**నిర్నిద్రో నిరహంకారో–నిరాహారో దివానిశమ్ ।**
**మోక్తుమైచ్ఛతత్తః ప్రాణాన్–సానుజో రఘునందనః॥ 3**
**లోపాముద్రాపతి ర్జ్ఞాత్వా–తస్య సన్నిధి మాగమత్ ।**
**అథతం బోధయామాస సంసారాఽసారతాం మునిః॥ 4**

అగస్త్య ఉవాచః

**కిం విషీదసి రాజేంద్ర – కాంతా కస్య విచార్యతాం ।**
**జడః కింను విజానాతి దేహోఽయం పాంచభౌతికః॥ 5**
**నిర్లేపః పరిపూర్ణశ్చ – సచ్చిదానంద విగ్రహః।**
**ఆత్మా నజాయతే నైవ – మ్రియతే నచ దుఃఖభాక్ ॥ 6**
**సూర్యోఽసౌ సర్వలోకస్య – చక్షుష్ట్వేన వ్యవస్థితః।**
**తథాఽపి చాక్షుషై ర్దోషై – ర్నకదా చిద్విలిప్యతే ॥ 7**
**సర్వ భూతాంతరాత్మా పి – తద్వ ద్దుఃఖైర్నలిప్యతే ।**
**దేహోఽపి మలపిండోఽయం – ముక్త జీవోఽజడాత్మకః॥ 8**
**దహ్యతే వహ్నినా కాష్ఠైః – శివాద్యై ర్భక్ష్యతేపిఽ వా।**
**తథాఽపి నైన జానాతి – విరహే తస్య కావ్యథా ॥ 9**

బంగారు వర్ణముగలది, గరిక, శ్యామలము, బిగువైన చనులు (స్తనములు) గలది. దొండపండువంటి క్రిందపెదవిగలది. చంద్రుని వంటి ముఖముగల యువతుల క్రీగంటి చూపుల వలననూ తప్పించుకోలేనివారు అవివేకి. మన్మధునిచేత శిక్షింపబడును.

ఓ రాజా! నీకు ఇక బుద్ధిమంతుని వివేకమును చెప్పుచున్నాను. నీవు సావధానుడవై వినుము.

ఆత్మ–స్త్రీకాదు, పురుషుడుకాదు, నపుంసకుడుకాదు, అది నిరాకారమైనది, నవద్వారములు కల్గిన ఈ పురమునందు ఆత్మ నివాస ముండడం వలన పురుషుడని పేర్కొనబడును. అది పూర్ణము,ద్రష్ట, సాక్షి, జీవనము.

ఓ రామా! కోమలాంగి దేహము కూడ మలపిండాత్మకమే! అది జడపదార్థము అందుచే అది చూడబడదు, వినదు. ఆఘ్రాణించదు. నీ ప్రాణము కన్న మిన్నయని దేనిని భావించెదవో దానిని గూర్చి వివేక బుద్ధితో ఆలోచించుము. అట్టి శరీరము చర్మముతో చేయబడిన తోలుబొమ్మ మాత్రమే అది అసహ్యించుకోవలసినది.

పాంచభౌతికమైన ప్రకృతి వలన ఆత్మయొక్క ఉపాధులు కలుగుచున్నవి ఆత్మ పరిపూర్ణమైనది, సనాతనమైనది. అటువంటప్పుడు పతి ఎవ్వరు? సతి ఎవ్వరు అందరు సహోదరులే!

గృహము కట్టుకున్నప్పుడు అవిచ్ఛిన్నమైన ఆకాశము (ఇంటిలోపలనున్నఆకాశము) గృహములు దహింపబడినను దహింపబడదు. అట్లే దేహముల యందు నుండు ఆత్మ దేహములు నాశనము చెందినను నాశనము చెందదు.

హంతకుడు నేను చంపుచున్నాననియు; హతుడు నేను చంపబడుచున్నానియు తలంచును. కాని, వారు ఉభయులు జ్ఞానముతెలిసిన వారుకాదు. ఎందుకనగా, ఆత్మ చంపబడదు, కనుక నీవు దుఃఖించుటకు కారణము లేదు.

ఓ రామా! నీయొక్క ఆత్మ స్వరూపమును తెలుసుకొనుము. దుఃఖము వదలిపెట్టుము. సుఖవంతుడవగుదువుగాక ! అని, అగస్త్య మహర్షి రామచంద్రుని ఆశీర్వదించెను.



సువర్ణ గౌరీ దూర్వాయా – దళవచ్ఛ్యామలాఽపి వా।
పీనోత్తుంగ స్తనాభోగ – భుగ్న సూక్ష్మావలగ్నకా ॥ 10
బృహన్నితంబ జఘనా–రక్తపాద సరోరుహా ॥ 11
రాకా చంద్రముఖీ బింబ – ప్రతిబింబ రదచ్ఛదా ॥ 12
నీలేందీవర నీకాశ – నయనద్వయ శోభితా।
మత్తకోకిల సల్లాపా – మత్త ద్విరదాగామినీ॥ 13
కటాక్షై రనుగృహ్ణాతి – మాం పంచేషు శరోత్తమైః।
ఇతియో మన్యతే మూర్ఖః – సచ పంచేషుశాసితః॥ 14
తస్యాఽవివేకం వక్ష్యామి–శృణుష్వావహితో నృప।
నచ స్త్రీ నపుమానేష న చైవాఽయం నపుంసకః॥ 15
అమూర్తః పురుషః పూర్ణో–ద్రష్టా సాక్షీ సజీవనః।
యాతన్వంగీ మృదుర్బాలా–మలపిండాత్మికా జడా ॥ 16
సా నపశ్యతి యత్కించిత్ – న శృణోతి న జిఘ్రతి।
చర్మ మాత్రా తనుస్తస్యా బుద్ధ్వా వీక్షస్వ రాఘవ ॥ 17
యా ప్రాణాదధికా సైవ–హంతతే స్యాద్ ఘృణాస్పదం ।
జాయంతే యది భూతేభ్యో దేహినః పాంచభౌతికాః॥ 18
ఆత్మా యదే కలస్తేషు పరిపూర్ణ స్సనాతనః।
కా కాంతా ! తత్ర కః కాంతః సర్వ ఏవ సహోదరాః॥ 19
నిర్మితాయాం గృహావళ్యాం తదవచ్ఛిన్నతాం గతం ।
న భస్తస్యాంతు దగ్ధాయాం న కాంచిత్ క్షతి మృచ్ఛతి ॥ 20
తద్వ దాత్మాఽపి దేహేషు – పరిపూర్ణ స్సనాతనః।
హన్యమానేషు తేష్వేవ – స్వయం నైవ హి హన్యతే ॥ 21
హంతాచే న్మన్యతే హంతుం – హతశ్చే న్మన్యతే హతం।
తావు భౌ నవిజానీతో– నా యం హంతి నహన్యతే ॥ 21
అస్మాన్నృపాతి దుఃఖేన – కిం ఖేద స్యాస్తి కారణం।
స్వస్వరూపం విదిత్వేదం – దుఃఖం త్యక్త్వా సుఖీ భవ॥ 23

శ్రీరాముడు ప్రశ్నించుచున్నాడు; ఓ మునిపుంగవా ! పరమాత్మకును, శరీరంనకు వ్యాధిలేదని మీరాదేశించితిరి. అటులైనచో సీత ఎడబాటుతో కష్టాలుపడుచు, దుఃఖించుచు, మదనబాణాగ్ని నన్ను కాల్చుచున్నది. నిరంతరం యేది అనుభవింపబడుచున్నదో ఆ విధమైనది మిథ్య(మాయ) యని నిరూపించితిరి. అటువంటి దానిని గూర్చి నాకు విశ్వాసం ఎట్లు కలుగును? ఈవిషయం నాకుదయతో తెలియజేయండి ఎట్టి దుఃఖము వలన మనుష్యుడు బాధ చెందునో అట్టిదుఃఖం అనుభవించుటకుగాని, ఎట్టి సుఖము వలన సుఖము అనుభవించునో అట్టి సుఖము వలన అనుభవించు వాడొక్కడే బాధ్యుడు కాని ఇతరులు భోక్తలు ఎట్లు అగుదురో చెప్పుము మునివర్యా!

శాంభవీమాయ శంభునియొక్క మాయాశక్తి! అది తెలుసుకొనుటకు అసాధ్యమైనది. అట్టి మాయాశక్తిచేతనే ఈ జగత్తు మోహింపబడుచున్నది.” అంటూ అగస్త్యమహర్షి రామచంద్రునకు శాంభవీమాయ గూర్చి విశదీకరించుచుండెను.

శాంభవీమాయ ప్రకృతిగాను; ఆ మాయకు ఆధారమైన మాయా మయుణ్ణి మహేశ్వరునిగాను తెలుసుకొనుము. అట్టి మహేశ్వరునియొక్క అవయవరూపమై ఈ చరాచర జగత్తు వ్యాపించియున్నది.

మహేశ్వరుడు సత్య, జ్ఞానస్వరూపుడు, నాశనరహితుడు, విభువు, ఆత్మయు అగును. మహేశ్వరునియొక్క అంశరూపమే జీవులందరి యొక్క హృదయములందు చేరియున్నది.

అగ్నిమథించు కట్టెలనుండి అగ్నికణములు ఏవిధముగా ఉద్భవించునో; అట్లే, అనాదికాలమునుండి చేయబడిన కర్మవాసనాబలముచే మహేశ్వరాంశమైన జీవులు ఆవిర్భవించును. జీవులు అనాది వాసనలతో కూడినందున ‘క్షేత్రజ్ఞ’లని స్మృతులు చెప్పుచున్నవి.

మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము అను నాల్గింటిని అంతఃకరణమందు ప్రతిబింబించు శివాంశమే జీవి.

దేహము స్థావరమని, జంగమమని రెండు విధములుగా చెప్పబడుచున్నది. అందు, స్థావరదేహములు ఒక్కచోట స్థిరముగా నుండి, కదలకుండా నుండును. అవి, చెట్లు పొదలు, తీగలు మున్నగునవి. జంగమదేహములు, ఒక్కచోట స్థిరముగా లేకుండా, కదలుచుండును. అవి, అండజ స్వేదజ, ఉద్భిజాలు, అండజములు - పక్షులు, పాములు మున్నగునవి. ఇవి గ్రుడ్ల నుండి పుట్టును. స్వేదజములు - నల్లులు, దోమలు, మున్నగునవి చెమట, తేమ వలన పుట్టును. ఉద్భిజములు - మనుష్యులు, మృగములు, మున్నగునవి జరాయువును చీల్చుకొని పుట్టును. (ఇందు జరాయు జాలను) ఉద్భిజాల నియు, ఉద్భిజాలను స్థావరాలనియు పేర్కొనడం జరిగింది.



శ్రీరామ ఉవాచ

**మునే! దేహస్య నో దుఃఖం - నైవ చేత్పరమాత్మనః।**
**సీతావియోగ దుఃఖాగ్నిః - మాం భస్మీకురుతే కథమ్ ॥ 24**

**సదాऽను భూయతే యేऽర్థ-సనాస్తీతి త్వయేరితః।**
**జాయతాం తత్ర విశ్వాసః- కథం మే మునిపుంగవ॥ 25**

**అన్యోऽస్తి నాస్తికో భోక్తా - యేన జంతుః ప్రతప్యతే ।**
**సుఖస్య వాపి దుఃఖస్య తద్బ్రూహి మునిసత్తమ ॥ 26**

అగస్త్య ఉవాచ:

**దుర్జ్ఞేయా శాంభవీ మాయా-తయా సమ్మోహ్యతే జగత్**
**మాయాంతు ప్రకృతిం విద్ధి-మాయినం తు మహేశ్వరం॥ 27**

**తస్యావయవ భూతైస్తు-వ్యాప్తం సర్వమిదం జగత్ ।**
**సత్యజ్ఞానాత్మకోऽనంతో-విభురాత్మా మహేశ్వరః॥ 28**

**తస్త్యైవాంవో జీవలోకే - ప్రాణినాం హృదయేస్థితః।**
**విస్ఫులింగా యథావహ్నే - ర్జాయంతే కాష్ఠయోగతః॥ 29**

**అనాది కర్మ సంబంధా త్తద్వదంశా మహేశితుః।**
**అనాది వాసనాయుక్తాః - క్షేత్రజ్ఞా ఇతి తేస్మృతాః॥ 30**

**మనోబుద్ధి రహంకార - శ్చిత్తం చేతి చతుష్టయం ।**
**అంతఃకరణ మిత్యాహు-స్తత్రతే ప్రతిబింబితాః॥ 31**

**జీవత్వం ప్రాప్నుయుః కర్మ - ఫలభోక్తార ఏవతే।**
**తతో వైషయికం తేషాం - సుఖం వా దుఃఖమేవవా॥ 32**

**త ఏవ భుంజతే భోగాऽయ తనేऽస్మిన్ శరీరకే।**
**స్థావరం జంగమంచేతి - ద్వివిదం వపురుచ్యతే ॥ 33**

**స్థావరా స్తత్ర దేహాస్స్యుః - సూక్ష్మా గుల్మలతాదయః।**
**అండజా స్స్వేదజా స్తద్వ - దుద్భిజ్జా ఇతి జంగమాః॥ 34**

**యోనిమన్యే ప్రపద్యంతే- శరీరత్వాయ దేహినః।**
**స్థాణుమన్యే ప్రపద్యంతే - యథాకర్మ యథాశ్రుతం ॥ 35**

జీవుడు ఆయా కర్మఫలములను అనుసరించి, స్థావర, జంగమ దేహము లను పొందును. ఆయా జన్మలను పొందిన జీవుడు సుఖించెదననియు, దుఃఖించెదననియు భావించును. ఇదే 'శివమాయ' అని తెలుసుకొనుము. తాను నిర్లిప్తుడై పరంజ్యోతి స్వరూపుడైనప్పటికి జీవుడు ఈశ్వరమాయచే మోహింపబడుచుండును.

కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అనునవి అరిషడ్వర్గమనబడును. అవి, జీవునకు శత్రువులు! అహంకార గతమైనవి. జాగ్రదవస్థయందును, స్వప్నావస్థయందును, జీవుడు అరిషడ్వర్గ మును బంధింపబడును. సుషుప్త్యవస్థయందు మాత్రము జీవుడే శివుడగును. అట్టి, జీవుడే మరల 'మాయా'ప్రభావముచే సుఖదుఃఖములకు కారణమగు చుండును.

శుక్తి (ముత్యపుచిప్ప) యందు రజతము (వెండి) పోలి, మాయచే శివుని యందు జగత్తు కనుపించును. ఓరామా! వివేకము కల్గిన జ్ఞానముచే చూచినచో దుఃఖమేది? నీవు దుఃఖము పోగొట్టుకొనుము. వ్యర్థముగ దుః ఖింపకుము." అని అగస్త్యమహర్షి రామచంద్రునకు ఉపదేశించెను.

శ్రీరాముడు పలుకుచున్నాడు. ఓయీ ముని పుంగవా ! మీరు నా యందలి అనుగ్రహంచేత ఏమి చెప్పారో అవన్నీ వాస్తవములైనప్పటికీ నా ప్రారబ్ధ రూపమగు ప్రియురాలైన సీతయొక్క ఎడబాటుతో నాలో రగిలిన దుఃఖాగ్ని తగ్గటంలేదు. ఆకారణం వలన ఏమోగాని నా ప్రారబ్ధ రూపుడైన శివుడే అలరువిల్తుని రూపంలో నన్ను రేయింబవళ్ళు వేధించుచున్నారు. అహంకారము గూడ అటువంటిదే. ఈ విధంగా ప్రాణి మిగుల పీడింప బడినచో ఈ జడదేహము వీడిపోవును. కనుక ఓ శివభక్తాగ్రేసరా జీవధారణ చేయుటకు ఉపాయము తెలుపుము అని ప్రార్థించెను.

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గతంబైన శివగీత యందు వైరాగ్యోప దేశయోగము అనుపేరుగల రెండవ అధ్యాయం సమాప్తము.



సుఖ్యహం దుఃఖ్యహం చేతి - జీవ ఏవాఽభిమన్యతే।
నిర్లేపోఽపి పరంజ్యోతి-ర్మోహిత శ్శంభుమాయయా॥ **36**

కామః క్రోధ స్తథా లోభో - మదో మాత్సర్య మేవచ।
మోహశ్చే త్యరిషడ్వర్గ - మహంకార గతం విదుః॥ **37**

స ఏవ బధ్యతే జీవ - స్స్వప్న జాగ్రదవస్థయోః।
సుషుప్తౌ తదభావాచ్చ - జీవ శ్శంకరతాం గతః॥ **38**

స ఏవ మాయయా స్పృష్టః-కారణం సుఖదుఃఖయోః।
శుక్తౌ రజత వద్విశ్వం - మాయయా దృశ్యతే శివే ॥ **39**

తతో వివేక జ్ఞానేన - నకోఽప్య త్రాఽస్తి దుఃఖభాక్ ।
తతోవిరమ దుఃఖాత్త్వం - కిం ముధా పరితప్య సే ॥ **40**

శ్రీరామ ఉవాచ

మునే ! సర్వమిదం సత్యం - యన్మదగ్రే త్వయేరితమ్ ।
తథాపి నజహాత్యేతత్ - ప్రారబ్ధాఽదృష్ట ముల్బణమ్ ॥ **41**

మత్తం కుర్యా ద్యథా మద్యం - నష్టా విద్యమపి ద్విజం ।
తద్వత్ప్రారబ్ధ భోగోఽపి - నజహాతి వివేకినమ్ ॥ **42**

తతః కిం బహునోక్తేన - ప్రారబ్ధ స్సశ్శివస్మరః
బాధతే మాం దివారాత్ర - మహంకారోఽపి తాదృశః॥ **43**

అత్యంత పీడితో జీవః - స్థూలదేహం విముంచతి ।
తస్మా జ్జీవాప్తయే మహ్య ముపాయః క్రియతాం ద్విజ ॥ **44**

ఓం తత్సదితి శ్రీ పద్మపురాణే ఉత్తరఖండే శివగీతా సూపనిషత్సు
బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీ అగస్త్యరాఘవ సంవాదే
వైరోగ్యపదేశో నామ ద్వితీయో ధ్యాయః

## 3వ అధ్యాయము భావము

ఓ రామా! కామము, క్రోధము, మున్నగు అరిషడ్వర్గముచే పీడింపబడు వాడు మంచిమాటలు గ్రహించడు. చావు కోరుకొనువాడు ఔషధమును స్వీకరించుటకు అంగీకరించనట్లే; వానికి హితవచనము రుచించదు. అంటూ, అగస్త్యమహర్షి రామచంద్రునకు ఉపదేశించుచున్నారు.

ఓ నరశ్రేష్ఠా ! మాయావియగు రావణుడు సముద్రమధ్యలోనున్న లంకాద్వీపమునకు సీతను తీసుకొని పోయాడు. అటువంటి నీ భార్య తిరిగి నీ సన్నిధికెలా వస్తుంది ?

ఎవని భవన ద్వారమునందు వానర సమూహమువలె సకల దేవతలు బంధింపబడి యున్నారో, దేవతాస్త్రీలు వింజామరలు పట్టుకొని వీచు చున్నారో; ఎవడు మహేశ్వరుని నుండి వరమును పొంది, మదగర్వముతో ముల్లోకములను నిరాటంకముగా పరిపాలించుచున్నాడో; అట్టి దశకంఠుడైన రావణాసురుణ్ణి జయించడం నీకు సాధ్యమేనా?

అతని కుమారుడైన ఇంద్రజిత్తు శివుని వరముచే అజేయుడైయున్నాడు. అతని ముందు యుద్ధమున ఎన్నో మారులు దేవతలు పలాయనము చిత్త గించారు మరియు దేవతల గర్వము నణచిన కుంభకర్ణుడు; దివ్యాస్త్రములతో కూడియున్న చిరంజీవియగు విభీషణుడు అతని సోదరులే.

దేవదానవులు ప్రవేశింపలేనిది, జయింపరానిదియుఅగు లంకాపురము అతని రాజధాని నగరము. కోట్లకొలది చతురంగ బలము ఎవనికి కలదో, అట్టి రావణుణ్ణి నీవొక్కడవే ఏవిధముగా జయించెదవు ?

బాలుడు ఆకాశమునున్న చంద్రుని పట్టుకోవలెనని కోరుకొనునట్లు; కామమోహితుడవైన నీవు లంకేశ్వరుణ్ణి జయించాలనుకొనుచున్నావు. అని. అగస్త్య మహర్షి పేర్కొన్నారు. అంత, రామచంద్రుడు, తన తక్షణ కర్తవ్య మును వివరించారు.



# శ్రీ శివగీతా



## అథ తృతీయోధ్యాయః
## విరజా దీక్ష నిరూపణ యోగః

అగస్త్య ఉవాచ

న గృహ్ణాతి వచః పథ్యం - కామ క్రోధాది పీడితై ।
హితం న రోచతే తస్య - ముమూర్షోరివ భేషజం ॥ 1

మధ్యే సముద్రం యా నీతా - సీతా దైత్యేన మాయినా।
ఆయాస్యతి నరశ్రేష్ఠ - సా కథం తవ సన్నిధిమ్॥ 2

బధ్యంతే దేవతా స్సర్వా - ద్వారి మర్కటయూథవత్ ।
కించ చామరధారిణ్యో-యస్య సంతి సురాంగనాః॥ 3

భుంక్తే త్రిలోకీ మఖిలాం - యశ్శంభు వరదర్పితః।
నిష్కంటకం తస్య జయః - కథం తవ భవిష్యతి ॥ 4

ఇంద్రజిన్నామ పుత్రోయ - స్తస్యాస్తీ శవరోద్ధతః।
తస్యాగ్రే సంగరే దేవా-బహువారం పలాయితాః॥ 5

కుంభకర్ణాహ్వయో భ్రాతా-యస్యాఽస్తి సురసూదనః।
అన్యో దివ్యాస్త్ర సంయుక్తః-చిరంజీవీ విభీషణః॥ 6

దుర్గం యస్యాఽస్తి లంకాఖ్యం - దుర్జయం దేవదానవైః।
చతురంగ బలం యస్య - వర్తతే కోటి సంఖ్యయా॥ 7

ఏకాకినా త్వయా జేయః - స కథం నృపనందన।
ఆకాంక్షతే కరే ధర్తుం - బాలశ్చంద్రమసం యథా ॥ 8

ఓ మునిశ్రేష్ఠా! నేను క్షత్రియుడను, నా భార్య రావణునిచే అపహరింప బడినది కావున ఆ రాక్షసుణ్ణి చంపి, సీతను తీసుకొని రాకుండా నేను బ్రతికి యుండుటకు ఫలితమేమి ? అందువలన, మీరు బోధించిన తత్త్వ జ్ఞానము వలన నాకేమీ ప్రయోజనకారియుకాదు. కామము, క్రోధము, మున్నగు అరిషడ్వర్గము నా దేహమును దహించుచున్నది. అహంకారము ఎల్లప్పుడు నా ప్రాణములను తీసుకొని పోవుటకు నుద్యుక్తమైయున్నది.

ప్రాణప్రియమైన ధర్మపత్ని అపహరింపబడినప్పుడు, శత్రువుచేత అవమానింపబడినప్పుడు, ఎవనికి తత్త్వజిజ్ఞాస కలిగి, కర్తవ్యచ్యుతుడగునో; వాడే లోకములో పురుషాధముడనబడును.

ఓ మునిశార్దూలా ! సముద్రమును లంఘించి, ఆ రావణున్ని వధించు టకు తగిన ఉపాయమును ఆలోచించి చెప్పండి. మీకంటే నాకు మరియొక గురువులేరు. అని, రామచంద్రుడు ప్రార్థించగా; అగస్త్యమహర్షి దిగువ విధముగా సాధనామార్గము నుపదేశించెను.

ఓ రామా! నీవు నాశన రహితుడు, పార్వతీదేవికి పతియగు పరమేశ్వ రుడు అజేయుడైయున్నాడు. నీకు శంకరభగవానుడు ప్రసన్నుడైనచో, నీ కోరికలను తీర్చగలడు.

రావణాసురుడు ఇంద్రాది దేవతలకు, బ్రహ్మవిష్ణువులకు అజేయుడై యున్నాడు. నీవు శంకరభగవానునియొక్క దివ్యానుగ్రహములేనిచో వాని నీవెట్లు వధించగలవు? అందువలన, శివానుగ్రహము కొరకు నీకు విరజా దీక్ష నొసంగెదను.

విరజాదీక్షను ఆచరించుట ద్వారా నీవు మర్త్యత్వమును వదలి, తేజో మూర్తి వగుదువు. ఈ మార్గము వలన జీవిత రణరంగమునందు అంతర్బహి శ్శత్రువులను సంహరించి, సకలాభీష్టములను పొందగలవు. అంటూ– అగస్త్య మహర్షి ఆశీర్వదించెను.



తథా త్వం కామ మోహేన – జయం తస్యాఽభివాంఛసి ।

శ్రీరామ ఉవాచ

క్షత్రియోఽహం మునిశ్రేష్ఠ – భార్యా మే రక్షసా హృతా ॥ **9**

యది తం న నిహన్మ్యాశు – జీవనే మేఽస్తి కిం ఫలం ।
అత స్తే తత్త్వబోధేన – నమే కించి త్ప్రయోజనమ్॥ **10**

కామ క్రోధాదయ స్సర్వే – దహ్యంత్యే తే తనుం మమ ।
అహంకారోఽపి మే నిత్యం – జీవనం హంతుముద్యతః॥ **11**

హృతాయాం నిజకాంతాయాం – శత్రుణా మమ తస్యవా ।
యస్య తత్త్వబుభుత్సా స్యాత్ – సలోకే పురుషాధమః॥ **12**

తస్మాత్తస్య వధోపాయం – లంఘయిత్వాంఽబుధిం రణే ।
బ్రూహి మే మునిశార్దూల – త్వత్తో నాన్యోఽస్తి మే గురుః॥ **13**

అగస్త్య ఉవాచ

ఏవం చే చ్ఛరణం యాహి – పార్వతీపతి మవ్యయం।
సచే త్ప్రసన్నో భగవాన్ – వాంఛితార్థం ప్రయచ్ఛతి॥ **14**

దేవై రజేయ శ్శక్రాద్యైః – హరిణా బ్రహ్మణాఽపి వా।
సతే వధ్యః కథం వాస్యాత్ – శంకరానుగ్రహం వినా ॥ **15**

అత స్త్వాం దీక్షయిష్యామి – విరజాగమ మాశ్రితః।
తేన మార్గేణ మర్త్యత్వం – హిత్వా తేజోమయో భవ॥ **16**

యేన హత్వా రణే శత్రూన్ – సర్వాన్ కామా నవాప్స్యసి।
భుక్త్వా భూమండలం చాఽంతే శివసాయుజ్యమాప్స్యసి॥ **17**

అనంతరము రాముడు మనిసత్తమునకు దండప్రణామము కావించెను. దుఃఖమును విడిచిపెట్టి, ప్రశాంతమైన మనస్సుకలవాడై; పలుకుచున్నాడు. అని సూతుడు చెప్పెను తర్వాత శ్రీరాముడు–

ఓ అగస్త్యమునీ! నేను కృతార్థుడనైతిని. నా కోరికలు నెరవేరినట్లున్నది. సముద్రమును ఆపోశనము పట్టిన (అరచేతిలో పోసుకొని ఆచమనముగా త్రాగిన) మీరు నా యందు అనుగ్రహము కల్గియున్నారు. అందువలన నాకేదీ లభ్యముకానిది లేదు? ఓ మునిసత్తమా! మీరు విరజాదీక్ష విధానమును నాకు వివరింపుము; అని రాఘవుడు వేడుకొనగా అగస్త్యమహర్షి విశదీకరించుచున్నారు.

విరజాదీక్షయే పాశుపత వ్రతము! దీనిని శుక్లపక్షమున చతుర్దశి, అష్టమి, ఏకాదశి తిధులయందుగాని, సోమవారము నందుగాని, ఆర్ద్ర నక్షత్రమునందుగాని ప్రారంభింపవలెను.

ఎవనిని రుద్రునిగ, పరమేశ్వరునిగ, పరాత్పరునిగ, శివునిగాను; ఎవనిని బ్రహ్మ విష్ణు వహ్ని వాయువదేవులకు జనకునిగ చెప్పబడెనో; ఆ సదాశివుణ్ణి ధ్యానించవలెను. తర్వాత, అగ్నిని పూజించి, పంచభూతములను నియమించవలెను. పిమ్మట, ఐదు, నాలుగు, మూడు, రెండు, ఒక్క తన్మాత్రలచేనైన అమాత్రగనైన, ద్వాదశాంతమందు స్థితుడై, అమృతుడై, పాశుపతవ్రతమును ఆచరింపవలెను. ఇట్టి పాశుపత వ్రతమును గూర్చి తెల్పుచున్నాను, సావధానముగ వినుము.

ప్రాతఃకాలమున స్నానముచేసి, సంకల్పము చెప్పి; తన వేదశాఖను అనుసరించి, అగ్నిని పూజింపవలెను. ఆనాడు ఉపవాసముండి, శుచియై, తెల్లని వస్త్రములు, యజ్ఞోపవీతము, పుష్పచందనములను ధరించవలెను. అటు పిమ్మట విరజామంత్రములచే సమిధలు, ఆజ్యములను హోమము చేయవలెను. "యాతే అగ్ని అను మంత్రమువలన అగ్నిని తనయందు ఆరోపించుకొని, "భస్మదాయాగ్ని" అను మంత్రముచే భస్మమును తీసుకొని, తన శరీరమున ఆయా అంగములందు దాల్చవలెను. ఆవిధముగ విభూతిని ధరించిన సాధకుడు, మహాపాతకముల నుండి విముక్తుడగును. ఇందు సంశయము లేదు.



శ్రీ సూత ఉవాచ

అథ ప్రణమ్య రామస్తం – దండవ న్మునిసత్తమమ్ ।
ఉవాచ దుఃఖనిర్ముక్తః – ప్రహృష్టే నాంతరాత్మనా॥ 18

శ్రీరామ ఉవాచ

కృతార్థో஽హం మునే జాతో – వాంఛితార్థో మమాగతః।
పీతాంబుధిః ప్రసన్నస్త్వం యది మే కిము దుర్లభమ్ ॥ 19

అతస్త్వం విరజాదీక్షాం – బ్రూహి మే మునిసత్తమ ।

అగస్త్య ఉవాచ

శుక్లపక్షే చతుర్దశ్యా – మష్టమ్యాం వా విశేషతః॥
ఏకాదశ్యాం సోమవారే – ఆర్ద్రాయాం వా సమారభేత్ ॥। 20

యమ వాయు మాహుర్యం రుద్రం – శాశ్వతం పరమేశ్వరం 21

పరాత్పరం పరంచాహుః–పరాత్పరతరం శివమ్ ।
బ్రహ్మణో జనకం విష్ణోః–వహ్నే ర్వాయో స్సదాశివమ్ ॥ 22

ధ్యాత్వా஽గ్ని నా஽వసథ్యాగ్నిం – విశోధ్యచ పృథక్పృథక్ ।
పంచభూతాని సంయమ్య – ధ్యాత్వా గుణ విధిక్రమాత్ ॥ 23

మాత్రాః పంచ చతస్రశ్చ – త్రిమాత్రా ద్వి స్తతః పరమ్ ।
ఏకమాత్ర మమాత్రంచ ద్వాదశాంత వ్యవస్థితమ్ ॥ 24

స్థిత్యాం స్థాప్యా஽మృతో భూత్వా–వ్రతం పాశుపతం చరేత్ । 25

ఇదం వ్రతం పాశుపతం – వదిష్యామి సమాసతః।
ప్రాతరేవ తు సంకల్ప్య–నిధాయాగ్నిం స్వశాఖయా॥ 26

ఉపోషిత శ్శుచి స్స్నాతః–శ్శుక్లాంబరధర స్స్వయమ్।
శుక్ల యజ్ఞోపవీతశ్చ – శుక్ల మాల్యానులేపనః॥ 27

జుహుయా ద్విరజోమంత్రైః–ప్రాణాపానాదిభిస్తతః।
అనువాకాంత మేకాగ్ర – స్సమిదాజ్యచరూ న్పృథక్ ॥ 28

భస్మము, అగ్నియొక్క వీర్యము, అందువలన భస్మ సంయుతుడు వీర్య వంతుడగును. బ్రహ్మజ్ఞానము కల్గిన ఏ విప్రుడు, జితేంద్రియుడై; ఎల్లప్పుడు భస్మస్నానము చేయునో; భస్మమునందు శయనించునో; ఆతడు సకల పాపముల నుండి విముక్తుడగును. శివ సాయుజ్యమును పొందును.

ఓరామా! నీవు ఈ విధముగ విరజాదీక్షను ఆచరింపుము. శివనామ సహస్రమును పారాయణ చేయుము. దానివలన నీవు సకలాభీష్టములను పొందగలవు. అంటూ అగస్త్యమహర్షి రామచంద్రునకు వేదసారమైనదియు, నిత్యమైనదియు శివుణ్ణి ప్రత్యక్షము కావించునదియునగు "శివసహస్రనామ స్తోత్రము"ను ఉపదేశించెను.

ఓ రామా! నీవు ఈ శివతారక మహామంత్రమును నిత్యము రేయిం బవళ్ళు జపించుచుండుము. అందువలన శంకరభగవానుడు ప్రసన్నుడై; పాశుపతాస్త్రమును ప్రసాదించును.

పాశుపతాస్త్రముచేత శత్రువులను చంపి, ప్రియురాలగు జానకిని పొంద గలవు. ఆ అస్త్రమహాత్మ్యము వలననే సముద్రమును కూడ శోషింపచేయ గలవు. పార్వతీ పతియై పరమేశ్వరుడు జగత్సంహారకాలమున పాశుపతా స్త్రమునే ప్రయోగించును. అట్టి అస్త్రమును సంపాదించనిచో రావణాది రాక్షసులను జయించడం దుర్లభమే! "నీవు పాశుపతాస్త్రమును పొందుటకు, శంకరునే శరణు వేడుము" అని అగస్త్యమహర్షి, రామచంద్రుణ్ణి ఆశీర్వదిం చెను.

ఇది వ్యాసోక్త శ్రీపద్మపురాణాంతర్గతంబైన శివగీత యందలి
విరజాదీక్ష నిరూపణ యోగము అను మూడవ అధ్యాయము
ముగిసినది.



**ఆత్మన్యగ్నిం సమారోప్య - యాతే అగ్నేతి మంత్రతః।**
**భస్మదాయాగ్ని రిత్యాద్యైః - విమృజ్యాంగాని సంస్పృశేత్ ॥ 29**

**భస్మచ్ఛన్నో భవే ద్విద్వాన్ - మహాపాతక సంభవైః।**
**పాపై ర్విముచ్యతే నిత్యం - ముచ్యతే చ న సంశయః॥ 30**

**అగ్ని వీర్యం యతో భస్మ - వీర్యవాన్ భస్మసంయుతః।**
**భస్మ స్నానరతో విప్రో - భస్మశాయీ జితేంద్రియః॥**
**సర్వపాప వినిర్ముక్త- శ్శివసాయుజ్య మాప్నుయాత్ ॥। 31**

**ఏవంకురు మహారాజ - శివనామ సహస్రకం ।**
**ఇదంతు సంప్రదాస్యామి - తేన సర్వార్థ మాప్స్యసి ॥ 32**

సూత ఉవాచ

**ఇత్యుక్త్వా ప్రదదౌ తస్మై - శివనామ సహస్రకమ్ ।**
**వేదసారాభిధం నిత్యం - శివప్రత్యక్ష కారకమ్ ॥ 33**



**ఉక్తంచ తేన రామత్వం - జపనిత్యం దివానిశం । 34**
**తతః ప్రసన్నో భగవాన్ - మహా పాశుపతాస్త్రకమ్ ।**

**తుభ్యం దాస్యతి తేన త్వం - శత్రూన్ హత్వాౖ ౖప్స్యసి ప్రియాం॥ 35**

**తస్మైవాస్త్రస్య మహాత్మ్యాత్ - సముద్రం శోషయిష్యసి ।**
**సంహారకాలే జగతా - మస్త్రం త త్పార్వతీపతేః॥ 36**

**తదలాభే దానవానాం - జయస్తవ సుదుర్లభః।**
**తస్మాల్లబ్ధుం తదేవాస్త్రం-శరణం యాహి శంకరమ్ ॥ 37**

ఓం తత్సదితి శ్రీ పద్మపురాణే, ఉపరిభాగే శివగీతా సూపనిషత్సు, బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీఅగస్త్య రాఘవ సంవాదే విరజాదీక్ష నిరూణయోగో నామ తృతీయోధ్యాయః॥

## 4వ అధ్యాయము భావము

సూతుడు శౌనకాదులకు చెప్పెను. ఈ ప్రకారముగా అగస్త్య మహాముని శ్రీరామునకు ఉపదేశించి ఆశ్రయమునకు వెళ్ళిపోయెను.

శ్రీరామ చంద్రుడు విరజాదీక్షను ప్రారంభించెను. పవిత్ర గోదావరీ తీరమున గల రామగిరియందు రాముడు, శివలింగమును ప్రతిష్ఠించెను. యధావిధిగ దీక్షను సల్పెను. అతడు సర్వాంగములయందు విభూతిని, మరియు రుద్రాక్షలను ధరించెను. పిమ్మట, గౌతమీ జలముచే శివలింగ మును అభిషేకించెను. వనమునందు లభించే పువ్వులు, పండ్లుతో పరమ శివుణ్ణి పూజించెను. అని, సూతమహర్షి శౌనకాది మహర్షులకు; రాముడు చేస్తున్న 'విరజాదీక్ష' విధానమును వివరించుచుండెను.

భస్మమును దాల్చినరాముడు – భస్మశయ్యపై వ్యాఘ్రచర్మాసనము నందు కూర్చుండెను. అనన్య భక్తితో శివసహస్రనామములను రేయింబవళ్ళు జపించుచుండెను.

ఒక్క మాసమునందు ఫలములను, రెండవమాసమునందు ఆకులను, మూడవ మాసమునందు వాయువును, ఆహారముగా తీసుకొనెను. ఆ విధ ముగా రాముడు విరజాదీక్షను కొనసాగించెను.

రాముడు అంతరింద్రియములను, బహిరింద్రియములను నిగ్రహించి; నిర్మల మనస్సుతో మహేశ్వరుని ధ్యానించెను.

సూర్యుడు, చంద్రుడు, అగ్ని అను మూడు కన్నులను కల్గిన వానిని, విద్యుత్కాంతితో సమానమైన పింగళవర్ణము కల్గిన జడలను ధరించినవానిని, నాగమును యజ్ఞోపవీతముగా దాల్చిన వానిని, వ్యాఘ్రచర్మమును వస్త్రముగ చుట్టిన వానిని, పార్వతీదేవికి దేహార్ధభాగము నొసగిన వానిని, ఆద్యంత ములు లేనివానిని, వర అభయముద్రలను దాల్చిన వానిని, కోటిసూర్యుల యొక్క ప్రకాశమును కల్గినవానిని కోటిచంద్రుల యొక్క శీలము కలవానిని, నిత్యుడు, శాశ్వతుడు, శుద్ధుడు, అక్షరుడు, అవ్యయుడు, సనాతనుడైన వానిని, హృదయ కమలమునందు ఆసీనుడ; మహేశ్వరుని ధ్యానించెను. ఆ విధముగా రాముడు శివుని నిత్యము జపించుచుండెను.

నాలుగు మాసములు గడిచాయి.





# శ్రీ శివగీతా

## అథ చతుర్థోధ్యాయః

## ఈశ్వర ప్రత్యక్ష యోగః

సూత ఉవాచ

ఏవముక్త్వా మునిశ్రేష్ఠే–గతే తస్మి న్నిజాశ్రమమ్ ।
అథ రామగిరౌ రామః–పుణ్యే గోదావరీతటే ॥ 1

శివలింగం ప్రతిష్ఠాప్య – కృత్వా దీక్షాం యథావిధి ।
భూతిభూషిత సర్వాంగో – రుద్రాక్షాభరణై ర్యుతః॥ 2

అభిషిచ్య జలైః పూర్ణైః – గౌతమీసింధు సంభవైః ।
అర్చయిత్వా వన్యపుష్పైః – స్తద్వ ద్వన్యఫలైరపి ॥ 3

భస్మచ్ఛన్నో భస్మశాయీ – వ్యాఘ్రచర్మాసనే స్థితః।
నామ్నాం సహస్రం ప్రజపన్ – నక్తందివ మనన్యధీః ॥ 4

మాసమేకం ఫలాహారో – మాసం పర్ణాశన స్తతః।
మాసమేకం జలాహారో – మాసం చ పవనాశనః॥ 5

శాంతో దాంతః ప్రసన్నాత్మా – ధ్యాయన్నేవం మహేశ్వరమ్ ।
హృత్పంకజే సమాసీన – ముమాదేహార్ధ ధారిణమ్ ॥ 6

చతుర్భుజం త్రిణయనం – విద్యుత్పింగ జటాధరమ్ ।
కోటిసూర్య ప్రతీకాశం – చంద్రకోటి సుశీతలమ్ ॥ 7

సర్వాభరణ సంయుక్తం – నాగ యజ్ఞోపవీతినమ్ ।
వ్యాఘ్రచర్మాంబరధరం–వరదాఽభయధారిణమ్ ॥ 8

వ్యాఘ్ర చర్మోత్తరీయం చ – సురాసుర నమస్కృతమ్ ।
పంచవక్త్రం చంద్రమౌళిం – త్రిశూలడమరూధరమ్ ॥ 9

నిత్యం చ శాశ్వతం శుద్ధం – ధ్రువ మక్షర మవ్యయమ్ ।
ఏవం నిత్యం ప్రజపతో – గతం మాసచతుష్టయమ్ ॥ 10

ఒకనాడు మహానాదము ప్రళయ కాలమునందు మేఘగర్జనవలెను క్షీరసాగరమును మధించునప్పుడు మందరారావము వలెను, త్రిపురాసురులను సంహరించునప్పుడు రుద్రుని బాణాగ్ని ధ్వనివలెను, వినబడెను. అది విన్న రాముడు సంభ్రాంతుడై చూడగానే తనముందు మహాతేజము కనుపించెను. అట్టి తేజస్సుచూచిన రాముడు దశ దిశలను చూడలేని వాడయ్యెను; అందుచే అతని కన్నులు అంధకారమై ఒక్కక్షణకాలము మిక్కిలి మోహాము నందెను.

ఇది రాక్షస మాయగ తలంచుచూ రాముడు, వెంటనే లేచి నిలబడెను. తన ధనస్సును ఎక్కుపెట్టి, బాణములను సంధించెను. ఆగ్నేయ, వారుణ, సౌమ్య, మోహన సౌర, పావక విష్ణుచక్ర మహాచక్ర కాలచక్ర వైష్ణవ,రౌద్ర, బ్రహ్మ,కులిశ, కౌబేర, అనిల, భార్గవ, మున్నగు దివ్యాస్త్రములను అభిమంత్రించి ప్రయోగించెను. పలుశస్త్రములను కూడ ప్రయోగించెను.

శ్రీరాముడు వదిలిన మహాస్త్రములన్ని ఆ గొప్పతేజస్సులో మహాసముద్రమునబడిన వడగండ్ల మాదిరి కరిగిపోయినట్లుగా లీనమైనవి. ఆ మీదట క్షణకాలంలో శ్రీరామచంద్రుని ధనస్సు నేలపైబడి భస్మమైనది మరియు అమ్ములపొది, హస్తకవచ శోధికయు నేలపైబడి దగ్ధమైనవి.

అదిచూచిన లక్ష్మణుడు భయపడి నేలపైబడి మూర్ఛిల్లెను. తరువాత శ్రీరాముడు దిగ్భ్రాంతుడై ఏమీతోచక భూమిపై మోకరిల్లి భయకంపితుడై కనులుమూసుకొని, ఉమాపతే నన్ను కాపాడువాడని తలచి గొంతెత్తి గట్టిగా వేదసార శివసహస్రనామములు పఠించుచు ముమ్మాటికి దీర్ఘదండ నమస్కారాలు చేసెను. ఇంతలోనే మొదటి మాదిరిగా దిక్కులు మారుమ్రోగి మహాధ్వని కలిగెను. ఆ ధ్వనికి భూమి మరియు పర్వతములు కూడా కదలినవి. మరల క్షణకాలములోనే చంద్రుని శీతలతేజస్సు కనపిఇంచినది. శ్రీరాముడు తేరుకొని చూచినంతలోపున, పాలసముద్రమును చిలుకు చుండగా అందులోని ఉద్భవించిన వెన్నముద్దవలె తెల్లగాను, బంగారు వన్నెగలతోక గలది, మరకతమణుల ననుకరించు కొమ్ములు గలది,ఇంద్ర నీలంమణులు ననుకరించు కొమ్ములు గలది, ఇంద్రనీలమణుల కన్నుల గలది, కురుచ కంఠమున కంబలము గలది, రత్నమయమగు త్రాడుగలది, తెల్లని వింజామరము గలది, గంటారావములతో దశదిశలను బూరించునది అగు నందీశ్వరుణ్ణి చూచెను.



అథ జాతో మహానాదః - ప్రళయాంబుధి భీషణః।
సముద్ర మథనోద్భూత - మందరావనిభృద్ధ్వనిః॥
రుద్రబాణాగ్ని సందీప్త - భృశ త్రిపుర విభ్రమః। 11
తమాకర్ణ్యాథ సంభ్రాంతో - యావత్పశ్యతి పుష్కరమ్ ।
తావదేవ మహాతేజో - రామస్యాసీ త్పురో ద్విజాః॥ 12
తేజసా తేన సంభ్రాంతో - నాపశ్యత్స దిశో దశ।
అంధీకృతేక్షణ స్తూర్ణం - మోహం యాతో నృపాత్మజః॥ 13
విచింత్య తర్కయామాస - దైత్యమాయాం ద్విజేశ్వరాః॥ 14
అథోత్థాయ మహావీర - స్సజ్యం కృత్వా ధను స్స్వకమ్ ।
ఆవిధ్య న్నిశితై ర్బాణై - ర్దివ్యాస్త్రైరభిమంత్రితైః॥ 15
ఆగ్నేయం వారుణం సౌమ్యం - మోహనం సౌర పావకమ్ ।
విష్ణుచక్రం మహాచక్రం - కాలచక్రం చ వైష్ణవమ్ ॥ 16
రౌద్రం పాశుపతం బ్రాహ్మం - కౌబేరం కులిశానిలమ్ ।
భార్గవాది బహూన్యస్త్రా - ణ్యయం ప్రాయుంక్త రాఘవః॥ 17
తస్మింస్తేజసి శస్త్రాణి చాఽస్త్రాణ్యస్య మహీపతేః।
విలీనాని మహాభ్రస్య - కరకా ఇవ నీరధౌ ॥ 18
తతః క్షణేన జజ్వాల - ధనుస్తస్య కరాచ్చ్యుతమ్ ।
తూణీరం చాంగులీత్రాణం - గోధికాపి మహీపతేః॥ 19
త ద్దృష్ట్వా లక్ష్మణోభీతః-పపాత భువి మూర్ఛితః।
అథాఽకించిత్కరో రామో - జానుభ్యా మవనిం గతః॥ 20
మీలితాక్షో భయావిష్ట-శ్శంకరం శరణం గతః।
స్వరేణాఽప్యుచ్చర న్నుచ్చై - శ్శంభోర్నామ సహస్రకమ్ ॥ 21
శివం చ దండవ ద్భూమౌ-ప్రణనామ పునః పునః ।
పునశ్చ పూర్వవచ్చాసీ - చ్ఛబ్దో దిఙ్మండలం స్వనన్॥ 22
చచాల వసుధా ఘోరం - పర్వతాశ్చ చ కంపిరే ।
అథ క్షణేన శీతాంశు - శ్శీతలం తేజ ఆదధత్ ॥ 23
ఉన్మీలితాక్షో రామస్తు - యావద్యావత్ప్రపశ్యతి ।
తావద్దదర్శ వృషభం - సర్వాలంకార సంయుతమ్ ॥ 24
పీయూష మథనోద్భూత-నవనీతస్య పిండవత్ ।
ప్రోతస్వర్ణం మరకత - చ్ఛాయా శృంగద్వయాంచితమ్ ॥ 25
నీలరత్నేక్షణం హ్రస్వ-కంఠకంబలభూషితం ।
రత్నపల్యాణ సంయుక్తం - నిబద్ధం శ్వేతచామరైః॥ 26

కోటిసూర్యులయొక్క ప్రకాశము కలవాడును, కోటి చంద్రుల యొక్క శీతలము కలవాడును, వ్యాఘ్రచర్మమును వస్త్రముగ ధరించినవాడును, నాగ(సర్పము)ను యజ్ఞోపవీతముగ దాల్చినవాడును, సర్వాలంకారములతో శోభించువాడును, విద్యుత్కాంతివలె ప్రకాశించువాడును, జటాధరుడును, నీలకంఠుడను, వ్యాఘ్రచర్మమును ఉత్తరీయముగ కలిగినవాడును, చంద్ర శేఖరుడును, నానావిధములైన ఆయుధములను దాల్చినవాడును, పది చేతు లును మూడుకన్నులును కలవాడును, యౌవనవంతుడును, పురుష శ్రేష్ఠ డును, సచ్చిదానంద స్వరూపుడునగు మహాదేవుని దర్శించెను. శ్రీరాముడు.

మరియు అక్కడే అనందముతో సుఖాసీనురాలై పూర్ణచంద్రునివలె ముఖబింబముగల నీలేందీవరమాలిక పగిదిగల మరకత మణికాంతిని విరజిమ్మునది, ఆణిముత్యాల సరసములను దాల్చినది అగుటచే కాంతియుత నక్షత్రయుక్తమై విరాజిల్లురేయివలె నొప్పుచున్నది అణి కుంభస్తనములు కలది, సన్నని నడుముగలదియు అమూల్య రత్నాలంకారములతో ఉండు నదియు, సుగంధపూమాలికలను, దివ్యవస్త్రములను దాల్చినదియు, నల్లని పువ్వులవలెనున్న కన్నులు గలది. విడెముతో గూడినదియు, పతిదేవుని ఆలింగనములతో పులకాంకిత దేహము కలది సచ్చిదానంద శరీరం కలదియు నిఖిల జగన్మాతయగు పార్వతిని చూచెను.

అష్టదిక్పాలకులు తమ కాంతలతో తమ వాహనములపై ఆసీనులై యుండెను. వారు బృహద్రథంతరాది సామములను గానముచేయుచుండెను. అందరికంటె ముందు విష్ణుభగవానుడు లక్ష్మీదేవితో గరుడ వాహనమును ఆరూఢుడై యుండెను. శంఖము, చక్రము, గద మున్నగు వాటిని ధరించి యుండెను. జనార్దనుడు ఏకాగ్రచిత్తముతో "రుద్రాధ్యాయము"ను ఉచ్చరించు చుండెను.

బ్రహ్మదేవుడు సరస్వతీదేవితో హంసవాహనమున ఆసీనుడై యుండెను. చతుర్ముఖములతో చతుర్వేదములయందలి "రుద్రసూక్తము" లచే మహేశ్వ రుణ్ణి స్తుతించుచుండెను.



ఘంటికా ఘర్ఘరీ శబ్దైః - పూరయంతం దిశో దశ!
తత్రా౽౽సీనం మహాదేవం - శుద్ధస్ఫటిక విగ్రహమ్ ॥ 27
కోటిసూర్యప్రతీకాశం - కోటి శీతాంశుశీతలమ్ ।
వ్యాఘ్ర చర్మాంబరధరం - నాగ యజ్ఞోపవీతినమ్ ॥ 28
సర్వాలంకార సంయుక్తం - విద్యుత్పింగ జటాధరమ్ ।
నీలకంఠం వ్యాఘ్ర చర్మో౽త్తరీయం చంద్రశేఖరమ్ ॥ 29
నానావిధాయుధోద్భాసి - దశబాహుం త్రిలోచనమ్ ।
యువానం పురుషశ్రేష్ఠం - సచ్చిదానంద విగ్రహమ్ ॥ 30
తత్రైవ చ సుఖాసీనాం పూర్ణ చంద్రనిభాననామ్ ।
నీలేందీ వరదామాభా - ఉద్య న్మరకతప్రభామ్ ॥ 31
ముక్తాభరణ సంయుక్తాం - రాత్రిం తారాంచితా మివ
వింధ్యక్షితిధరోత్తుంగ - కుచభారభరాలసామ్ ॥ 32
సదస త్సంశయానిష్ట - మధ్య దేశాంతరాం వరామ్ ।
దివ్యాభరణ సంయుక్తాం - దివ్య గంధానులేపనామ్ ॥ 33
దివ్య మాల్యాంబరధరాం - నీలేందీవర లోచనామ్ ।
అలకోద్భాసి వదనాం - తాంబూలగ్రాస శోభితామ్ ॥ 34
శివాలింగన సంజాత - పులకోద్భాసి విగ్రహామ్ ।
సచ్చిదానంద రూపాఢ్యాం - జగన్మాతర మంబికామ్ ॥ 35
సౌందర్య సార సందోహం - దదర్శ రఘునందన ః
స్వస్వవాహన సంబద్ధా - న్నానాయుధల సత్కరాన్ ॥ 36
బృహద్రథంతరాదీని - సామాని పరిగాయతః।
స్వస్వకాంతా సమాయుక్తాన్ - దిక్పాలాన్పరిత స్థితస్తాన్ ॥ 37
అగ్రగం గరుడారూఢం - శంఖచక్ర గదాధరమ్ ।
కాలాంబుద ప్రతీకాశం - విద్యుత్కాంత్యాశ్రితాయుతమ్ ॥ 38
జపం తమేకమనసా - రుద్రాధ్యాయం జనార్ధనమ్ ।
పశ్చాచ్చతుర్ముఖం దేవం - బ్రహ్మాణం హంసవాహనమ్॥ 39
చతుర్వ క్త్రైశ్చతుర్వేద - రుద్రసూక్తైర్మహేశ్వరమ్ ।
స్తువంతం భారతీయుక్తం - దీర్ఘకూర్చ జటాధరమ్ ॥ 40

అథర్వ శిరస్సులతో శివుని స్తోత్రము గావించు మునులను, గంగానది సమేతుడు అగు నీలదేహము గలవాడై శ్వేతాశ్వాతర మంత్రములతో ఉమా కాంతుని స్తుతింతుచున్న సాగరుణ్ణి చూచెను. కైలాస పర్వతమువలె ఉన్నత ములైనవి మణిరత్నాద్యలంకారములతో నొప్పుచున్నవి అయిన కైవల్యోప నిషత్తును పఠించుచు శ్రీ మహాదేవుణ్ణి స్తోత్రము చేయుచున్న అనంతాది గొప్ప యేనుగులను చూచెను మరియు స్వర్ణమయ దండమును చేతబూని అగ్రభాగమున నిలచివున్న నందీశ్వరుణ్ణి కూడా చూచెను.

సాంబశివుని దక్షిణ భాగమునందు గజముఖుడైన వినాయకుడు మూషిక వాహనమును ఆరూఢుడై యుండెను. ఉత్తర భాగమునందు షణ్ము ఖుడైన కార్తికేయుడు మయూర వాహనమును ఆరూఢుడై యుండెను.

భయంకరాకారులైన మహాకాలుడు, చండీశ్వరుడు, ఇరుప్రక్కలయందు నిలబడి యుండెను. దావాగ్ని సమానుడైన కాలాగ్నిరుద్రుడు, కొంచెము దూరములో నుండెను. మూడు పాదములును, వికృతాకారమును కల్గిన భృంగిరిటి నృత్యము చేయుచుండెను. ప్రమథాధిపులు నానా విధాకారము లతో నుండెను.

సర్వత్ర వాహనములతోనున్న మాతృ సమూహములను పంచాక్షరీ మహామంత్రమును పఠించు సిద్ధవిద్యాధరులను, రుద్రగీతాలను గానంచేయు చున్న కిన్నరులను, త్ర్యంబకాది మంత్రములను పఠించు బ్రాహ్మణులను, నృత్యం చేయుచున్న రంబాదులను, వీణలు మీటుచు గీతము నాలపించు ఆకాశములో నాట్యము చేయుచున్న నారదుణ్ని చూచెను. సంగీతములను ఆలపించుచున్న చిత్రరథాది గంధర్వులను, శివునకు కర్ణాలంకారములై కంబళాశ్వతరులను శివగీతాలను గానంచేయు కపాల కంబలులను మహా నాగములను, ఇట్లే అచటనున్న దేవ సభనుచూచి శ్రీరాముడు కృతార్థుడై పట్టరాని సంతోషముతో గద్గద స్వరముతో వేదసార శివసహస్ర నామము లను ఉచ్చరించుచు మహాదేవుని స్తోత్రము చేయుచు మాటిమాటికి ప్రమా ణంబు కావించెను.

ఇది వ్యాసోక్త పద్మపురాణాంతర్గతంబైన శివగీతయను ఈశ్వరప్రత్యక్ష యోగము అనుపేరుగల నాల్గవ అధ్యాయము సమాప్తము.



అథర్వశిరసా దేవం - స్తువంతం మునిమండలమ్ ।
గంగాదితటినీ యుక్త - మంబుధిం నీలవిగ్రహమ్ ॥ 41
శ్వేతాశ్వతర మన్త్రేణ - స్తువంతం గిరిజాపతిమ్ ।
అనంతాది మహానాగాన్ - కైలాసగిరి సన్నిభాన్ ॥ 42
కైవల్యోపనిషత్పాఠా - న్మణిరత్నం విభూషితాన్ ।
సువర్ణవేత్ర హస్తాఢ్యం - నందినం పురత స్థితమ్ ॥ 43
దక్షిణే మూషకారూఢం - గణేశం పర్వతోపమమ్ ।
మయూరవాహనారూఢ - ముత్తరే షణ్ముఖం తథా ॥ 44
మహాకాలం చ చండీశం - పార్శ్వయో ర్భీషణాకృతిమ్ ।
కాలాగ్ని రుద్రం దూరస్థం - జ్వల ద్దావాగ్ని సన్నిభమ్ ॥ 45
త్రిపాదం కుటిలాకారం - నట ద్భృంగిరిటిం పురః।
నానావికార వదనా - న్కోటిశః ప్రమథాధిపాన్ ॥ 46
నానావాహన సంయుక్తం - పరితో మాతృమండలమ్ ।
పంచాక్షరీ జపాసక్తాన్ - సిద్ధ విద్యాధరాదికాన్ ॥ 47
దివ్య రుద్రక గీతాని - గాయత్కిన్నరబృందకమ్ ।
తత్ర త్రైయంబకం మంత్రం - జపద్ద్విజ కదంబకమ్ ॥ 48
గాయంతం వీణయా గీతం - నృత్యంతం నారదం దివి ।
నృత్యతో నాట్యనృత్యేన - రంభాదీ నప్సరోగణాన్ ॥ 49
గాయ చ్చిత్రరథాదీనం - గంధర్వాణాం కదంబకమ్ ।
కంబళాశ్వతరౌ శంభు - కర్ణకుండలతాం గతౌ ॥ 50
గాయంతౌ పన్నగౌ గీతం - కపాలం కంబలం తథా ।
ఏవం దేవసభాం దృష్ట్వా - కృతార్థో రఘునందనః॥ 51
హర్ష గద్గదయా వాచా - స్తువ న్దేవం మహేశ్వరమ్ ।
దివ్యనామ సహస్రేణ - ప్రణనామ పునః పునః॥ 52

ఓం తత్సదితి శ్రీ పద్మపురాణే శివగీతా సూప పనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీశివరాఘవ సంవాదే ఈశ్వరప్రత్యక్ష యోగో నామ చతుర్థోధ్యాయః

## 5వ అధ్యాయము భావము

సూతుడు చెప్పుచున్నాడు.

రాముని ముందు దివ్యమైన బంగారు రథము వచ్చినది. అది అనేక రత్నకాంతులతో దిక్కులను ప్రకాశింపచేయుచున్నది. నాలుగు మహాచక్రములతో, ముత్యాల తోరణములతో, స్వచ్ఛమైన బంగారు గిట్టలు గల గుఱ్ఱములతోనున్నది. అద్దానిపై వృషభ చిహ్నము కల్గిన ధ్వజము ఎగురుచున్నది.

రథమునందు మదపుటేనుగుల చిత్రములతో, పంచ తత్త్వములతో శోభించు చున్నది. పారిజాత పుష్పమాలలతో; కస్తూరి, కర్పూరము, అగరు ధూపములయొక్క సుగంధముతో నున్నది. మేఘధ్వనివలె సకల వాయిద్యములతో, కింపురుషులు కావించు వీణ, వేణునాదములతో నిండియున్నది అగు దేదీప్యమానమగు రథము కనబడెను.

శంకర భగవానుడా శ్రేష్ఠమైన రథమును సృష్టించెను. తాను, పార్వతీ దేవితో కూడినవాడై, వృషభ వాహనము నుండిదిగి, రథమునందు ఆసీనుడయ్యెను. ఆది దంపతులకు దేవతాస్త్రీలు వింజామరములతో వీచుచున్నారు. ఆ చల్లని గాలికి నీలలోహితుడు ఆనందించెను.

మంజీర కంకణముల మ్రోతచేతను, మనోజ్ఞములగు చిరుగజ్జెల చప్పుళ్ళచేతను, వీణావేణు నాదములతోను, చిలుకపలుకులతోను, తెల్లని పావురముల ధ్వనులతోడను ముల్లోకములు నిండెను. శివుని భూషణములగు పాములనుచూచి, నెమళ్ళు తమ పురులచే పింఛములనువిప్పి నృత్యము చేయుచున్నవి.

రామచంద్రుడు శివపార్వతులకు సాష్టాంగ నమస్కారము చేసెను. అప్పుడు సాంబశివుడు సంతోషముతో రాఘవుణ్ణి లేవనెత్తి, తన రథము వద్దకు తీసుకొని వచ్చెను. తరువాత, కమండలములోని జలముచే తాను ఆచమనముచేసి, రాముని చే ఆచమనము చేయించెను. పిమ్మట, ప్రేమతో తన తొడపై కూర్చుండ పెట్టుకొనెను.





## శ్రీ శివగీతా

### అథ పంచమోఽధ్యాయః
### దివ్యాస్త్ర ప్రాప్తి యోగః
### (రామాస్త్రప్రధానయోగః)

శ్రీ సూత ఉవాచ

అథ ప్రాదురభూ త్తత్ర - హిరణ్మయరథో మహాన్।
అనేక దివ్యరత్నాంశు - కిమ్మీరిత దిగంతరః॥ 1

నద్యృపాంతిక పంకాఢ్య - మహాచక్ర చతుష్టయః।
ముక్తాతోరణ సంయుక్త - శ్వేతచ్ఛత్ర శతావృతః॥ 2

శుద్ధ హేమఖురైరాఢ్య - తురంగగణసంయుతః।
ముక్తావితాన విలస - దూర్ధ్వ దివ్య వృషధ్వజః॥ 3

మత్తవారిణకా యుక్తః - పంచ తత్త్వోపశోభితః।
పారిజాత తరూద్భూత - పుష్ప మాలాభిరంజితః॥ 4

మృగనాభీ సముద్భూత - కస్తూరీ మదపంకిలః।
కర్పూరాగరు ధూపోత్థ - గంధాఽఽకృష్ణ మధువ్రతః॥ 5

సంవతర్తఘన ఘోషాఢ్యో - నానావాద్య సమన్వితః।
వీణా వేణు స్వనాసక్త - కిన్నరీగణ సంకులః॥ 6

ఏవం కృత్వా రథశ్రేష్ఠం - వృషాదుత్తీర్య శంకరః।
అంబయా సహిత స్తత్ర - పటతల్పేఽవిశత్తదా॥ 7

సుర నీరజనేత్రీణాం - శ్వేతచామరచాలనైః।
దివ్య వ్యజనవాతైశ్చ - ప్రహృష్టో నీలలోహితః॥ 8

క్వణ త్కంకణనిర్ధ్వానై - ర్మంజు మంజీర శింజితైః।
వీణ వేణు స్వనైర్గీతైః - పూర్ణ మాసీ జ్జగత్త్రయమ్ ॥ 9

శుకవాక్య కలారావై - శ్శ్వేత పారావత స్వనైః।
ఉన్నిద్రభూష ఫణినాం - దర్శనాదేవ బర్హిణః॥ 10

సనృతు ర్దంశయంత స్స్వం - శ్శృంద్రకా న్కోటి సంఖ్యయా ।
ప్రణమంతం తతో రామ - ముత్థాప్య వృషభధ్వజః॥

ఆనినాయ రథం దివ్యం - ప్రహృష్టే నాంతరాత్మనా ॥। 11

అనంతరము గొప్పదైన విల్లును, తరుగని అమ్ముల పొదిని, దివ్యమైన పాశుపతాస్త్రమును అనుగ్రహించెను. అప్పుడు చంద్రమౌళియగు శివుడు ఆదరమున రామునితో ఈ విధముగా పేర్కొనెను.

ఓ రాజా! ఈ పాశుపతాస్త్రము జగత్తుకు వినాశనము కావించునది. మహాభయంకరమైనది. ఉగ్రరూపమైనది. దీనిని సామాన్యయుద్ధమునందు ప్రయోగింపకుము దీనిని ప్రతిఘటించువారు స్వర్గమర్త్య పాతాళలోకముల యందు లేరు. కావున రామా! నీవు ప్రాణము పోవు సమయము వచ్చి నప్పుడు మాత్రమే పాశుపతాస్త్రమును ప్రయోగించుము. అటువంటప్పుడు కాకుండా, దీనిని ప్రయోగించినయెడల, విశ్వమంతయు సర్వనాశమగును. అని శివుడు సూచించెను.

అనంతరము మహేశ్వరుడు దేవతలను, దిక్పాలకులను పిలిపించెను. పిమ్మట పరమప్రీతితో 'ఓ సురులార! మీయొక్క అస్త్రముల నొసంగుము. రాఘవుడా అస్త్రములచే రావణున్ని సంహరించును. ఏ కారణమువలన దేవతలచే చావులేకుండా వరమును రావణునికి ఇచ్చితినో ఆ కారణము వలన మీరందరు వానరులై, యుద్ధమునందు రామునకు సహాయము చేయుము. అటుపిమ్మట మీరున్ను, స్వస్థత పొందగలరు. అని పరమేశ్వరుడు ఆజ్ఞా పించెను.

శివుని ఆజ్ఞను శిరసావహించిన దేవతలు, స్వామి చరణములకు నమస్కరించారు. వారు, తమ దివ్యాస్త్రములను రామునకు ప్రసాదించారు.

నారాయణుడు-నారాయణాస్త్రమును, ఇంద్రుడు ఇంద్రాస్త్రమును, బ్రహ్మ బ్రహ్మాస్త్రమును, అగ్ని ఆగ్నేయాస్త్రమును, యముడు యామ్యాస్త్రమును, నైరుతి మోహాస్త్రమును, వరుణుడు వారుణాస్త్రమును, వాయువు వాయువ్యాస్త్రమును, కుబేరుడు కౌబేరాస్త్రమును, ఈశానుడు రౌద్రాస్త్రమును, సూర్యుడు సౌరాస్త్ర మును, సోముడు సౌమ్యాస్త్రమును, విశ్వేదేవులు- పావకాస్త్రమును, వసు వులు, వాసవాస్త్రమును...మున్నగు దివ్యాస్త్రములను సమర్పించారు.



కమండలుజలై స్స్వచ్ఛై - స్స్వయ మాచమ్య యత్నతః।
సమా చామ్యాఽథ పురతః - స్వాంకే రామ ముపానయత్ ॥ 12

అథ దివ్యం ధనుస్తస్మై - దదౌ తూణీర మక్షయమ్ ।
మహాపాశుపతం నామ - దివ్య మస్త్రం దదౌ తతః॥ 13
ఉక్తశ్చ తేన రామోఽపి - సాదరం చంద్రమౌళినా॥ 14

జగన్నాశకరం రౌద్ర - ముగ్ర మస్త్ర మిదం నృప ।
అతో నేదం ప్రయోక్తవ్యం - సామాన్య సమరాదికే ॥ 15

అన్యోనాస్తి ప్రతీఘాత - మేతస్య భువనత్రయే ।
తస్మా ప్ప్రాణాత్యయే రామ - ప్రయోక్తవ్య ముపస్థితే ॥ 16

అన్యథైతత్ ప్రయుక్తంతు - జగత్సంక్షయకృ ద్భవేత్ ।
అథాఽఽహూయ సురశ్రేష్ఠా - న్లోకపాలా న్మహేశ్వరః॥
ఉవాచ పరమప్రీతః - స్వం స్వ మస్త్రం ప్రయచ్ఛత॥ 17

రాఘవోఽయం చ తై రస్త్రైః-రావణం నిహనిష్యతి॥ 18

తస్మై దేవై రవధ్య స్త్వ - మితి దత్తో వరో మయా ।
తస్మా ద్వానరతా మేత్య- భవంతో యుద్ధదుర్మదాః॥ 19

సాహాయ్య మస్య కుర్వంతు - తేన సుస్థా భవిష్యథ ।
తదాజ్ఞాం శిరసా గృహ్య - సురాః ప్రాంజలయస్తదా ॥
ప్రణమ్య చరణౌ శంభో - స్స్వం స్వ మస్త్రం దదుర్ముదా ॥। 20

నారాయణాస్త్రం దైత్యారి - రైంద్ర మస్త్రం పురందరః॥ 21

బ్రహ్మోఽపి బ్రహ్మదండాస్త్ర - మాగ్నేయాస్త్రం ధనంజయః।
యామ్యం యమోఽపి మోహాస్త్రం - రక్షోరాజ స్తథా దదౌ॥ 22

వరుణో వారుణం ప్రాదా - ద్వాయవ్యాస్త్రం ప్రభంజనః।
కౌబేరం చ కుబేరోఽపి-రౌద్ర మీశాన ఏవ చ ॥ 23

సౌర మస్త్రం దదౌ సూర - స్సౌమ్యం సోమశ్చ పావకమ్ ।
విశ్వేదేవా దదు స్తస్మై - వసవో వాసవాభిధమ్ ॥ 24

అనంతరం దశరథాత్మజుడగు రాముడు సంతుష్టుడై, పరమేశ్వరునకు ప్రణమిల్లెను. అతడు భక్తితో అంజలి బద్ధుడై ఈ విధముగా ప్రార్థించెను.

ఓ శంకరభగవాన్ ! మనుష్యులకు లవణ సముద్రము దాటరానిది. దేవదానవులకు లంకా పట్టణము జయింపరానిది. అచ్చట అనేక కోట్లమంది రాక్షసులున్నారు. వారు బలవంతులు, స్వాధ్యాయనిరతులు, శివభక్తులు, జితేంద్రియులు, మాయాశక్తిపరులు, బుద్ధిమంతులు, నిత్యాగ్నిహోత్రులు. నేను ఒక్కడను, తమ్ముడగు లక్ష్మణుని తోడుగ వారినెట్లు జయింతును ?" అని, రాముడు విచారించుచుండెను; శివుడు హితవు బోధించుచుండెను.

ఓ రామా! రావణున్ని వధించుటకుగాని, రాక్షసులను నాశనము చేయుట గూర్చిగాని నీవు విచారింపకుము. రావణునకు చేటు కాలము దాపురించింది. సువ్రతా! దేవ, బ్రాహ్మణులను పీడించుచు, రాక్షసులు అధర్మ వర్తనులైరి. అందువలన, వారియొక్క ఆయువు, ఐశ్వర్యము క్షయ మగు చున్నది. రాజస్త్రీని అపహరించిన రావణుని నీవు సంహరింపగలవు.

పాపాసక్తుడైన శత్రువులను యుద్ధమునందు జయించడం సాధ్యమే గదా! అధర్మవర్తనుడగు శత్రువు అదృష్టము చేతనే లభించును.

చక్కగ వేదశాస్త్రములను చదివినవాడైనను, ఎల్లప్పుడు ధర్మమార్గమున నడచువాడైనను; వినాశకాలము సమీపించినప్పుడు ధర్మమార్గమునుండి చ్యుతుడగును. అనగా, అధర్మమార్గమున నడచును. దేవతలను బ్రాహ్మణులను మహర్షులను పీడించిన పాపాత్మునకు స్వయముగా వినాశమువచ్చి తీరును.

ఓరామా! కిష్కింధా ప్రాంతములో దేవతల అంశమున పెక్కుమంది వానరులు జన్మించిరి. వారు బలవంతులు అజేయులు, నీకు వారు సహాయము చేయుదురు.



**అథ తుష్టః ప్రణమ్యేశం - రామో దశరథాత్మజః।**
**ప్రాంజలిః ప్రణతో భూత్వా - భక్తియుక్తో వ్యజిజ్ఞపత్ ॥ 25**

శ్రీరామ ఉవాచ

**భగవన్ ! మాను షైరేవ - నోల్లంఘ్యో లవణాంబుధి ।**
**తత్ర లంకాభిధం దుర్గం - దుర్జయం దేవదానవైః॥ 26**

**అనేక కోట యస్తత్ర - రాక్షసా బలవత్తరాః।**
**సర్వే స్వాధ్యాయ నిరతాః - శ్శివభక్తా జితేంద్రియాః॥ 27**

**అనేక మాయా సంయుక్తా - బుద్ధిమంతోఽ గ్నిహోత్రిణః।**
**కథ మే కాకినా జేయా - మయా భ్రాత్రా చ సంయుగే॥ 28**

ఈశ్వర ఉవాచ

**రావణస్య వధే రామ ! రాక్షసామపి మారణే !**
**విచారో న త్వయా కార్య-స్తస్య కాలోఽ య మాగతః॥ 29**

**అధర్మే తు ప్రవృత్తాస్తే - దేవ బ్రాహ్మణ పీడనే !**
**తస్మాదాయుఃక్షయం యాతం - తేషాం శ్రీరపి సువ్రత॥ 30**

**రాజస్త్రీ లంఘనాసక్తం - రావణం నిహనిష్యసి ।**
**ఫాపాసక్తో రిపుర్జేతుం - సుకర స్సమరాంగణే॥ 31**

**అధర్మనిరతః శ్శత్రు - ర్భాగ్యేనైవ హి లభ్యతే ।**
**అధీత వేదశాస్త్రోఽ పి సదా ధర్మరతోపివా ॥ 32**

**వినాశకాలే సంప్రాప్తే ధర్మమార్గా చ్చ్యుతో భవేత్ ।**
**పీడ్యంతే దేవతాస్సర్వా - స్సతతం యేన పాపినా॥**
**బ్రాహ్మణా ఋషయశ్చైవ - తస్య నాశ స్స్వయం స్థితః॥ 33**

**కిష్కింధానగరే రామ ! దేవానా మంశసంభవా ।**
**వానరా బహవో జాతా-దుర్జయా బలవత్తరాః॥ 34**

**సాహాయ్యం తే కరిష్యంతి - తైర్బధాన పయోనిధిమ్ ॥ 35**

వానర సహాయముతో సముద్రమును అనేక శిలలచే బంధించి, సేతువు కట్టుము. ఆ వారధిపై వానరసేనను లంకాపట్టణమునకు తీసుకొని వెళ్ళుము. అక్కడ రావణుని, రాక్షసగణమును సంహరింపుము. పిమ్మట నీ ప్రియసతి యగు సీతను తీసుకొనిరమ్ము.

యుద్ధమునందు శస్త్రములచేత విజయము కలుగునప్పుడు, అచ్చట అస్త్రములను ప్రయోగించరాదు. అస్త్రములులేని వారిపైనను, పారిపోవు శత్రువులపైనను దివ్యాస్త్రములను ప్రయోగించరాదు. అస్త్రములులేని వారి పైనను, పారిపోవు శత్రువులపైనను దివ్యాస్త్రములను ప్రయోగించువాడు తాను స్వయముగ నశించును.

ఓ రామా ! పెక్కు మాటలేల? ఈ చరాచరాత్మకమగు జగత్తు నాచే సృష్టింపబడుచున్నది. నాచే రక్షింపబడుచున్నది. నాచే సంహరింపబడు చున్నది.

నేనే జగత్తునకు మృత్యువును ! మృత్యుదేవతను ! ఈ సకల చరాచర జగత్తును మ్రింగెదను ! అందువలన, యుద్ధమునందు దుర్మదులైన రాక్షసులు నానోట పడినవారే.

నీవు నిమిత్తమాత్రుడుగ నుండుము. ఈ జీవన సంగ్రామములో నీవు కీర్తిని పొందెదవుగాక! అని పార్వతీ పతియగు పరమేశ్వరుడు. సీతాపతి యగు రామునకు అభయమిచ్చెను.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గత మయిన శివగీతయందు
అయిదవ అధ్యాయం రామాస్త్రప్రదాన యోగము సమాప్తము.



అనేకశైలసంబద్ధే - సేతౌ యాంతు వలీముఖాః।
రావణం సగణం హత్వా - తా మానయ నిజప్రియామ్ ॥ **36**

శస్త్రైర్యుద్ధే జయో యత్ర తత్రాఽస్త్రాణి న యోజయేత్ ।
నిరస్త్రే ష్వల్పశస్త్రేషు - పలాయన పరేషు చ ॥
అస్త్రాణి ముంచ న్దివ్యాని - స్వయమేవ వినశ్యతి ॥। **37**

అథ వా కిం బహూక్తేన - మయై వోత్పాదితం జగత్ ।
మయైవ పాల్యతే నిత్యం - మయా సంహ్రియ తేఽపి చ ॥ **38**

అహ మేవ జగన్మృత్యుః మృత్యోరపి మహీపతే ।
గ్రసే ఽహమేవ సకలం - జగ దేత చ్చరాచరమ్ ॥ **39**

మమ వక్త్రగతా స్సర్వే - రాక్షసా యుద్ధదుర్మదాః॥
నిమిత్తమాత్ర త్వం భూయాః కీర్తి మాప్స్యపి సంగరే॥ **40**

ఓం తత్సదితి శ్రీ పద్మ పురాణే శివగీతా సూఽపనిషత్సు బ్రహ్మ
విద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివ రాఘవ సంవాదే రామాస్త్రప్రదాన
యోగో నామ పంచమోఽధ్యాయః

## 6వ అధ్యాయము భావము

ఓ భగవాన్ ! నీవు చెప్పిన విషయమునందు నాకు మహాశ్చర్యము కలుగుచున్నది. నీవు శుద్ధమగు స్ఫటికమువలె తెల్లనివాడవు. త్రినేత్రుడవు. చంద్రశేఖరుడవు. నీవు పరిచ్ఛిన్నమగు మూర్తితో పురుషరూపమును ధరించిన వాడవు.పార్వతీదేవితో కూడినవాడవై,నీ విక్కడ ప్రమథ గణములతోడ విహరించుచున్నావు.

ఓ గిరిజాకాంతా! నీవు పంచభూతాత్మకమైన ఈ చరాచర జగమునకు ఏవిధముగా సృష్టి, స్థితి, లయకారకుడ వగుచున్నావు? నీకునాయందు అనుగ్రహమున్నచో నాకు విశదీకరింపుము అని రాముడు పరిప్రశ్నవేసెను.

ఓ రామా! మంచి ప్రశ్నను అడిగితివి. దేవతలకు కూడా తెలియరాని దానిని, నీయొక్క భక్తి ప్రపత్తులకు, శ్రద్ధాసక్తులకు నీకు చెప్పుచున్నాను. సువ్రతా! నీవు ఈ జ్ఞానము వలన సంసార సాగరమును దాటగలవు." అంటూ శంకరభగవానుడు తన విభూతులను వివరించసాగెను.

కనబడుచున్న పంచమహాభూతములు, చతుర్దశ లోకములు, సముద్రములు, పర్వతములు, దేవతలు, రాక్షసులు, ఋషులు, స్థావరములు, చరములు, గంధర్వులు, ప్రమథులు, నాగములు మొదలగు కనబడుచున్నవి నా విభూతులే.

పూర్వమొకసారి బ్రహ్మాదిదేవతలు నాదు స్వరూపమును దర్శింపతలచి, అత్యంత ప్రియమగు మంధరపర్వతమునకు వెళ్లిరి. వారక్కడ నన్ను స్తుతించిరి. చేతులు జోడించి నమస్కరించిరి.

నేనప్పుడు లీలామాత్రమనస్సు కలవాడనై, వారి జ్ఞానమును హరించితిని.అంత బ్రహ్మాదిదేవతలు అజ్ఞానమువలన "నీవెవ్వడవు?" అని, ప్రశ్నించగా నేనిట్లు సమాధానమిచ్చితిని.

"ఓ దేవతలారా! నేనే సృష్టికి పూర్వము ఉన్న సనాతనుడను! అది దేవుడను వర్తమనమునందునున్నాను! భవిష్యత్తులోను యుండెదను! ఈ లోకములో నాకన్న వేరైనదేదియు మరొక్కటిలేదు.





## శ్రీ శివగీతా

### అథ షష్ఠోఽధ్యాయః

### విభూతి యోగః

శ్రీరామ ఉవాచ

భగవం స్తత్ర మే చిత్రం మహదేత త్ప్రజాయతే ।
శుద్ధ స్ఫటికసంకాశ - స్త్రినేత్ర శ్చంద్రశేఖరః॥ 1

మూర్త ఽ ఽ స్త్వంతు తు పరిచ్ఛిన్నా ఽ కృతిః పురుషరూప ధృత్।
అంబయా సహితో ఽ త్రైవ - రమసే ప్రమథై స్సహ॥ 2

త్వం కథం పంచభూతాది - జగదేత చ్చరాచరమ్ ।
తద్బ్రూహి గిరిజాకాంత - యది తేఽనుగ్రహో యది॥ 3

శ్రీ భగవాన్ ఉవాచ

శృణు రామ! మహాభాగ-దుర్జ్ఞేయ మమరై రపి ।
తత్ప్రవక్ష్యామి యత్నేన - బ్రహ్మచర్యేణ సువ్రత॥ 4

పారం యాస్యస్య నాయాసా-ద్యేన సంసార నీరధేః।
దృశ్యంతే పంచభూతాని - యే చ లోకా శ్చతుర్దశః॥ 5

సముద్రాః పర్వతా దేవా - రాక్షసా ఋషయస్తథా ।
దృశ్యంతే యాని చాన్యాని - స్థావరాణి చరాణి చ ॥ 6

గంధార్వః ప్రమథా నాగాః-స్సర్వే తే మద్విభూతయః।
పురా బ్రహ్మాదయో దేవా-ద్రష్టు కామా మమాకృతిమ్ ॥
మంథరం ప్రయయు స్సర్వే - మమ ప్రియతరం గిరిమ్ ॥। 7

స్తుత్వా ప్రాంజలయో దేవా - మాం తథా పురతస్థ్సితాః॥ 8

తాన్దృష్ట్వాఽథ మయా దేవాన్ - లీలాకులిత చేతసః।
తేషా మపహృతం జ్ఞానం - బ్రహ్మాదీనాం దివౌకసామ్ ॥ 9

ఆసంస్తేఽసక్ర దజ్ఞానా - మామాహుః కోభవా నితి ।
అథాఽబ్రువ మహందేవా - నహమేవ పురాతనః॥ 10
ఆసం ప్రథమమేవాహం - వర్తామి చ సురేశ్వరాః।త
భవిష్యామి చ లోకేఽస్మిన్-మత్తో నాన్యోఽస్తి కశ్చన॥ 11

నేను జగమునకు ఆధారముగ నిత్యుడను ! ఆధేయరూపములో అనిత్యుడను అవిద్యాదోషరహితుడను వేదములకు, బ్రహ్మకు పతిని దశదిశలును నేనే!

సావిత్రి, గాయత్రి (మున్నగు మంత్రములను) నేనే. స్త్రీ పురుష నపుంసకులు మున్నగు శరీరములను నేనే. త్రిష్టుప్, అనుష్టుప్ (మున్నగువైదిక ఛందస్సులను) త్రయామయుడను నేనే.

నేనే సత్యమును, సర్వవ్యాపిని శాంతమును, త్రేత్రాగ్నిని, గౌరవమును వాక్కును, రహస్యమును

నేను జగత్తుకు ప్రభువును ఆకాశమును జ్యేష్ఠుడను సురశ్రేష్ఠుడనే! వరిష్ఠుడను!

ఆర్యుడను (పూజ్యులలో పూజ్యతముడను), నేను భగవంతుడను (సకల ఐశ్వర్యాది షడ్గుణయుక్తుడను!), ఈశ్వరుడను (సర్వసమర్థుడను), తేజస్సును! ఆది కారణమును నేనె ఋగ్యజుస్సామాధర్వణ వేదములచే ఉద్భవించిన పరమాత్మను నేను!

ఇతిహాసములు, పురాణములు, కల్పములు, మంత్రములు, సూత్రములు, వ్యాఖ్యానములు మున్నగునవి, నన్ను ప్రతిపాదించినందున అవి నా స్వరూపములే! హుతము-ఆహుతి, దాత-దానము, ఇహము-పరము, అక్షరము-క్షరము, దాంతి-శాంతి, మున్నగునవి నా స్వరూపములే నాదు స్వరూపము గుహ్యమైనది నాకు జన్మలేదు పరతత్వమును నేను.

నేను అవ్యయుడను! బయట లోపల, ముందు వెనుక, వెలుగు-చీకటి, మున్నగునవి నా స్వరూపములే.

బ్రహ్మ,విష్ణువు, మహేశ్వరుడు, ఉమ, స్కందుడు, వినాయకుడు, ఇంద్రుడు, అగ్ని, యముడు, నిరృతి, వరుణుడు, వాయువు కుబేరుడు, ఈశానుడు, ఊర్ధ్వలోకములు, పృథివి, జలము, మున్నగు పంచమహాభూతములు; సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, గ్రహములు,ప్రాణము, కాలము, మృత్యువు, అమృతము మొదలగు వాటియందు తాదాత్మ్యరూపములో నున్నాను-నేను!



వ్యతిరిక్తం చ మత్తోఽస్తి నా ఽన్యత్కించి త్సురేశ్వరాః।
నిత్యోఽనిత్యోఽహ మనఘో-బ్రహ్మణాం బ్రహ్మణస్పతిః॥ 12

దక్షిణాంచ ఉదంచో ఽహం-ప్రాంచః ప్రత్యంచ ఏవ చ ।
అథ శ్చోర్ధ్వం చ విదిశో దిశశ్చా ఽహం సురేశ్వరాః॥ 13

సావిత్రీ చాపి గాయత్రీ-స్త్రీ పుమా నపుమాన పి ।
త్రిష్టుప్ జగత్యనుష్టుప్చ - పంక్తిశ్ఛంద స్త్రయామయః॥ 14

సత్యోఽహం సర్వత శ్శాంతః - త్రేతాగ్ని ర్గౌరవం గురుః।
గౌరహం గహ్వరం చాహం - ద్యౌరహం జగతాం విభుః॥ 15

జ్యేష్ఠ స్సర్వసురశ్రేష్ఠో-వర్షిష్ఠోఽహ మపాంపతిః।
ఆర్యోఽహం భగవానీశ-స్తేజో ఽహం చాదిరప్యహమ్॥ 16

ఋగ్వేదోఽహం యజుర్వేదః - సామవేదోఽహ మాత్మభూః।
అధర్వణశ్చ మంత్రోహం - తథాచాంగిరసో వరః॥ 17
ఇతిహాసపురాణాని - కల్పోఽహం కల్పవా నహమ్ ।
నారాశంసి చ గాథాఽహం-విద్యోపనిషదోఽ స్మ్యహమ్॥ 18
శ్లోకా స్సూత్రాణి చైవాహా-మనువ్యాఖ్యాన మేవ చ।
వ్యాఖ్యానాని తథా విద్యా - ఇష్టం హుత మథాఽహుతిః॥ 19
దాతా దత్తమయం లోకః-పరలోకోఽహ మక్షరః।
క్షర స్సర్వాణి భూతాని - దాంతి శ్శాంతిరహం ఖగః॥ 20

గుహ్యోఽహం సర్వేవేదేషు- అరణ్యోఽహ మజోఽప్యహమ్ ।
పుష్కరం చ పవిత్రం చ - మధ్యంచాఽహ మతఃపరమ్ ॥ 21

బహిశ్చాహం తథాచాంతః - పురస్తాదహ మవ్యయః।
జ్యోతిశ్చాహం తమశ్చాహం - తన్మాత్రా ణీంద్రియాణ్యహమ్॥ 22

బుద్ధిశ్చాహ మహంకారో - విషయాణ్యహ మేవహి !
బ్రహ్మావిష్ణుర్మహేశోఽహ - ముమా స్కందో వినాయకః॥ 23
ఇంద్రోఽగ్నిశ్చ యమశ్చాహం - నిరృతి ర్వరుణోఽనిలః।
కుబేరోఽహం తథేశానో - భూర్భువ స్స్వర్మహర్జనః॥ 24

తపస్సత్యం చ పృథివీ-చాపస్తేజో ఽనిలోఽప్యమహమ్।
ఆకాశోఽహం రవి స్సోమో-నక్షత్రాణి గ్రహాణ్యహమ్॥ 25

ఆదిని, ఓంకార స్వరూపుడను మధ్యమున భూర్భువస్సువాది స్వరూపుడను! అంతమున విశ్వరూపుడను జపించెడి వారలకు శిరః స్థలమునగుదును.

తినబడినది త్రాగబడినది నేనే ! చేయబడినది చేయబడనిది నేనే ! ఉత్కృష్టమైనది నేనే ! సకల వ్యవహారములకు ఆశ్రయమైనది నేనే !

నేను కర్మ రూపములో జగత్తునకు హితమును ! దివ్యమైన అక్షరమైన సూక్ష్మరూపముచేత, లోకమును ధరించియున్నాను. ప్రాజాపత్యాది యజ్ఞములు, నిష్కామకర్మలు నా స్వరూపములే!

నేను జగత్తును ఉపసంహరించువాడను. తేజోనిధిని సకల ప్రాణుల హృదయములో ఉండువాడను నేనే !

త్రిమాత్రాత్మకమగు ఓంకారమును నేను. ఎవనికి ఉత్తరమున శిరస్సు దక్షిణమున పాదములుండునో అట్టి సర్వోత్తముడను నేను!

భక్తులయొక్క దురితములను హరింతును. వారిని ఊర్ధ్వలోకముల నొందింతును. పాపులను అథోలోకముల నొందింతును. కావున, నిత్యము సనాతనము -ఏకమగు ఓంకార స్వరూపుడను నేను.

ఋగ్యజుస్సామవేదములు - నేనే! ఏ కారణమువలన యజ్ఞకర్మల యందు బ్రాహ్మణులను ప్రణామము చేయించుచున్నానో ఆకారణము వలన ప్రణవ స్వరూపుడను నేను.

సకల జీవులలో మాంసపిండము వ్యాపించియున్నట్లు నేను సకల లోకములలో నిండియున్నాను. అందువలన సర్వవ్యాపిని నేనే!

బ్రహ్మదేవుడు, విష్ణుభగవానుడు మున్నగు దేవతలు నా యొక్క ఆద్యంతములను తెలుసుకొనలేకపోయిరి. అందుచే నన్ను అనంతుడని అందురు.

గర్భదుఃఖము, జన్మదుఃఖము, జరాదుఃఖము. మృత్యుదుఃఖము మున్నగు దుఃఖరూపమగు సంసారసాగరము నుండి భక్తులను దాటింతును. కనుక తారుడను నేను.



ప్రాణః కాలస్తథా మృత్యు-రమృతం భూతమవ్యహమ్ ।
భవ్యం భవిష్య త్కృత్స్నంచ - విశ్వం సర్వాత్మ కోఽ వ్యహమ్ ॥ 26

ఓమాదౌ చ తథా మధ్యే - భూర్భువస్స్వ స్తథైవచ ।
తతోఽ హం విశ్వరూపోఽ స్మి - శీర్షం చ జపతాం సదా ॥ 27

అశితం పాయితం చాహం - కృతం చాకృత మప్యహమ్ ।
పరం చైవాపరం చాహ - మహం సర్వ పరాయణః॥ 28

అహం జగద్ధితం దివ్య - మక్షరం సూక్ష్మమవ్యయమ్ ।
ప్రాజాపత్యం పవిత్రం చ - సౌమ్య మగ్రాహ్య మగ్రియమ్ ॥ 29

అహమే వోపసంహర్తా - మహాగ్రా సౌజసాం నిధిః
హృదయే దేవతాత్వేన - ప్రాణత్వేన ప్రతిష్ఠితః॥ 30

శిరశ్చోత్తరతో యస్య - పాదౌ దక్షినత స్తథా ।
యస్య సర్వోత్తర స్సాక్షా - దోంకారోఽ హం త్రిమాత్రకః॥ 31

ఊర్ధ్వము న్నామయే యస్మా - దధ శ్చాపనయా మ్యథ।
తస్మా దోంకార ఏవాహ - మేకో నిత్య స్సనాతనః॥ 32

ఋచో యజూంషి సామాని - యో బ్రహ్మ యజ్ఞకర్మణిః।
ప్రణామయే బ్రాహ్మణేభ్య - స్తేనాహం ప్రణవో మతః॥ 33

స్నేహో యథా మాంసఖండం - వ్యాప్నోతి వ్యాపయత్యపి ।
సర్వలోకానహం తద్వ - త్సర్వవ్యాపీ తతోఽ స్మ్యహమ్ ॥ 34

బ్రహ్మాహరిశ్చ భగవా-నాద్యంతం నోపలబ్ధవాన్ ।
తతోఽ న్యేచ సురాః యస్మా-దనంతోఽ హ మితీరితః॥ 35

గర్భ జన్మ జరా మృత్యు - సంసారభయ సాగరాత్ ।
తారయామి యతో భక్తం - తస్మా త్తారోఽ హ మీరితః॥ 36

అండజ, స్వేదజ, జరాయుజ, ఉద్భిజ్జాలనే చతుర్విధ దేహములయొక్క హృదయములయందు జీవుని రూపములో సూక్ష్మముగా నివాసముండెదను. అందుచే నేను సూక్ష్ముడను!

అజ్ఞాన రూపమగు గాడాంధకారములో నిమగ్నమైన నాదు భక్తులకు విద్యుత్ప్రకాశము వలె భాసురరూమును చూపించెదను. అందుచే వైద్యుతాభిఖ్యుడను నేను.

నేను ఒక్కడనే! ఏ కారణము వలన లోకములను సృష్టి, స్థితి, లయము చేసెదనో; ఆ కారణము వలన నేనొక్కడనే ఈశ్వరుడును.

నాకంటే రెండవవాడు లేడు! తురీయమగు పరబ్రహ్మమును నేను! ప్రళయకాలమునందు సకల జీవులను నాదు హృదయములోనికి తీసుకొందును. కావున నేనొక్కడనే రుద్రుడను.

నేను ఈశినీ! శక్తులతో జగత్తును శాసించెదను. సకల లోకములకు సర్వాంతర్యామిని జగచ్చక్షువును నేను!

నేను సకల చరాచర కోటి జీవరాశికి, సకల విద్యలకు అధీశ్వరుడను అందువలన ఈశానుడను నేను.

సర్వభావములను నిరీక్షించెదను. ఆత్మజ్ఞానమును కల్గించెదను అందు వలన నేనే భగవానుడను.

ఎల్లప్పుడు సకల లోకములను నాలోనికి స్వీకరించెదను. తిరిగి బయటకు విడచెదను. మరల కల్పించెదను. కావున నేనే మహేశ్వరుడను మహత్తరమైన ఆత్మజ్ఞానమును, యోగము, విభూతులచేత సర్వభావములను సృజించుచున్నాను. అట్టి మహాదేవుడను నేను.

నేను సకల దిశలలో వ్యాపించి యున్నాను. పుట్టునవి-పుట్టినవి, పుట్టబోవునవి అన్నియు నేనే సర్వతో ముఖుడను ఆదిదేవుడను నేను.

విశ్వమే చక్షువులుగ, ముఖములుగ, బాహువులుగ, పాదములుగ, కలవాడను నేను. విశ్వమునకు పాలకుడను ద్యులోకము, భూలోకము... మున్నగు వాటి స్రష్టను నేనే.



చతుర్విధేషు దేహేషు - జీవత్వేన వసామ్యహమ్ ।
సూక్ష్మో భూత్వాఽథ హృద్దేశే - యత త్సూక్ష్మః ప్రకీర్తితః॥ **37**

మహాతమసి మగ్నేభ్యో - భక్తేభ్యో యత్ప్రకాశయే ।
విద్యుద్వ దతులం రూపం-తస్మా ద్వైద్యుత మస్మ్యహమ్ ॥ **38**

ఏక ఏవం యతోలోకాన్-విసృజామి సృజామి చ ।
వివాసయామి గృహ్ణామి - తస్మాదేకోఽహ మీరితః॥ **39**

న ద్వితీయో యతస్తస్థే - తురీయం బ్రహ్మ యత్స్వయమ్ ।
భూతాన్యాత్మని సంహృత్య - చైకో రుద్రో వసామ్యహమ్ ॥ **40**

సర్వలోకా న్యదీశేఽహ - మీశినీభిశ్చ శక్తిభిః।
ఈశాన మస్య జగతః - స్వర్దృశం చక్షురైశ్వరమ్ ॥ **41**

ఈశాన మింద్రతస్థుషః - స్సర్వేషా మపి సర్వదా ।
ఈశాన స్సర్వవిద్యానాం - య దీశాన స్తదస్మ్యహమ్ ॥ **42**

సర్వాన్భావా న్నిరీక్షేఽహ - మాత్మజ్ఞానం నిరీక్షయే ।
యోగం చ సమయే యస్మా-ద్భగవా న్మహతో మతః॥ **43**

అజస్రం యచ్చ గృహ్ణామి - విసృజామి సృజామి చ ।
సర్వాన్ లోకాన్వాసయామి - తేనాహం వై మహేశ్వరః॥ **44**

మహత్స్వాత్మజ్ఞాన యోగై - రైశ్వర్యైస్తు మహీయతే ।
సర్వాన్భావా న్మహాదేవ - స్సృజత్యవతి సోఽస్మ్యహమ్ ॥ **45**

ఏషోఽస్మి దేవః ప్రదిశోఽపి సర్వాః - పూర్వో హి జాతోస్మ్యహమేవగర్భే।
అహం హి జాతశ్చ జనిష్యమాణః-ప్రత్యగ్జనాస్తిష్ఠతి సర్వతోముఖః॥ **46**

విశ్వతశ్చక్షు రుత విశ్వతో ముఖో - విశ్వతో బాహురుత విశ్వత స్సాత్ ।
సం బాహుభ్యాం దమతి సం పతత్రై-ర్ద్యావాభూమీ జనయన్దేవ ఏకః॥**47**

హృదయాకాశము మధ్యలో వాలాగ్రమాత్రము (వెంట్రుక చివరి భాగము) వలె జ్యోతిస్వరూపముగ నేనున్నాను! నన్ను విశ్వదేవునిగ, ఆత్మస్థునిగ – ధీరులు దర్శింతురు. అట్టివారికే శాశ్వతమగు శాంతి కలుగును. ఇతరులకు కలుగనేరదు.

నేను సర్వకారణ భూతుడను! అయిదు విధములుగ (పంచమహాభూతములచేత) ప్రపంచమంతయు నిర్మించి, అంతర్యామినై నేనున్నాను ఈ విధముగ నన్ను పరమేశ్వరునిగ, పురాణపురుషునిగ, దేవదేవునిగ భావించువారు మిక్కిలి శాంతిని పొందుదురు.

ఆకలిదప్పులు...మున్నగు వాటికి ఆధారము ప్రాణము. అందులోనున్న ఆత్మకు కారణముగ నన్ను భావించెదరు. తృష్ణనువీడి, కారణ కారణుడనగు నాయందు మనస్సునిలిపి, ఎవ్వరు ధ్యానించి, భజించెదరో; వారికే శాశ్వతమగు శాంతి కలుగును. ఇతరులకు కలుగనేరదు.

వాక్కు, మనస్సులకు, గోచరించదు ఆనంద బ్రహ్మస్వరూపము. అట్టి నాయొక్క స్వరూపమును తెలుసుకొన్న జ్ఞాని, ఎందువలన కూడ భయము నొందదు.

దేవతలందరు నాదు మాటలువిని, కైవల్య జ్ఞానమును తెలుసుకొనిరి. వారు నాయొక్క దివ్యనామములను జపించిరి. వారు జపధ్యాన పరాయణులై, దేహావసాన సమయమునందు నా సాయుజ్యమును పొందిరి. అందువలన ప్రపంచములోని పదార్థములన్నియు నాదు విభూతులే!

సర్వము నాయందే పుట్టినది. నాయందే ప్రతిష్ఠితమైనది. నాయందే లయమగుచున్నది. కావున, అద్వయమగు పరబ్రహ్మమును నేను!

అణువుకన్న అణువును, మహత్తుకన్న మహత్తును, విశుద్ధుడను, పురాతనుడను నేను. పురుషుడను నేను. హిరణ్మయుడను, శివస్వరూపుడను నేను!



వాలాగ్రమాత్రం హృదయస్య మధ్యే
విశ్వేదేవం జాతవేదం వరేణ్యమ్।
మా మాత్మస్థం యేఽను పశ్యంతి ధీరా
స్తేషాం శాంతి శ్శాశ్వతీనేతరేషామ్॥ **48**

అహం యోని మధితిష్ఠామి చైకో-మయేదం పూర్ణం పంచవిధం చ సర్వమ్।
మామీశానం పురుసం దేవ మిత్థం-విచార్యమాణం శాంతిమత్యంతమేతి॥ **49**

ప్రాణేష్వంత ర్మనసో లింగమాహు-ర్యస్మిన్న శనాయాచ తృష్ణాక్షమాచ ।
తృష్ణాం ఛిత్వా హేతుజాలస్య మూలం-బుద్ధ్యాచిత్తం స్థాపయిత్వామయిహా॥
ఏవం యే మాం ధ్యాయమానా భజంతే-తేషాం శాంతిశాశ్వతీనేతరేషామ్॥ **50**

యతో వాచో నివర్తంతే – అప్రాప్య మనసా సహ ।
ఆనందం బ్రహ్మ మాం జ్ఞాత్వా- న బిభేతి కుతశ్చన। **51**

శ్రుత్వేతి దేవా మద్వాక్యం – కైవల్య జ్ఞానముత్తమమ్ ।
జపంతో మమ నామాని-మమధ్యాన పరాయణాః॥ **52**

సర్వే తే స్వస్వదేహాంతే-మత్సాయుజ్యం గతాఃపురా। **53**
తతో యే పరిదృశ్యంతే- పదార్థా మద్విభూతయః।

మయ్యేవ సకలం జాతం – మయి సర్వం ప్రతిష్ఠితమ్ ॥ **54**

మయి సర్వం లయం యాతి – తద్బ్రహ్మాఽద్వయ మస్మ్యహమ్।
అణోరణీయా నహమేవ తద్వ-న్మహా నహం విశ్వమహం విశుద్ధః॥
పురాతనోఽహం పురుషోఽహ మీశో-హిరణ్మయోఽహం శివరూపమస్మి॥ **55**

కరచరణములు లేకుండానే నేను అచింత్యమాయాశక్తి స్వరూపుడను! కన్నులు లేకుండానే చూచుచుందును. ఆకాశస్వరూపుడను. నన్ను తెలుసు కొను వారొకరునులేరు. నేను చిత్స్వరూపుడనై; సకలమును తెలుసు కొందును.

సకల వేదములచేత తెలియదగినవాడను నేనే. వేదాంతులు వివరించిన వాడను నేనే. వేదార్థమును తెలుసుకొనినవాడను నేనే.

నాయందు పుణ్యము, పాపములు లేవు. నాకు నాశములేదు. నాకు జన్మము లేదు. నాకు దేహేంద్రియ బుద్ధి రూపమగు ఉపాధులులేవు. నేను– భూమి, జలములను కాను! అగ్ని, వాయువులను కాను! ఆకాశమును కాను! (అనగా నాకు–భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములు లేవు!)

ఎవ్వరీ ప్రకారముగ – పరమాత్మ స్వరూపునిగాను, నిష్కకలునిగాను, అద్వితీయునిగాను, సర్వసాక్షిగాను, సత్ అసత్ రహితునిగాను, నన్ను తెలియుదురో వారు పరిశుద్ధుడగు పరమేశ్వర స్వరూపమును పొందెదరు. ఓ రామ మహీపతీ! ఎవ్వరీ ప్రకారముగ, తత్వ జ్ఞానముచేత, నన్ను తెలుసు కొందురో; వారు కైవల్య పదమును పొందెదరు. ఇతరులు పొందలేరు. అని శంకరభగవానుడు రామచంద్రునకు వివరించెను.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గతమయిన శివగీత యందు విభూతియోగం అను ఆరవ అధ్యాయం సమాప్తము.



**అపాణిపాదో౽హ మచింత్యశక్తిః**
**పశ్యామ్య చక్షు స్సృశృణోమ్యకర్ణః**
**అహం విజానామి వివిక్తరూపో**
**న చాస్తి వేత్తా మమ చిత్సదాహమ్ ॥ 56**

**వేదైరనేకై రహమేవ వేద్యో**
**వేదాంత కృ ద్వేదవిదేవ చాహమ్ ।**
**న పుణ్యపాపే మయి నాస్తి నాశో**
**న జన్మ దేహేంద్రియ బుద్ధిరస్తి ॥ 57**

**న భూమి రాపో న చ వహ్నిరస్తి**
**నచానిలో మేస్తి నమే నభశ్చా 58**

**ఏవం విదిత్వా పరమాత్మరూపం**
**గుహాశయం నిష్కల మద్వితీయమ్ ।**
**సమస్త సాక్షిం సదసద్విహీనం**
**ప్రయాతి శుద్ధం పరమాత్మ రూపమ్ ॥ 59**

**ఏవం మాం తత్త్వతో వేత్తి – యస్తు రామ మహీపతే ।**
**స ఏవ నాన్యో లోకేషు – కైవల్యఫల మశ్నుతే ॥ 60**

ఓం తత్సదితి శ్రీ పద్మపురాణే శివగీతా సూ౽పనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివరాఘవ సంవాదే విభూతి యోగో నామ షష్ఠోధ్యాయః

## 7వ అధ్యాయము భావము

ఓ భగవాన్! నే నిది వరకు అడిగిన ప్రశ్నకు సరైన సమాధానమును చెప్పలేదు. మహేశ్వరా! పరిచ్ఛిన్నమగు పరిమాణము కల్గిన నీ దేహము నుండి సకల భూతములు ఏవిధముగ ఉత్పత్తి, స్థితి, విలయములగు చున్నాయి.

ఓ దేవదేవా! తమ అధికారములలో నుండి సృష్ట్యాదుల నొనర్చు బ్రహ్మాది దేవతలును, చతుర్దశభువనములును ఏ ప్రకారముగా నీవే అగు చున్నావు?

ఓ పరమేశ్వరా! నీ వలన జ్ఞానము విన్నప్పటికీ, నా సందేహము నివృత్తి కావడంలేదు. అందువలన సంశయగ్రస్తమైన నా చిత్తములోని సందేహమును, వారించవలసిందిగా కోరుచున్నాను. అంటూ రాఘవుడు ప్రార్థించగా; శివపరమాత్మ విశదీకరించుచుండెను.

ఓ రామా! మర్రివిత్తనము మిగుల చిన్నదైనప్పటికీ, దానియందు మహా వృక్షము ఇమిడియున్నది. అట్లే సకల ప్రపంచము నా దివ్య శరీరము నందే ఇమిడియున్నది. సకల ప్రాణికోటి నానుండే ఉత్పన్నమగుచున్నది.

ఉప్పుగడ్డ నీటిలో కరగిపోయి కలసిపోవును. అది మరల పాకముచే మొదటి రూపము నొందుచున్నది. సూర్యమండలము నుండి వెలువడిన కాంతితో ప్రతి ఉదయమునందు లోకము ప్రకాశించును. అట్టి ప్రకాశము సాయంత్రమునందు సూర్యునియందే లయించును. ఆ విధముగా, ఓరామా! సకలలోకములు నావలన ఉత్పన్నమై, నాయందే లయమగుచున్నవి. ఓ సువ్రతా! సకల కార్యములు నాయందే సంభవించు చున్నవని తెలుసు కొనుము" అంటూ, శంకరభగవానుడు చెప్పుచుండగా; రాఘవుడు.

ఓ మహానుభావా! నీవు ఎన్ని విధముల బోధించినను దిగ్భ్రమనొందిన మనుజునకు దిక్కుతోచనట్లు నాకేమీ బోధపడుట లేదు. నేనేమి చేయుదును. అని, వినమ్రతతో చేతులు జోడించి నమస్కరించెను.





## శ్రీ శివగీతా

### అథ సప్తమోఽధ్యాయః

### విశ్వరూప సందర్శన యోగః

శ్రీరామ ఉవాచ

భగవన్ ! యన్మయా పృష్టం-తత్తథైవ స్థితం విభో ।
అత్రోత్తరం మయా లబ్ధం - త్వత్తో నైవ మహేశ్వర॥ 1
పరిచ్ఛిన్న పరీమాణే - దేహే భగవత స్తవ ।
ఉత్పత్తి స్సర్వభూతానాం - స్థితిర్వా విలయఃకథమ్ ? 2
స్వస్వాధికార సంబద్ధాః - కథం నామ స్థితాస్సురాః।
తే సర్వేత్వం కథం దేవ - భువనాని చతుర్దశః॥ 3
త్వత్త శ్శృత్వాఽపి దేవాఽత్ర-సందేహో మే మహా నభూత్ ।
అప్రత్యాయిత చిత్తస్య - సంశయం ఛేత్తు మర్హసి॥ 4

శ్రీ భగవాన్ ఉవాచ

వట బీజే సుసూక్ష్మే ఽపి- మహావటతరు ర్యథా।
సర్వదాఽస్తే ఽన్యథా వృక్షః - కుత ఆయాతి తద్వద॥ 5
తద్వన్మమ తనౌ రామా-భూతానా మాగతి ర్లయః।
మహాసైంధవ పిండోఽపి - జలేక్షిప్తో విలీయతేః॥
న దృశ్యతే పునః పాకా - త్తత ఆయాతి పూర్వవత్ ॥। 6
ప్రాతః ప్రాతర్యథాఽఽలోకో - జాయతే సూర్యమండలాత్ ।
ఏవం మత్తో జగత్సర్వం - జాయతేఽస్తి విలీయతే ॥ 7
మయ్యేవ సకలం రామ - తద్వ జ్జానీహి సువ్రత॥ 8

శ్రీరామ ఉవాచ

కథితేఽపి మహాభాగ - దిగ్జడస్య యథా దిశి ।
నివర్తతే భ్రమో నైవ - తద్వ న్మమ కరోమి కిమ్ ॥ 9

రాముని స్థితిని చూచిన భగవానుడు (శివుడు) రామునితో–

ఓరామా! ఈ చరాచర ప్రపంచమంతయు నా యందే ఉన్నది. దానిని కన్నులతో నీవు దర్శించలేవు. అందువలన, నీకు దివ్య చక్షువును ప్రసాదించుచున్నాను. ఓ దాశరథీ! నీవు భయపడక నిశ్చలుడవై, నా తేజోమండలమును చూడుము.

కోట్లాది విద్యుత్ప్రకాశమువలె, ప్రచండమైన భయావహమైన దివ్యతేజస్సును రాఘవుడు చూచుచుండెను. అద్దానికి అతడు భయభ్రాంతుడై, మోకాళ్ళపై నేలమీద చతికిలబడెను. పిమ్మట దండప్రణామము నాచరించుచు మాటిమాటికి పరమశివుణ్ణి స్తుతించుచుండెను.

సూతుడు చెప్పుచున్నాడు :

ఇట్లు ఆదేశించినవాడై శ్రీరామునకు దివ్యనేత్రములు అనుగ్రహించెను. తదుపరి రామునకు పాతాళ లోకంతో సమానమైన తన నోటిని దెరచి చూపించెను. కోటిమెరుపులతో సదృశమగు అతిభయంకరమైన ఆ నోరును చూడగానే శ్రీరాముడు భయంతో తన మోకాళ్ళపై నేలపై కూలబడెను. నేలపై సాగిలపడి (సాష్టాంగ) నమస్కారంచేసి పరమశివుని గురించి మాటిమాటికి స్తుతించెను.

మహావీరుడగు రాముడు విభూతి ధారియగు మహాదేవుని విశ్వరూపమును దర్శించుచుండెను. పరమేశ్వరుని యొక్క ముఖమునందు అగ్నిజ్వాలలతో ఆవృతమైన కోట్లాది బ్రహ్మాండములు చిన్నచిన్న పక్షులవలె కనబడు చుండెను.

మేరు పర్వతము, మంధరపర్వతము, వింధ్యపర్వతము, మొదలగునవి; క్షీరసముద్రము, లవణ సముద్రము. మొదలగు ఏడు మహాసముద్రములు, కనబడుచుండెను. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, మొదలగునవి; భూమి జలము, అగ్ని, వాయువు,ఆకాశములను పంచభూతములు, ఇంద్రాది దేవతలు, అరణ్యములు, మహానాగములు కనబడుచుండెను.

ఏడేడు పదునాలుగు లోకములు ప్రతీ బ్రహ్మాండము నందు కనబడుచుండెను. మహేశ్వరునియొక్క త్రిపురాసుర సంహారము..మున్నగునవి; సురాసుర సంగ్రామము, మహావిష్ణువుయొక్క దశావతారములు... మొదలగు దృశ్యములన్నియు; దశరథాత్మజుడగు రాముడు చూచుచుండెను.

ఇది వరకు జరిగినవి, ఇంకా జరుగబోవునవి, మరియు ఇప్పుడు జరుగుచున్నవాటిని, ఉత్పత్తికాకనే నశించుచున్నవాటిని, మున్నగు దృశ్యములను చూచి,రాఘవుడు భయాభ్రాంతుడయ్యెను. అతడు మాటి మాటికి శంకరభగవానునకు నమస్కరించుచుండెను.



శ్రీ భగవాన్ ఉవాచ

**మయి సర్వం యథా రామ – జగదేత చ్చరాచరమ్ ।**
**వర్తతే తద్దర్శయామి – నద్రష్టుం క్షమతే భవాన్ ॥ 10**
**దివ్యం చక్షుః ప్రదాస్యామి – తుభ్యం దశరథాత్మజ।**
**తేన పశ్యభయం త్యక్త్వా–మత్తేజోమండలం ధ్రువమ్ ॥ 11**
**న చర్మ చక్షుషా ద్రష్టుం – శక్యతే మామకం మహః।**
**నరేణ వా సురేణాఽపి – తన్మమాఽనుగ్రహం వినా॥ 12**

శ్రీ సూత ఉవాచ

**ఇతుక్త్వా ప్రదదౌ తస్మై – దివ్యం చక్షు ర్మహేశ్వరః।**
**అథా దర్శయదే తస్మై – వక్త్రం పాతాల సన్నిభమ్ ॥ 13**
**విద్యుత్కోటి ప్రతీకాశ–మతిభీమం భయావహమ్ ।**
**తద్దృష్ట్వైవ భయాద్రామో–జానుభ్యా మవనీం గతః॥ 14**
**ప్రణమ్య దండవ ద్భూమౌ–తుష్టావ చ పునఃపునః।**
**అథోత్థాయ మహావీరో– యావదేవ ప్రపశ్యతి॥ 15**
**వక్త్రం పురభిదస్తావ – దంత బ్రహ్మాండ కోటయః।**
**చటకా ఇవ లక్ష్యంతే – జ్వాలామాలా సమాకులాః॥ 16**
**మేరు మంథర వింద్యాద్యా – గిరయ స్సప్తసాగరాః।**
**దృశ్యంతే చంద్ర సూర్యాద్యా – పంచభూతాని తే సురాః॥ 17**
**అరణ్యాని మహానాగాః – భువనాని చతుర్దశః।**
**ప్రతిబ్రహ్మాండ మేవం తు – దృష్ట్వా దశరథాత్మజః॥ 18**
**సురాసురాణాం సంగ్రామాం – స్తత్ర పూర్వా పరానపి ।**
**విష్ణోర్దశావతారాంశ్చ – తత్కర్తవ్యా న్యపి ద్విజాః॥ 19**
**పరాభవాంశ్చ దేవానాం – పురదాహం మహేశితుః।**
**ఉత్పద్యమానా నుత్పన్నాన్ – సర్వానపి వినశ్యతః॥ 20**
**దృష్ట్వా రామో భయావిష్టః – ప్రణనామా ముహుర్ముహుః।**
**ఉత్పన్న తత్త్వ జ్ఞానోఽపి–బభూవ రఘునందనః॥ 21**

పరమేశ్వరునియొక్క విశ్వరూపమును రఘునందనుడగు రాముడు సందర్శించెను. అతనికి తత్త్వజ్ఞానము కలిగినది. అందువలన ఉపనిత్సార మగు అర్థముచే శంకరభగవానుణ్ని స్తోత్రము చేయుచుండెను.

ఓ దేవా! ప్రపన్నార్తి హరా! నీవు నా యందు ప్రసన్నుడవగుము. ఓ విశ్వేశ్వరా! విశ్వవంద్యా! నన్ను అనుగ్రహింపుము. ఓ గంగాధరా! చంద్ర మౌళీ సంసార భయమునుండి అనాథుడనగు నన్ను రక్షింపుము.

ఓ ఈశ్వరా! ఈ భూమిపై వృక్షములు, లతలు..మున్నగునవి, ఏవిధ ముగా పుట్టి, పెరిగి, గిట్టుచున్నవో; అట్లే, సకల జీవులు నీ వలనే సృష్టింప బడుచున్నవి. నీయందే నివసించుచున్నవి. ఓ శంభూ! నీలోనే లయమగు చున్నవి.

ఓ త్రిశూలపాణీ! బ్రహ్మదేవుడు ఇంద్రుడు, రుద్రులు, మరుద్గణములు గంధర్వులు, యక్షులు, అసురులు, గంగ, గోదావరి మొదలైన నదులు, సముద్రములు మొదలగునవన్నియు; నీయొక్క ముఖమధ్యమందు నున్నవి.

ఓ ఇందుమౌళీ! నీ మాయచేతనే ఈ విశ్వము కల్పింపబడి, నీయందే కనబడుచున్నది. భ్రాంతిచే జనులు ముత్యపు చిప్పయందు వెండివలె, త్రాడు నందు పామువలె; ఈ సకల ప్రపంచమును నీకంటే వేరుగా చూచుచున్నారు.

ఓ దేవరా! నీ యొక్క దివ్యతేజస్సుచేతనే ఈ చరాచర ప్రపంచమంతయు ఆవరించి ప్రకాశవంతము చేయుచున్నావు. నీవు ప్రకాశించు చున్నావు. నీ ప్రకాశమే లేనియెడల ఈ విశ్వము ఒక్కక్షణము కూడ కనుపించదు. అనగా ప్రకాశించదు.

ఓ మహాదేవా! కొలది ఆశ్రయము (చిన్నవస్తువు) గొప్ప అర్థమును (పెద్ద పదార్థమును) మోయజాలదు గదా! అణువు వింధ్య పర్వతమును భరించునే? కాని, నీ నోటిలో ఈ జగమంతయు నున్నది. ఇదంతయు, నీ మాయ చేతనే కలుగుచున్నదని, నేను నిశ్చయించుచున్నాను.

ఓ నీలకంఠా! రజ్జువునందు సర్పమనెడు భ్రాంతి కల్పితమై, భయమును కలిగించును. వాస్తవముగా, త్రాడునందు పాము పుట్టుటగాని, తిరిగి నశిం చుటగాని లేదు. అట్లే, నీ యందు మాయచే కల్పితమగు ఈ ప్రపంచము యథార్థముకాదు, విచారింపగా, నీదు శరీరము విశ్వమునకు ఆధారమని భావించడం కూడ అజ్ఞానమే! ఎందుకనగా నీవు స్వయంభువు! పరిపూర్ణు డవు! చిదానంద స్వరూపడవు!



**అథోపనిషదాం సార్థై - రర్థై స్తుష్టావ శంకరమ్ ।**

శ్రీరామ ఉవాచ

**దేవ! ప్రపన్నార్తిహర! ప్రసీద ప్రసీద విశ్వేశ్వర! విశ్వవంద్య!**
**ప్రసీద గంగాధర ! చన్ద్రమౌళే ! మాం త్రాహి సంసారభయాదనాథమ్॥22**

**త్వత్తోహిజాతం జగదేతదీశ - త్వయ్యేవ భూతాని వసంతి నిత్యమ్ ।**
**త్వయ్యేవ శంభో ! విలయం ప్రయాంతి భూమౌ యథా వృక్షలతాదయోఽపి 23**

**బ్రహ్మేంద్ర రుద్రాశ్చ మరుద్గణాశ్చ గంధర్వ యక్షాసుర సిద్ధసంఘాః**
**గంగాదినద్యో వరుణాలయాశ్చ వసంతి శూలిం తవ వక్త్రమంతికే॥ 24**

**త్వన్మాయయా కల్పిత మిందుమౌళే ! త్వయ్యేవదృశ్యత్వ ముపైతివిశ్వమ్।**
**భ్రాంత్యాజనః పశ్యతి విశ్వమేత-చ్ఛుక్తౌయథారూప్య మహిం చ రజ్జౌ25**

**తేజోభిరాపూర్య జగత్సమస్తం-ప్రకాశమానః కురుషే ప్రకాశమ్ ।**
**వినా ప్రకాశాం తవ దేవదేవ! న దృశ్యతే విశ్వమిదం క్షణేన॥ 26**

**అల్పాశ్రయోనైవ బృహంత మర్థం**
**ధత్తేఽణురేకో న హి వింధ్యశైలమ్।**
**త్వద్వక్త్రమాత్రే జగదేత దస్తి**
**త్వన్మాయయైవేతి చ నిశ్చినోమి॥ 27**

**రజ్జౌ భుజంగో భయదో యథైవ**
**న జాయతే నాస్తి న చైతినాశమ్।**
**త్వన్మాయయాకేవల మాత్తరూపం**
**తథైవ విశ్వం త్వయి నీలకంఠ॥ 28**

ఓ పురారీ! పూజలు ఇష్టకర్మలు (యజ్ఞయాగాదులను నిర్వహించడం) అపూర్తకర్మలు (వాపీకూప తటాకాదులను త్రవ్వించడం) మొదలగునవి ఆచరించువారికి మంచి ఫలితములను నీవే ప్రసాదించెదవని చెప్పడం, అసత్యమే! ఎందువలననగా, అంతానీవేకదా! నీకన్న భిన్నమైనది వేరొకటి లేదు కదా!

ఓ గిరీశా! పూజలు,ఉపచారములు మున్నగు బహుక్రియలచే నీవు సంతుష్టుడవగుదువని అజ్ఞానముచే మూఢులు పలికెదరు. నీవు అమూర్తుడవు (ఆకార రహిత స్వరూపుడవు) అటువంటి, నీకు పూజాది కార్యముల ద్వారా భోగేచ్ఛఎక్కడిది? ఓ మహేశా! ఎవ్వరయితే కొంచెము బిల్వదళములు, ఉదకములను భక్తితో సమర్పించునో వారిని నీవు అనుగ్రహించి, ముల్లోకములలో గల ఐశ్వర్యము నిచ్చెదవని జనులు అజ్ఞానముచేతనే తలంచెదరు.

ఓశివా! నీవు ఒక్కడవే దిశలను, విదిశలను అంతటను వ్యాపించియున్నావు. నీవు పురాణ పురుషోత్తముడవు. దిక్కులతో కూడ ఈ ప్రపంచము నశించినప్పటికీ ఆకాశమువలె నీకు నాశములేదు. ఆకాశము లోనున్న సూర్యునియొక్క ప్రతిబింబము జలాశయము (పెద్దచెరువు) కూపము (నుయ్యి) ఘటము (కుండ) మొదలగువాటియందు వేర్వేరుగా కనుపించును. అదేవిధముగా అఖండ చైతన్య స్వరూపమైన నీవు ఒక్కడవే వేర్వేరు అంతఃకరణములలో అనేక రూపములందు గోచరించెదవు.

ఓ దేవా! ఈ చరాచర ప్రపంచమును సృజించుటకుగాని, పోషించుటకు గాని నశింపచేయుటకు గాని, నీకేమీ ప్రయోజనములేదు. అనాదికాలము నుండి వచ్చిన ప్రాణుల అదృష్టమైన పుణ్యపాపముల ననుసరించి వారి వారి కర్మఫలములను అనుభవించెదరు. అయినప్పటికి, స్వప్నమువలె ఈ విశ్వమును నీవు విస్తరింపచేసెదవు.

ఓ శంభూ! స్థూల, సూక్ష్మ జడదేహములకు నీకు భేదమేమియు లేదు. కనుక ఓ త్రిపురారీ! సుఖదుఃఖములకు కారణము నీవని శ్రుతులు చాటుచున్నవి.



విచార్యమాణే తవ యచ్ఛరీర -మాధారభావం జగతాముపైతి
తదప్యవశ్యం మదవిద్యయైవ-పూర్ణశ్చిదానందమయో యతస్త్వమ్॥ 29

పూజేష్టపూర్తాది వరక్రియాణాం - భోక్తుః ఫలం యచ్ఛసి శస్తమేవ।
మృషైతదేవం వచనం పురారే! త్వత్తోఽస్తి భిన్నం న చ కించిదేవ॥ 30

అజ్ఞానమూఢా మునయో వదంతి
పూజోపచారాది బహుక్రియాభిః।
తోషాం గిరీశో భజతీతి మిథ్యా
కుతస్త్వమూర్తస్య తు భోగలిప్సా॥ 31

కించిద్దలం వా చులకోదకం వా
యత్త్వం మహేశ ! ప్రతిగృహ్యధత్సే।
త్రైలోక్యలక్ష్మీమపి తజ్జనేభ్య
స్సర్వం త్వవిద్యాకృతమేవ మన్యే ॥ 32

వ్యాప్నోషి సర్వా విదిశో దిశశ్చ - త్వం విశ్వమేకః పురుషః పురాణః।
నష్టే ఽపి తస్మిం స్తవ నాస్తిహాని - ర్ఘృష్టే వినష్టే నభసో యథైవ॥ 33

యథైవ మాకాశగ మర్కబింబం
క్షుద్రేషు పాత్రేషు జలాన్వితేషు !
భుజత్యనేక ప్రతిబింబభావం
తథా త్వమంతః కరణేషు దేవ॥ 34

సువర్జనే వాప్యవనే వినాశే-విశ్వస్య కించిత్తవ నాస్తి కార్యమ్।
అనాదిభి ర్దేహభృతా మదృష్టై - తథాపి తత్స్వప్నవ దాతనోషి॥ 35

స్థూలస్య సూక్ష్మస్య జడస్య దేహ-ద్వయస్య శంభో న చిదం వినాఽస్తి।
అతస్త్వదారోపమాతనోతి - శ్రుతిః పురారే! సుఖదుఃఖయో స్సదా॥ 36

ఓ పరమేశ్వరా! సచ్చిదానందమను మహాసముద్రములో సంచరించు హంసరూపమైన నీకు నమస్కారము. గరళకంఠుని కొరకు, కాల స్వరూపుని కొరకు అజ్ఞాన రూపమగు సకల పాపములను సంహరించు జ్ఞానస్వరూపుడ వగు నీకొరకు దండము. సాక్షి స్వరూపముచేతనే మిథ్యాస్వరూపమైన చిత్త వృత్తులను అనుభవించు పరమాత్మ స్వరూపుడవగు నీకు ప్రాణామము! అంటూ రాఘవుడు విశ్వనాథుడగు శివునకు రెండుచేతులు జోడించి నమస్కరించి లేచి నిలబడెను. పరమేశ్వరుని యొక్క విశ్వరూప సందర్శనము (విరాటస్వరూప మును దర్శించుట) చేత ఆశ్చర్యచకితుడయ్యెను.

ఓ విశ్వాత్మా! నీ విశ్వరూపమును ఉపసంహరింపుము. ఓశంభూ! నీ దివ్యాను గ్రహమువలన సర్వజగదేకమును (ఈశ్వరుడు,జీవుడు,జగత్తు, మూడింటియొక్క అఖండఏకత్వమును) దర్శించితిని. అనిరాముడు ప్రార్థించెను.

ఓ రామా! మహాబాహూ! నీవు బాగుగా అవలోకింపుము. ఈ విశ్వ రూపములో నాకంటే మరియొక్కడు ఎవ్వడులేడు! అని పలికిన పరమేశ్వరుడు, తన విశ్వరూపమును (తన శరీరమునందు సకల దేవతాది స్వరూపమును) ఉపసంహరించుకొనెను.

రామచంద్రుడు సంతోషాతిరేకమున కన్నులు మూసుకొనెను. అటు పిమ్మట, మళ్ళీ కన్నులు తెరచి చూచునంతలో పర్వత శిఖరమునందు పులి చర్మముపైన కూర్చున్న శంకర భగవానుని యొక్క సౌమ్యరూపము ప్రత్యక్ష మయ్యెను.

పరమశివుడు సద్యోజాత వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన. అను అయిదు ముఖములతో నీలవర్ణమగు కంఠముతో సూర్యచంద్రాగ్నులను మూడు కన్నులతో విభూతినిదాల్చిన దివ్యమంగళ విగ్రహముతో విరాజిల్లుచుండెను.

పులితోలును వస్త్రమునుగాను, ఉత్తరీయముగాను; సర్పములే యజ్ఞోప వీతముగాను, ముంజేతికంకణములు, మున్నగు భూషణములతో చంద్రుణ్ని ధరించిన జటాజూటముతో ఒక్కడుగా నుండెను. నాలుగు చేతులలో వర ముద్ర, అభయముద్ర, ఖండపరశువు, మృగము...మున్నగు వాటిని కలిగి యుండెను. అటువంటి జగదీశ్వరుడగు శివుని రూపమును దర్శించెను. అనంతరము, శివుని ఆజ్ఞచే రాఘవుడు అతని ముందుకువెళ్ళి నమస్కరించి కూర్చొనెను.

ఓయీ! శ్రీరామ! నీవు ఏవిషయములను ప్రశ్నించెదవో ప్రశ్నించుము. నీకుబోధించే విషయమై నాకంటెను మరొక గురువు నీకు లేదని ఈశ్వరుడు ఆనతి ఇచ్చెను.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గతంబైన శివగీత యందు
విశ్వరూప సందర్శన యోగము అను సప్తమోధ్యాయం సంపూర్ణం.



**నమ స్సచ్చిదంబోధిహంసాయ తుభ్యం**
**నమః కాలకంఠాయ కాలాత్మకాయ।**
**నమస్తే ఽ సమస్తా ఘసంహారకర్త్రే**
**నమస్తే మృషాచిత్తవృత్యేకభోక్త్రే ॥ 37**

సూత ఉవాచ

**ఏవం ప్రణమ్య విశ్వేశం - పురతః ప్రాంజలి స్థి స్తతః।**
**విస్మితః పరమేశానం - జగదే రఘునందనః॥ 38**

శ్రీరామ ఉవాచ

**ఉపసంహర విశ్వాత్మన్ - విశ్వరూపమిదం తవ ।**
**ప్రతీతం జగదైకాత్మ్యం - శంభో ! భవదనుగ్రహాత్ ॥ 39**

శ్రీ భగవాన్ ఉవాచ

**పశ్యరామ మహాబాహో- మత్తోనాన్యోఽస్తి కశ్చన ।**

సూత ఉవాచ

**ఇత్యుక్త్వై వోపసంజహ్రే - స్వదేహే దేవతాదికాన్ ॥ 40**
**మీలితాక్షః పునర్దృష్ట్వా - ద్యావ ద్రామః ప్రపశ్యతి।**
**తావదేవ గిరేశ్శృంగే - వ్యాఘ్ర చర్మోపరిస్థితమ్ ॥ 41**
**దదర్శ పంచవదనం - నీలకంఠం త్రిలోచనమ్ ।**
**వ్యాఘ్రచర్మాంబరధరం - భూతి భూషితవిగ్రహమ్ ॥ 42**
**ఫణికంకణ భూషాఢ్యం - నాగ యజ్ఞోపవీతినమ్ ।**
**వ్యాఘ్ర చర్మోత్తరీయం చ - విద్యుత్పింగ జటాధరమ్ ॥ 43**
**ఏకాకినం చంద్రమౌళిం - వరేణ్య మభయప్రదమ్ ।**
**చతుర్భుజం ఖండపరశుం - మృగహస్తం జగత్పతిమ్ ॥ 44**
**అథాజ్ఞయా పురస్తస్య - ప్రణమ్యోపవిశేవ సః।**
**అథాఽహ రామం దేవేశో - యద్యత్ప్రష్టుమభీచ్ఛసి।**
**తత్సర్వం పృచ్ఛ రామత్వం - మత్తో నాన్యోఽస్తి తే గురుం 45**

ఓం తత్సదితి శ్రీ పద్మపురాణే శివగీతా సూఽపనిషత్సు,
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివరాఘవ సంవాదే విశ్వరూప
సందర్శన యోగో నామ సప్తమోఽధ్యాయః

## 8వ అధ్యాయము భావము

రాముడు శివుణ్ణి అడుగుచుండెను.

"ఓ భగవాన్ ! పాంచభౌతిక దేహము యొక్క స్వరూపము ఏమిటీ? దానియొక్క ఉత్పత్తి స్థితి, లయములు ఏవిధముగా కలుగుచున్నాయి? నాకు దయచేసి వివరించి చెప్పండి"అంటూ రామచంద్రుడు ప్రశ్నించగా, శంకర భగవానుడు సమాధానమిచ్చుచుండెను.

ఓ రామా! భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములే పంచ మహా భూతములు, వాటిచే ఉత్పన్నమైనదే దేహము. అందువలన అద్దానిని పాంచభౌతికమని చెప్పబడును. దేహమునందు భూమితత్త్వము ప్రధానముగా నుండును. మిగిలిన నాలుగు తత్త్వములు సహకారులుగా నుండును.

పంచభూతాత్మకమగు దేహము చతుర్విధములుగా చెప్పబడును అవి 1. జరాయుజము 2 అండజము 3 స్వేదజము 4 ఉద్భిజము మున్నగునవి. ఈ చతుర్విధ దేహములకంటే భిన్నమైన మానవ దేహము మరొక్కటి కలదు. అది దేవతలకు మాత్రమే ప్రాప్తించును. వీటిలో జరాయుజము ప్రధానమగుటచే ప్రప్రధమముగా దీనిని గూర్చి పేర్కొనుచున్నాను.

శుక్ర, శోణితముల సంయోగము వలన ఉత్పన్నమైనదే జరాయుజము ఋతుకాలమునందు స్త్రీ యొక్క గర్భాశయమున శుక్రము (వీర్యము) ప్రవేశించి, అక్కడ శోణితము(రజస్సు)తో సంయోగము చెందును. అట్టిదే జరాయుజమగును.

శోణితము విశేషమైన స్త్రీయును, శుక్రము అధికమైన పురుషుడును కలుగును. శుక్ర శోణితములు (వీర్య,రజస్సులు) సమానమైన నపుంసక వ్యక్తియును అగును.

ప్రతీ స్త్రీ ఋతుస్నానమును మాసికధర్మము (రజస్వల) యొక్క నాల్గవ రోజున చేయును. ఆ రోజునుండి పదునారవరోజు వరకు ఋతుకాలముగా నిర్దేశింపబడినది.



# శ్రీ శివగీతా



## అథ అష్టమోఽధ్యాయః
## వైరాగ్య యోగః

శ్రీరామ ఉవాచ

పాంచ భౌతిక దేహస్య - చోత్పత్తి ర్విలయ స్థితిః।
స్వరూపం చ కథం దేహే - భగవన్ ! వక్తుమర్హసి ॥ 1

శ్రీ భగవాన్ ఉవాచ

పంచభూతై స్సమారబ్ధో - దేహోఽయం పాంచభౌతికః।
తత్ర ప్రధానం పృథివీ - శేషాణాం సహకారితా ॥ 2

జరాయు జోఽండజశ్చైవ - స్వేదజ శ్చోద్భిద స్తథా ।
ఏవం చతుర్విధః ప్రోక్తో - దేహోఽయం పాంచభౌతికః॥ 3

మానసస్తు పరః ప్రోక్తో - దేవానామేవ స స్మృతః।
తత్ర వక్ష్యే ప్రథమతః-ప్రధానత్వా జ్జరాయుజమ్ ॥ 4

శుక్ర శోణిత సంభూత - వృత్తిరేవ జరాయుజః ।
స్త్రీణాం గర్భాశయే శుక్ర - మృతుకాలే విశేద్యదా।
రజసా యోషితో యుక్తం - తదేవ స్యా జ్జరాయుజమ్ ॥। 5

బాహుల్యాద్రసజః స్త్రీ స్యాత్ - శుక్రాధిక్యే పుమా న్భవేత్ ।
శుక్ర శోణితయో స్సామ్యే - జాయతేఽథ నపుంసకమ్॥ 6

ఋతుస్నాతా భవేన్నారీ - చతుర్థదివసే తతః।
ఋతుకాలస్తు నిర్దిష్టః - ఆషోడశ దినావధి॥ 7

ఆ కాలమునందు సరి దినములలో (6-8 రోజులలో) భర్త సంగమ మేర్పడినచో ఆడ సంతానము కలుగును. బేసి దినములలో (5,7 రోజు లలో) భర్త సంగమమేర్పడినచో మగ సంతానము కలుగును. ఋతుమతికి పదునారవ దినమున గర్భము నిలిచినచో అప్పుడు పుట్టినవాడు చక్రవర్తి యగును. ఇందులో సందేహములేదు.

ఋతుస్నానము చేసిన స్త్రీ కోరికతో ఏ పురుషుని ముఖమును చూచునో ఆ ఆకృతిగల గర్భమే కలుగును. కనుక స్త్రీ ఋతు స్నానము చేసిన పిమ్మట తన భర్తముఖమునే చూడవలెను.

స్త్రీయొక్క గర్భాశయములో సూక్ష్మమైన చర్మావరణమునే "జరాయువు" అని అంటారు. దానియందు శుక్ర, శోణితముల సంయోగము వలన గర్భము కలుగును. కనుక జరాయువు నుండి ఉత్పన్నమైన దానిని "జరాయుజ"మని పేర్కొంటారు.

జరాయుజములు స్త్రీ గర్భాశయమునుండి పుట్టినవి మానవులు, మృగములు 1. అండజములు-గ్రుడ్లు నుండి వెలువడునవి పక్షులు, పాములు 2. స్వేదజములు-చెమటనుండి ఆవిర్భవించునవి దోమలు, నల్లులు 3. ఉద్భిజములు భూమినుండి ఉద్భవించునవి చెట్లు చేమలు 4. ఈచతుర్విధ దేహములకంటే విభిన్నమైనదేవతలు మహర్షులు మానసములు.

పూర్వజన్మలయొక్క కర్మలచేత స్త్రీ యోనియందు ప్రవేశించిన శుక్ర ము రజస్సుతో సంయోగము చెందును. అప్పుడు పిండోత్పత్తికి కారణ మగును.

మొదటి మాసమునందు అది ద్రవరూపముగా నుండును.

రెండవ మాసమునందు నీళ్ళవలె నున్న ఆ ద్రవము నెమ్మదిగా బుద్బుద రూపమగును. అది ఘనీభవించి మాంసపిండరూప మగును.



తత్రాయుగ్మదినే స్త్రీ స్యాత్ - పుమాఽ న్యుగ్మ దినే భవేత్ ॥ 8

షోడశే దివసే గర్భో - జాయతే యది సుభ్రువః
చక్రవర్తీ తదా రాజా - జాయతే నాఽ త్ర సంశయః॥ 9

ఋతుస్నాతా యస్య పుంస - స్సాకాంక్షం ముఖమీక్షతే ।
తదాకృతి ర్భవే ద్గర్భ-స్తత్పశ్యే త్స్వామినో ముఖమ్ ॥ 10

యా స్త్రీ చర్మావృతి స్సూక్ష్మా - జరాయు స్సా నిగద్యతే ।
శుక్ర శోణితయో ర్యోగా - త్తస్మిన్నేవ భవే ద్ధృతః॥ 11

తత్ర గర్భో భవే ద్యస్మా - త్తేన ప్రోక్తో జరాయుజః
అండజాః పక్షి సర్పాద్యా - స్స్వేదజా మశకాదయః॥ 12

ఉద్భిజ్జా వృక్ష గుల్మాద్యాః - మానసాశ్చ సుర ర్షయః॥ 12

జన్మ కర్మవశాదేవ - నిషిక్తం స్మరమందిరే ।
శుక్రం రజస్సమాయుక్తం - ప్రథమే మాసి తద్ద్రవమ్ ॥ 13

బుద్బుదం కలలం తస్మా - త్తతః పేశీ భవే దిదమ్ ।
పేశీ ఘనం ద్వితీయే తు - మాసి పిండః ప్రజాయతే ॥ 14

కరాంఘ్రిశీర్షకాదీని - తృతీయే సంభవంతి హి ।
అభివ్యక్తిశ్చ జీవస్య - చతుర్థే మాసి జాయతే ॥ 15

నాల్గవ మాసమునందు జీవచైతన్యము (జీవోపాధి యగు దేహము) అభివ్యక్తమగును. తల్లిగర్భమునందు పిండము, తనంతట తాను చలించు చుండును.

పుత్రుడైనచో దక్షిణ పార్శ్వము (కుడిప్రక్క) నందును, కన్యయైనచో వామ పార్శ్వము (ఎడమప్రక్క) నందును కదలుచుండును. నపుంసకుడైనచో గర్భముయొక్క మధ్యభాగములో కదలిక ఉండును.

కాళ్ళు, చేతులు మున్నగు అంగములు, వ్రేళ్ళు, గోళ్ళు మున్నగు ఉపాంగములు ఏర్పడును. జన్మాంతరమునకల్గే దంతములు, మీసములు మినహా, మిగతా స్త్రీ పురుష భేదములు కల్గిన భావములన్నియు నాల్గవ మాసమునందే కలుగును.

రఘునందనా! జీవి, పురుషుడైనచో స్థిరత్వాది భావములను; స్త్రీయైనచో చంచలత్వాది భావములను, నపుంసకుడైనచో మిశ్రమ భావములను కల్గి యుండును. తల్లియొక్క హృదయము ద్వారా పిండము యొక్క కోరికలు స్ఫురించుచుండును. కనుక తల్లి కోరికలను కోరుచుండును. అందువలన గర్భవృద్ధి కొరకు గర్భిణీ స్త్రీయొక్క కోరికలను తీర్చుచుండవలెను.

గర్భిణీస్త్రీ రెండు హృదయములను ధరించును. కావున "దౌహృదిని" అని ఆమెకు పేరువచ్చెను.

ద్రౌహృదియినియగు స్త్రీయొక్క కోరికలను తీర్చకున్నచో సంతానము నకు అంగలోపత్యము అశక్తత్వము. బుద్ధిమాంద్యము కలుగును. తల్లికి ఏవిషయమునుందు ఆసక్తి యుండునో సంతానమునకు కూడ ఆ విషయము నందు ఆసక్తి యుండును.

అయిదవ మాసమునందు చిత్తము జాగృతమగును. మాంసరక్తముల పుష్టిని పొందును. ఆరవ మాసమునందు ఎముకలు నరములు, గోళ్ళు, వెంట్రుకలు మున్నగునవి వికాసము నొందును.

ఏడవ మాసమునందు బలము, వర్ణము కల్గి, దేహము అంగపూర్ణతతో నుండును. గర్భస్థ శిశువు ఆ సమయమునందు కాళ్ళమధ్య నుండి చేతులతో చెవుల రంధ్రములను మూయబడి యుండును. ఆ విధముగా గర్భవాసము యొక్క దుఃఖమునకు ఉద్విగ్నుడై; గర్భభయాన్వితుడై యుండును.



**తత శ్చలతి గర్భోఽపి - జనన్యా జఠరే స్వతః।**
**పుత్రశ్చే ద్దక్షిణే పార్శ్వే - కన్యా వామే చ తిష్ఠతి॥ 16**
**నపుంసక స్తూదరస్య - భాగే తిష్ఠతి మధ్యతః॥ 17**

**అతో దక్షిణపార్శ్వేతు - శేతే మాతా పుమా న్యది ।**
**అంగప్రత్యంగ భాగాశ్చ - సూక్ష్మా స్స్యు ర్యుగపత్తదా॥ 18**

**విహాయ శ్మశ్రుదంతాదీన్ - జన్మానంతర సంభవాన్ ।**
**ఏషా ప్రకృతిరస్యాస్తు - వికృతి స్సమ్మతా మతా ॥**
**చతుర్థే వ్యక్తతా తేషాం - భావానామపి జాయతే ॥। 19**

**పుంసాం స్థైర్యాదయో భావా - భూతత్వాద్యాస్తు యోషితామ్ ।**
**నపుంసకే చ తే మిశ్రా - భవంతి రఘునందన ॥ 20**

**మాతృజం చాస్య హృదయం - విషయా నభికాంక్షతి।**
**తతో మాతు ర్మనోఽభీష్టం - కుర్యా ద్గర్భ వివృద్ధయే ॥ 21**

**తాం చ ద్విహృదయాం నారీ మాహు ర్దౌహృదినీం తతః।**
**అదానా ద్దౌహృదానాం స్యు - ర్గర్భస్య వ్యంగతాదయః॥ 22**

**మాతుర్య ద్విషయే లోభ - స్తదార్తో జాయతే సుతః।**
**ప్రబుద్ధం పంచమే చిత్తం - మాంస శోణిత పుష్టతా ॥ 23**

**షష్ఠేఽస్థి స్నాయునఖర - కేశలోమ వివిక్తతి।**
**బలవర్ణౌ చోపచితౌ - సప్తమే త్వంగపూర్ణతా ॥ 24**

**పాదాంతరిత హస్తాభ్యాం - శ్రోత్రరంధ్రే పిధాయ సః।**
**ఉద్విగ్నో గర్భసంవాసా - దస్తి గర్భభయా న్వితః॥ 25**

తల్లి గర్భములోనున్న శిశువునకు జ్ఞానముకల్గి, గర్భవాస దుఃఖముచేత ఖిన్నుడై యుండును. "హా కష్టము?" అని విషాదముతో విచారించుచూ, తన ఆత్మను గూర్చి శోకించుచుండును.

అనేకసార్లు మర్మచ్ఛేదకములగు నట్టియు, భరింపనలవి కానట్టియు, పాపపూరితములైన దేహముల ననుభవించితిని, కాలుచున్న ఇనుపశయ్య పైన పరుండబెట్టినప్పుడు పేలాలు వేయించినట్లు తపింపబడితిని. జఠరాగ్ని చేత తపింపబడి, పిత్తవాతాది రసబిందువులు గర్భకోశములో నున్న మిక్కిలి కాల్చుచున్నవి.

కొండబూరుగు ముండ్లతో సమానములైన గర్భస్థ క్రిముల నోరులు ఘోరముగా కొరకుచున్నవి. తల్లియొక్క ప్రక్క ఎముకలు రంపములవలె నన్ను పీడించుచున్నవి. జఠరాగ్నిచేత దహింపబడుచు, మలమూత్రాది దుర్గంధములతో, గర్భాశయమునందు భరింపరాని కష్టమును అనుభవించు చున్నాను. దీనికంటే కుంభీపాకాది నరకము నాకు తక్కువగా నున్నది.



గర్భస్థుడనగు నేను రక్తము, కఫము, పిత్తము, చీము మొదలగు వాటిని పానము చేసితిని. తల్లిచే తినబడిన అన్నమును తింటిని. ఇందు మలము లోని పురుగువలె నా స్థితియున్నది. నేను పొందుచున్న దుఃఖము నరకము లన్నింటికంటెను అధికమై యున్నది. అని గర్భమునందున్న శిశువు, పూర్వము తాను పొందిన నానా విధములైన యాతనలను స్మరించుచుండెను. సకల దుఃఖములను అనుభవించినవాడై మోక్షోపాయమును గురించి చింతించు చున్నాడు.

ఎనిమిదవ మాసమునందు చర్మముయొక్క ఆవరణము, అవయవము లలో చలనము కలుగును. హృదయము నుండి ఓజస్సు (శుభ్రమైన వర్ణము కలది)ను తేజస్సును (కొంచెము పచ్చపచ్చగా రక్తవర్ణముతో కూడినది) మున్నగునవి కలుగును.

అవి జీవనమునకు ఆధారములుగా నుండును. ఈ ఎనిమిదవ మాస ములో గర్భము యొక్క స్వాభావిక చలనముచేత, తల్లిని విడిచి గర్భపాత మగును. అట్టి యెడల ఓజస్సుచే విడువబడి జీవించదు.



ఆవిర్భూత ప్రబోధోఽసౌ – గర్భదుఃఖాది సంయుతః।
హా ! కష్టమితి నిర్విణ్ణ– స్స్వాత్మానం శోశుచీత్యథ ॥ 26

అనుభూతా మహాఽసహ్య – పురోమర్మచ్ఛిదోఽసకృత్ ।
కరంభవాలుకాస్తప్తా – పాశ్చా దహ్యంతాఽసుఖాశయాః॥ 27

జఠరానల సంతప్త – పిత్తాఖ్యరస విప్రుషః।
గర్భాశయే నిమగ్నం తు – దహం త్యతిభృశం హి మామ్ ॥ 28

ఉదర్య కృమివక్త్రాణి – కూటశాల్మలి కంటకైః।
తుల్యాని చ తుదంత్యార్తం – పార్శ్వస్థి క్రకచార్దితమ్ ॥ 29

గర్భే దుర్గంధ భూయిష్ఠే – జఠరాగ్ని ప్రదీపితే ।
దుఃఖం మయాప్తం యత్తస్మా – త్కనీయః కుంభీపాకజమ్ ॥ 30

పూయాఽసృక్శ్లేష్మ పాయిత్వం – వాంతాశిత్వం చ య ద్భవేత్ ।
అశుచౌ కృమిభావశ్చ – తత్రాప్తం గర్భశాయినా ॥ 31

గర్భశయ్యాం సమారుహ్య – దుఃఖం యాదృఙ్మయాఽపి తత్ ।
నాఽతిశేతే మహాదుఃఖం – నిశ్శేష నరకేషు యత్ ॥ 32

ఏవం స్మరన్పురా ప్రాప్తా – నానాజాతీశ్చ యాతనాః।
మోక్షపాయ మభిధ్యాయ – న్వర్తతేఽభ్యాస తత్పరః॥ 33

అష్టమే త్వక్కృతీ స్యాతా – మోజస్తేజశ్చ హృద్భవమ్ ।
శుభ్రమాపీత రక్తం చ – నిమిత్తం జీవితే మతమ్ ॥ 34

మాతరం చ పునర్గర్భం – చంచలం తత్ప్రధావతి।
తతో జాతేఽష్టమే మాసి – న జీవత్యోజసోజ్ఝితః॥ 35

కించిత్కాల మవస్థానం – సంస్కారా త్పీడితాంగవత్ ।
సమయః ప్రసవస్య స్యా – న్మాసేషు నవమాదిషు ॥ 36

తొమ్మిది లేక పదియవ మాసములు, శిశువు ప్రసవించుటకు సమయము అయినను సంస్కారముచేత కొంతకాలము గర్భము నందుండును.

గర్భవాసమునందు శిశువు తల్లియొక్క శోణితమును వహించునాడిని ఆశ్రయించి, విస్తరింపబడి యుండును. శివువునకు నాభియందున్న నాడి ద్వారా, తల్లియొక్క ఆహార రసములు లోనికి వెళ్ళుచుండును. ఆవిధముగా తల్లి ఆహారముచే గర్భస్థ శిశువు పోషింపబడుచు, సజీవముగా నుండును.

దౌహృదినియగు స్త్రీ దేహమునందు జరాయుకోశముచే ఆవృతమైన శిశువు రక్తమాంసములతో సర్వాంగములను కలిగియుండును. గర్భస్థ శిశువు ఎముకల మంత్రమయమగు యోనిచేత నొక్కబడినందు, నతన్మార్గమున బయలు వెడలుచుండును.

శిశువు తల్లి శరీరమునుండి నిష్క్రమించుచున్నప్పుడు అత్యంత పీడనమును కలిగియుండును. అప్పుడు శిశువు రోదించుచూ మిక్కిలి దుఃఖించుచుండును. అధోముఖము కలిగి యోనినుండి విడివడి వెల్లకిల పడియుండును.

ఆ సమయమునందు శిశువు మాంసము ముద్దవలె నుండును. అసమర్థుడై నిర్బలుడై యుండును. అందువలన కుక్కపిల్లి మున్నగు మాంసాహారజంతువులనుండి రక్షించుటకు స్వజనులు చేతిలో కర్రను పట్టుకొని యుందురు.

బాల్యములో శిశువు– అజ్ఞానముచేత తండ్రిని రాక్షసుడుగా, తల్లిని రాక్షసాంగన యగు ఢాకినిగా చూచుచుండును, చీమును పాల వలెను భావించుచుండును. కావున శైశవము బహు కష్టమైనదిగదా!

శ్లేష్మము (కఫము) చే సుషుమ్ననాడి కప్పబడి యున్నంతవరకు అక్షరములు అభివ్యక్తముకావు. అందువలన మానవునకు తిన్నగా మాటరాదు. కావున గర్భమునందు శిశువురోధించుటకు వీలుపడదు.

యౌవనము వచ్చినపుడు మన్మధ జ్వరముచే పీడింపబడును. అకస్మాత్తుగా గొంతెత్తి పాటలు పాడుచుండును, హఠాత్తుగా తన సామర్థ్యముగూర్చి గర్వించును. విర్రవీగుచుండును.



మాతు రస్రవహాం నాడీ - మాశ్రిత్యాఽన్వవతారితా ।
నాభిస్థ నాడీ గర్భస్య - మాత్రాహార రసావహా ॥ 37

తేన జీవతి గర్భోఽపి - మాత్రాహారేణ పోషితః।
అస్థియంత్ర వినిష్పిష్టః - పతితః కుక్షివర్త్మనా ॥ 38

మేదోఽసృగ్దిగ్ధ సర్వాంగో - జరాయుపుట సంవృతః।
నిష్క్రామన్ భృశ దుఃఖార్తో - రుదన్నుచ్చై రధోముఖః॥ 39

యంత్రాదేవం వినిర్ముక్తః - పతత్యుత్తాన శాయ్యుత॥ 40

అకించిత్కస్త దాలోకై - ర్మాంసపేశీవదా స్థితః।
శ్వమార్జారాది దంష్ట్రిభ్యో - రక్షతే దండపాణిభి॥ 41

పితృవ ద్రాక్షసం వేత్తి - మాతృవ డ్డాకినీమపి ।
పూయం పయోవదజ్ఞానా - ద్దీర్ఘ కష్టం తు శైవమ్ ॥ 42

శ్లేష్మణా పిహితా నాడీ - సుషుమ్నా యావదేవ హి ।
వ్యక్తవర్ణం చ వచనం - తావద్వక్తుం న శక్యతే ॥ 43

అత ఏవ చ గర్భేఽపి - రోదితుం నైవ శక్యతే ।
దృప్తోఽథ యౌవనం ప్రాప్య - మన్మథజ్వర విహ్వలః॥ 44

అతివేగముగా వృక్షములను ఎక్కును. శాంతస్వభావులను ఉద్వేగ పర్చును. కామము, క్రోధము, మదములచే అంధుడగును. అప్పుడు ఎవరినీ దేనినీ లక్ష్యపెట్టడు.

రక్తము, మాంసము, ఎముకలు మొదలగువాటితో కూడిన స్త్రీయొక్క అవయవములయందు ఆసక్తుడగును. సగముతెగిన కప్పవలె ఎగురుచు గంతులు వేయుచుండును. మన్మథుని బాణములచేత దహించబడి తన మనస్సే తనను పీడించుచుండును.

ఈ శరీరమునందు ఎముకలు, మాంసము, రక్తనాళములు, చర్మము మొదలు వాటికంటే మరియొకటి ఏమున్నది? కామ వాసనలతో మోహింప బడిన మూఢుడు జగత్తును కొంచెమైనను వీక్షించడు.

లేడి కన్నులు కలిగిన ప్రియురాలి దేహమునుండి ప్రాణవాయువు పోయి అయిదారు రోజులైన తర్వాత, అట్టి దేహమును కామాసక్తుడగు మూఢుడు చూడలేడు.



వార్థక్యము మిక్కిలి అగౌరవ స్థానమైనది. అద్దానిని పొంది అత్యంత దుఃఖితుడగును. శ్లేష్మముచే ఉదరము కప్పబడి యుండును, తినిన ఆహారము జీర్ణముకాదు.

దంతములు కదలుచుండును, కంటిచూపు మందగించును. కారము, చేదు, ఒగరు మున్నగు పదార్థములను తినుచుండును. వాతముచే నడుము, మెడ వంగిపోవును, చేతులు తొడలు కాళ్ళలో బలహీనుడగును.

అనేక రోగములు ఆవరించును. తనబంధువులచే తిరస్కరింపబడును. ఆచారములను పాటింపలేక పోవును. మలముచే దేహము పూయబడి యుండును. శరీరము ముడతలు పడును.

అసులభములగు భోగములను కోరుచుండును. శరీరము వణకుచుం డును. సకల ఇంద్రియములలో క్రియాశక్తి లోపము వలన పిల్లలచే అప హాస్యము చేయబడును.

మరణము యొక్క దుఃఖమును వర్ణించడానికి సమానమైన దృష్టాం తము (ఉపమానము) లు లభించవు. అది రోగములచేతను, దారిద్ర్యముల చేతను పొందిన దుఃఖములకంటే అధికమైనది. రోగులు, దరిద్రులు,మున్నగు వారు కూడ మరణమునకు భయపడుచున్నారు.



గాయత్య కస్మా దుచ్చైస్తు - తథాకస్మాచ్చ వల్గతి ।
ఆరోహతి తరూన్వేగా - చ్ఛాంతానుద్వేజ యత్యపి ॥ **45**

కామ క్రోధ మదాంధస్స - న కాంశ్చిదపి వీక్షతే ।
అస్థిమాంస శిరాలా యా - వామాయా మన్మథాలయే ॥ **46**

ఉత్తాన పూతి మండూక - పాటితోదర సన్నిభే ।
ఆసక్త స్స్మరబాణార్త - ఆత్మనా దహ్యతేఽతరాం ॥ **47**

అస్థిమాంస శిరాత్వగ్భ్యః - కిమన్య ద్వర్తతే వపుః
కామానాం మాయయా మూఢో - న కించి ద్వీక్షతే జగత్ ॥ **48**

నిర్గతే ప్రాణపవనే - దేహో హంత మృగీదృశః
యథా హి జాయతే - నైవ వీక్షతే పంచషైర్దినైః॥ **49**

మహాపరిభవ స్థానం - జరాం ప్రాప్యాఽతి దుఃఖితః
శ్లేష్మణా పిహితోరస్కో - జగ్ధ మన్నం న జీర్యతీ॥ **50**

సన్నదంతో మందదృష్టిః - కటుతిక్త కషాయభుక్ ।
వాతభుగ్న కటిగ్రీవా - కరోరు చరణోఽబలః॥ **51**

గదాయుత సమావిష్టః - పరిభూతః స్వబంధుభిః
నిశ్శౌచో మలదిగ్ధాంగ - ఆలింగిత వరోషితః॥ **52**

ధ్యాయఽన్న సులభా న్భోగా - న్కేవలం వర్తతేఽచలః।
సర్వేంద్రియా క్రియాలోపా - ద్ధాస్యతే బాలకైరపి ॥ **53**

తతో మృతిజ దుఃఖస్య - దృష్టాంతో నోపలభ్యతే ।
యస్మాద్ భిభ్యతి భూతాని - ప్రాప్తాన్యపి పరాంరుజం॥ **54**

సముద్రమునందు దాగియున్న సర్పమును గరుత్మంతుడు ఎత్తుకొని పోవును. అట్లే బంధుజనముచే కౌగిలింపబడిన వ్యక్తియొక్క ప్రాణములను మృత్యుదేవత తీసుకొని పోవును.

హా కాంతా! హా ధనమా ! హా పుత్రులారా ! అంటూ మృత్యువు ముఖమునపడిన నరుడు పాము నోటిలోనున్న కప్పవలె అతి దారుణముగా ఆక్రోంశించుచుండును.

ప్రాణవాయువు మర్మ స్థానములను (సూక్ష్మేంద్రియములను) విడిచి పెట్టుచుండగా చేతులు,కాళ్ళు (స్థూలేంద్రియములు) మున్నగువాటి సంధులు విడిపోవు చుండగా మరణించువాడు ఘోరమైన దుఃఖమును అనుభవించును. అట్టి దుఃఖమును మోక్షేచ్ఛ కలిగిన ముముక్షువులగువారు జ్ఞాపకముంచుకొనవలెను.

యమ దూతలను చూచినప్పుడు దృష్టి స్తబ్ధమగును. ప్రజ్ఞమందగించును. ఆ సమయమున మృత్యుపాశముచే కట్టబడిన జీవుణ్ణి రక్షించువారు లేరు! (కనుక తక్షణమే సర్వజీవ రక్షకుడయిన పరమేశ్వరుణ్ణి ఆరాధించవలెను.)

మరణసమయములో జీవి అజ్ఞానముచే ఆవరింపబడినను, గొప్ప వివేకమును పొందియుండును. జ్ఞాతులు పిలుచుచున్నప్పుడు వారి వైపు దీనముగా కళ్ళతో చూచుచుండును, అప్పుడు మాట్లాడు శక్తి లేక చూపును మాత్రమే కలిగియుండును.

జీవాత్మ-యముని యొక్క కాలరూప పాశముతో ఒకవైపు, బంధు మిత్రుల యొక్క స్నేహ రూపపాశముతో మరొకవైపు లాగబడుచుండును. అప్పుడు సహాయము కొరకు ఎదురు చూచుచుందురు.

ఆ సమయమునందు ఆత్మజ్ఞాని తొందరపడక, తన హృదయ మున పరమశివుణ్ని ధ్యానించును. కాని ఎక్కిళ్ళచేతకట్టబడినప్పుడు శ్వాసల చేత నిండినప్పుడు, మృత్యువుచేతఆకర్షింపబడినప్పుడు, రక్షించు వారెవ్వరు లేరు.

యమదూతలు సంసారరూప యంత్రమును ఎక్కించెదరు. కాల పాశము బంధించెదరు. అప్పుడు జీవుడు దుఃఖితుడై;

ఏమి చేయుదును? ఎక్కడకు వెళ్ళెదను ? ఏమి తీసుకొందును? ఏమివిడిచెదను ? అంటూ విచారించుచూ కర్తవ్యవిమూఢుడగును అతి కష్టము మీద దేహమునుండి ప్రాణమును వదలును.



**నీయతే మృత్యునా జంతుః - పరిష్వక్తోఽపి బంధుభిః।**
**సాగరాంత ర్జలగతో - గరుడే నేవ పన్నగః॥ 55**

**హా కాంతే ! హా ధనం ! పుత్రాః - కంద్రమానః సుదారుణమ్ ।**
**మండూక ఇవ సర్పేణ - మృత్యునా నీయతే నరః॥ 56**

**మర్మసూ కృష్యమానేషు - ముచ్యమానేషు సంధిషు**
**యద్దుఃఖం మ్రియమాణస్య - స్మర్యతాం తన్ముముక్షుభిః॥ 57**

**దృష్ట్వా క్షిప్యమాణాయాం - సంజ్ఞయా హ్రియ మాణయా !**
**మృత్యుపాశేన బద్ధస్య - త్రాతా నైవోపలభ్యతే ॥ 58**

**సంరుధ్యమాన స్తమసా - మహ చ్ఛిత్త మివావిశన్ః**
**ఉపహూత స్తదా జ్ఞాతీ - నీక్షతే దీనచక్షుషా ॥ 59**

**అయః పాశేవ కాలేన - స్నేహపాశేన బందుభిః।**
**ఆత్మానం కృష్యమాణం త - మీక్షతే పరితస్తథా ॥ 60**

**హిక్కయా బాధ్యమానస్య - శ్వాసేన పరిశుష్యతః।**
**మృత్యునా కృష్యమాణస్య - న ఖల్వస్తి పరాయణమ్ ॥ 61**

**సంసారయంత్ర మారూఢో - యమదూతై రధిష్ఠితః।**
**క్వ యస్యామీతి దుఃఖార్తః - కాలపాశేన యోజితః॥ 62**

**కిం కరోమి । క్వ గచ్ఛామి ?- కిం గృహ్ణామి త్యజామి కిమ్ ।**
**ఇతి కర్తవ్య తామూఢ - కృచ్ఛ్రాద్దేహా త్త్యజత్యసూన్ ॥ 63**

పిమ్మట జీవియాతనా దేహమునుపొంది యమదూతలచే యమలోకమునకు చేరును. అక్కడ యమ యాతనలు వలన దుఃఖమును ఎవరు వర్ణింపగలరు? (64)

ఏ శరీరము కర్పూరర చందనాదులతో పూయబడి యుండునో, చిత్ర విచిత్రములైన భూషణములతో వస్త్రములతో అలంకరింపబడుచుండునో, అట్టి శరీరము జీవాత్మ వీడిన పిమ్మట స్పృశించదగనిది, చూడదగనిది అగును.

ఆ శరీరమును ఒక్క క్షణము కూడా ఇంటియందు వుంచరు. దానిని శ్మశానమునకు తీసుకొని పోవుదురు, పిమ్మట ఆ శవమును కట్టెలతో దహించి వేయుదురు. దానిని క్షణ కాలములో భస్మము చేయుదరు. ఆ విధముగా చేయని యెడల ఆ శవమును నక్కలు, గ్రద్దలు, కుక్కలు, కాకులు మున్నగునవి భక్షించును. అంత నూరుకోట్ల జన్మలకయిననూ ఆ శరీరము మరల కనిపించదు.

మాయాకల్పిత మగు ఈ జగత్తులో తల్లి తండ్రి, గురువు, స్వజనము మొదలగునవి అసత్యములే! ఎందుకనగా జీవి స్వకర్మచే ఒక్కడే పుట్టి, ఒక్కడే పోవుచుండును. జీవలోకము విశ్రాంతి వృక్షముతో పోల్చదగినది.

ప్రతి దినము సాయంకాలమున పక్షులు నివాస వృక్షమునకు వచ్చి చేరును. ప్రాతఃకాలమున ఆ వృక్షము విడిచి పెట్టును. అవి వాటి వాటి మార్గములను అనుసరించును అట్లే జ్ఞాతులు, జ్ఞాతులు కానివారు స్వకర్మలచే తనను వీడిపోవుదురు.

మృత్యువు (చావు)నకు జన్మము (పుట్టుక) జన్మమునకు, మృత్యువు బీజములు అనగా కారణములు. నరుడు ఘటము యంత్రము (కుమ్మరి చక్రము) వలె విశ్రాంతి లేకుండా ఎల్లప్పుడు తిరుగుచుండును.

ఓ రామా! స్త్రీ గర్భములో పురుషుని శుక్రము పడినది మొదలు, మర ణము పర్యంతము వరకు నీకు చెప్పబడిన సంసారమంతయు దుఃఖభూయిష్ఠ మైనది. ఈ సంసార మహావ్యాధి జన్మ మృత్యువుల దీర్ఘరోగము. దీనికి నా కంటే మరియొక ఔషధము లేదు. అని శంకర భగవానుడు రామచంద్రునకు వివరించెను.

ఇది సంస్కృత పద్మపురాణాంతర్గతంబైన శివగీత యందు వైరాగ్య యోగము అను ఎనిమిదవ అధ్యాయము ముగిసినది.



యాతనాదేహ సంబద్ధో - యమదూతై రధిష్ఠితః।
ఇతో గత్వా ఽనుభవతి - యాయా స్తా యమయాతనాః॥ 64

తాసు యల్లభతే దుఃఖం-తద్వక్తుం సహతే కుతః।
కర్పూర చందనాద్యైస్తు - లిప్యతే సతతం హియత్ ॥ 65

భూషణై ర్భూష్యతే చిత్రైః - సువస్త్రైః పరివార్యతే ।
అస్పృశ్యం జాతయేఽప్రేక్ష్యం-జీవత్యక్తం సదా వపుః॥ 66

నిష్కాసయంతి నిలయాత్ - క్షణం న స్థాపయం త్యపి ।
దహ్యతే చ తతః కాష్ఠై - స్త ద్భస్మ క్రియతే క్షణాత్ ॥ 67

భక్ష్యతే వా సృగాలేన - గృధ్ర కుక్కుర వాయసైః।
పున ర్నదృశ్యతే సోఽథ-జన్మకోటి శతైరపి॥ 68

మాతాపితా గురుజనః స్వజ్వజనో మమేతి
మాయోపమే జగతికస్యభవేత్ ప్రతిజ్ఞా!
ఏకో యతో వ్రజతి కర్మపురస్సరోఽయం
విశ్రామవృక్ష సదృశఃఖలు జీవలోకః॥ 69

సాయం సాయం వాసవృక్షం సమేతాః
ప్రాతః ప్రాత స్తేన తేన ప్రయాంతిః ।
త్యక్త్వాఽఽన్యోన్యం తం చ వృక్షం విహంగాః
తద్వత్తద్వత్ జ్ఞాతయోఽజ్ఞాతయ శ్చ ॥ 70

మృతిబీజం భవే జ్జన్మ - జన్మబీజం భవే మ్మృతిః।
ఘటయంత్రవ దశ్రాంతో - బంభ్రమీత్యనిశం నరః॥ 71

గర్భే పుంస శ్శుక్ర పాతా ద్యదుక్తం మరణావధి ।
తదేవాస్య మహావ్యాధే - ర్మత్తో నాన్యోఽస్తి భేషజమ్ ॥ 72

ఓం తత్సదితి శ్రీ పద్మపురాణే శివగీతా సూఽపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివరాఘవ సంవాదే వైరాగ్యయోగోనామ అష్టమోధ్యాయః

## 9వ అధ్యాయము భావము

"ఓ రామ నృపాలా ! నేను దేహముయొక్క స్వరూపమును చెప్పు చున్నాను. నీవు సావధానుడవై వినుము" అంటూ, శంకర భగవానుడు రామచంద్రునకు వివరించుచుండెను.

ఈ సకల ప్రపంచము నానుండి పుట్టుచున్నది. ఇది నా వలన ధరింప బడుచున్నది. ఇది శుక్తి రజతము (ముత్యము చిప్పలోవెండి) వలె; ఆధార మగు నాయందు విలీన మగుచున్నది.

నేను మాత్రము నిర్మలుడును, పూర్ణుడను, సచ్చిదానంద స్వరూపుడును, అనంగుడను, నిరహంకారుడను, శుద్ధుడను, సనాతనమైన బ్రహ్మమును–

అనాదియగు అవిద్యయే మాయాశక్తి! అట్టి మాయాశక్తితో కూడి నేను జగత్కారణత్వమును పొందెదను. సత్, అసత్, సదసత్ మున్నగు రూపము లచే ఇదమిత్థమని నిర్వచింపనలవి కానిది అవిద్య. అది త్రిగుణములతో కూడి, పరిణామ స్వభావమును కల్గియున్నది.

సత్త్వగుణము శుక్ల(తెలుపు) వర్ణము. ఆది దుఃఖమునకు, చంచల స్వభావమునకు కారణమగుచున్నది.

తమోగుణము కృష్ణ (నలుపు) వర్ణము. అది జడత్వమునకు, సుఖాది భావములందు ఉదాసీనతకు కారణమగుచున్నది.

ఈ మాయాశక్తి త్రిగుణ స్వరూపమగుచున్నది. ఇది నా సంయోగము వలన అధిష్టానమైన నాయందు తనకు తానే విశ్వరూపముగా మార్పు చెందుచున్నది. ఎట్లనగా శుక్తియందు రజిత భ్రాంతివలె, రజ్జువు నందు భుజంగ భ్రాంతివలె నున్నది.

ఈ దేహము పంచభూతాత్మకమైన స్వరూపమును కల్గియున్నది. ఇది తల్లితండ్రులు తినిన ఆహారము నుండి, ఆరు కోశములతో ఆవిర్భవించు చున్నది.

ఆరు కోశములలో తండ్రి నుండి నాడులు ఎముకలు, మెదడు మున్నగు మూడుకోశములు కల్గుచున్నవి.





## శ్రీ శివగీతా

### అథ నవమోఽధ్యాయః

### శరీరనిరూపణ యోగః

శ్రీ భగవాన్ ఉవాచ

దేహస్వరూపం వక్ష్యామి–శృణుష్వాఽవ హితో నృప ।
మత్తో హి జాయతే సర్వ – మయ్యై వైత ప్రదార్యతే॥ 1

మయ్యేవేద మధిష్ఠానే – లీయతే శుక్తి రౌప్యవత్ ।
అహం తు నిర్మలః – పూర్ణ సచ్చిదానంద విగ్రహః॥ 2

అసంగో నిరంహకారః – శ్శుద్ధం బ్రహ్మ సనాతనం ।
అనాద్యవిద్యా యుక్తస్సన్ – జగత్కారణ తాం వ్రజే ॥ 3

అనిర్వాచ్యా మహాఽవిద్యా – త్రిగుణా పరిణామినీ ।
రజస్సత్వం తమశ్చేతి – తద్గుణాః పరికీర్తితాః॥ 4

సత్త్వం శుక్లం సమాదిష్టం – సుఖ జ్ఞానాస్పదం నృణామ్ ।
దుఃఖాస్పదం రక్తవర్ణం – చంచలం చ రజోమతమ్ ॥ 5

తమః కృష్ణం జడం ప్రోక్త – ముదాసీనం సుఖాదిషు ।
అతో మమ సమాయోగా – చ్ఛక్తి స్సా త్రిగుణాత్మికా ॥ 6

అధిష్ఠానే చ మయ్యేవ – భజతే విశ్వరూపతామ్ ।
శుక్తౌ రజ తవద్రజ్జౌ – భుజంగో యద్వదేవ తు॥ 7

ఆకాశాదీని జాయంతే – మత్తో భూతాని మాయయా ।
తై రారబ్ధ మిదం సర్వం – దేహోఽయం పాంచభౌతికః॥ 8

పితృభ్యా మశితా దన్నాత్ – షట్కోశం జాయతే వపుః।
స్నాయవోఽస్థీని మజ్జా చ – జాయంతే పితృత స్తథా ॥ 9

దేహమునకు ఆరు విధములైన జీవపదార్థములు ఉండును. వాటినే షడ్విధభావములంటారు. అవి 1 మాతృజము 2 పితృజము 3 రసజము 4 ఆత్మజము 5 సత్వము 6 స్వాత్మజము మొదలగునవి.

రక్తము, మెదడు, మజ్జ ప్లీహము, పైత్యము, గుదము, హృదయము, నాభి, మున్నగు మృదువైన జీవపదార్థములు మాతృజములు అవి తల్లి వలన కలుగుచున్నవి.

మీసము శిరస్సు మున్నగు శరీరమందలి రోమములు;రక్తనాళములు, ధమనులు, నఖములు దంతములు, శుక్రము...మున్నగు స్థిరమైన జీవ పదార్థములు పితృజములు. అవి, తండ్రి వలన కలుగుచున్నవి.

శరీరస్థూలత్వము, వర్ణము, క్రమాభివృద్ధి, తృప్తి, బలము, సామర్థ్యము, ఆసక్తిలేకపోవడం, ఉత్సాహము...మున్నగునవి రసజములు. అవి, ధాతు విశేషముచే కలుగచున్నవి.



ఇచ్ఛ,ద్వేషము, సుఖము, దుఃఖం, ధర్మము, అధర్మము, భావనలు, ప్రయత్నము జ్ఞానము, ఆయువు, ఇంద్రియములు మున్నగున్నవి ఆత్మజ ములు, అవి, జీవుని కర్మానుసారము కలుగుచున్నవి.

ఇంద్రియములు ద్వివిధములు అవి 1. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియ ములు వాటిని గూర్చి వివరింపబడుచున్నది.

జ్ఞానేంద్రియములు అయిదు అవి, చెవి చర్మము-కన్ను-నాలుక-ముక్కు అని చెప్పబడును. వాటికి క్రమముగా, శబ్దము స్పర్శము-రూపము-రసము గంథము మున్నగున్నవి. తన్మాత్రలు (జ్ఞానేంద్రియ విషయములు)

కర్మేంద్రియములు అయిదు. అవి వాక్కు, చేతులు, పాదములు, గుదము, ఉపస్థ (రహస్యాంగము) అని చెప్పబడును. వాటికి క్రమంగా, వచనము (మాట్లాడడం) ఆదానము (తీసుకోవడం) గమనము (వెళ్ళడం) విసర్గం(విడిచిపెట్టడం) రతి (సంభోగించడం) మున్నగునవి తన్మాత్రలు.

అంతఃకరణములు నాలుగు అవి మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము అని చెప్పబడును. అంతఃకరణములే అంతరింద్రియములు.

మనస్సు, ఉభయాత్మకమైనది. అది సుఖదుఃఖములను గ్రహించును. స్మృతిభీతి. వికల్పము, సంకల్పము మున్నగునవి. మనస్సుచేయు క్రియలు



త్వక్ మాంస శోణిత మితి - మాతృతశ్చ భవంతి హి ।
భావా స్స్యు షడ్విధాస్తస్య - మాతృజాః పితృజా స్తథా ॥ 10

రసజా ఆత్మజా స్సత్త్వ - సంభూతా స్స్వాత్మజా స్తథా ।
మృదవ శ్శోణితం మేదో - మజ్జా ప్లీహా యకృ ద్గుదమ్ ॥
హృన్నాభీత్యేవ మాద్యాస్స్యు - ర్భావా మాతృభవా మతాః॥ 11

శ్మశ్రు రోమకచ స్నాయు - శిరాధమనయో నఖాః।
దశనా శ్శుక్ర మిత్యాది - స్థిరాః పితృసముద్భవాః॥ 12

శరీరోపచితి ర్వర్ణో - వృద్ధి స్తృప్తి ర్బలం స్థితిః।
అలోలుపత్వ ముత్సాహ - ఇత్యాదీన్ రసజాన్విదుః॥ 13

ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం - ధర్మాధర్మౌ చ భావనా।
ప్రయత్నో జ్ఞాన మాయుశ్చే౽౽ంద్రియాణీత్యేవ మాత్మజాః॥ 14

జ్ఞానేంద్రియాణి శ్రవణం - స్పర్శనం దర్శనం తథా ।
రసనం ఘ్రాణ మిత్యాహుః - పంచ తేషాం చ గోచరాః॥ 15

శబ్ద స్స్పర్శ స్తథా రూపం - రసో గంధ ఇతి క్రమాత్ ।
వా క్కరాంఘ్రి గుదోపస్థా - న్యాహుః కర్మేంద్రియాణి హి ॥ 16

వచనాదాన గమన - విసర్గ తరయః క్రమాత్ ।
కర్మేంద్రియాణాం జానీయా - న్మనశ్చై వోభయాత్మకమ్ ।
క్రియా స్తేషాం మనో బుద్ధి - రహంకార స్తతః పరమ్ ॥ 17

అంతః కరణ మిత్యాహు - శ్చిత్తం చేతి చతుష్టయమ్ ।
సుఖం దుఃఖం చ విషయౌ - విజ్ఞేయౌ మనసః క్రియాః॥ 18

స్మృతి భీతి వికల్పాద్యాః బుద్ధిః స్యా న్నిశ్చయాత్మికా।
అహం మమేత్యహంకార - శ్చిత్తం చేతయతే యతః॥ 19

బుద్ధి – నిశ్చయాత్మకమైనది. అహంకారము–నేను నాది అను అభిమానమును కల్గించునది. చిత్తము–ఇంద్రియాగోచరములను తలపింప చేయునది. ఈ నాలుగు విధములైన అంతఃకరణ వృత్తినే సత్త్వజమంటారు.

సత్త్వజము–గుణభేదము వలన త్రివిధములని చెప్పబడును. అని సత్త్వరజః, తమో గుణములు త్రిగుణములు.

సత్వగుణమునుండి సాత్త్వికభావములు కలుగును. అవి ఆస్తిక్యము బాహ్యాభ్యంతర శుద్ధి, ధర్మపరత్వము, మున్నగునవి. ఇవి ఉత్తమ గుణములు.

రజోగుణము నుండి రాజసభావములు కలుగును. అవి, కామము, క్రోధము మదము, మున్నగునవి ఇవి మధ్యమ గుణములు.

తమోగుణము నుండి తామసభావములు కలుగును. అవి నిద్ర సోమరితనము ప్రమాదము (జాగ్రత్తలేమి) మున్నగునవి ఇవి అధమ గుణములు.

నిర్మలముగా ఇంద్రియములను ఉంచడం, ఆరోగ్యముగా ఉండడం, సోమరితనముగా లేకపోవడం మున్నగునవి సత్త్వజములు.

పంచజ్ఞానేంద్రియములు శ్రోత్రము (చెవి). త్వక్కు(చర్మము) చక్షువు (కన్ను) రసనము (నాలుక) ఘ్రాణము (ముక్కు) మున్నగునవి. అట్టి వాటి విషయములు వరుసగా శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము మున్నగునవి వాటినే పంచతన్మాత్రలు అందురు.

పాంచభౌతికమైన దేహము పంచతన్మాత్రాత్మకమైనది. కనుక తద్గుణములను కల్గియుండును.

శబ్దము, శ్రోత్రేంద్రియము (చెవి) మాటలాడుట, సూక్ష్మబుద్ధి, బలము, ధైర్యము మున్నగు గుణములు ఆకాశ తత్త్వము నుండి శరీరమునకు లభ్యమగును.

స్పర్శము, స్పర్శేంద్రియము (చర్మము), ఉత్క్షేపణము (చాచుట), ఆవక్షేపణము (వంచుట). అకుంచనము (ముడుచుట), గమనము (వెళ్ళుట) ప్రసారణము (విస్తరింపచేయుట) మున్నగు గుణములు వాయు తత్త్వము నుండి శరీరమునకు లభ్యమగును.



సత్త్వాఖ్య మంతః కరణం
గుణభేదాత్ త్రిధామతమ్ ।
సత్త్వం రజస్తమ ఇతి
గుణాస్సత్త్వాత్తు సాత్త్వికాః॥ **20**

ఆస్తక్య శుద్ధి ధర్మైక రుచిప్రభృతయో మతాః ।
రజసో రాజసా భావాః – కామ క్రోధ మదాదయః॥ **21**

నిద్రాలస్య ప్రమాౌత్సాది
వంచనాదాస్తు తామసాః।
ప్రసన్నేంద్రియ తారోగ్యా
నాలస్యాద్యాస్తు సత్త్వజాః॥ **22**

దేహో మాత్రాత్మక స్తస్మా
దాదత్తే తద్గుణా నిమాన్ ।
శబ్ద శ్శ్రో త్రం ముఖరతా
వైచిత్ర్యం సూక్ష్మతా ధృతిః॥ **23**

బలం చ గగనా ద్వాయో
స్స్పర్శశ్చ స్పర్శనేంద్రియమ్ ।
ఉత్క్షేపణ మవక్షేపా
కుంచనే గమనం తథా ॥ **24**

ప్రసారణ మితీమాని
పంచ కర్మాణి రూక్షతా।
ప్రాణాపానౌ తథా వ్యాన
సమానోదాన సంజ్ఞకాన్ ॥ **25**

నాగం కూర్మం చ కృకరం – దేవదత్తం ధనంజయమ్ ।
దశైతా వాయు వికృతీ స్తథా గృహ్ణాతి లాఘవమ్ ॥ **26**

ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానములను పంచమహా వాయువులును, నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయములను పంచోప వాయువులును మొత్తము దశవాయువులును ఎండింపచేయుట, తేలికయగుట మున్నగునవి వాయుతత్త్వము వలన లభించును.

దశవాయువులలో ప్రాణవాయువు ముఖ్యమైనది. అది నాభి మొదలు కంఠము వరకు సంచారము చేయుచుండును. రెండు ముక్కు రంధ్రముల గుండా ప్రాణవాయువు హృదయ పద్మమునందును, నాభియందును సంచరించు చుండును. శబ్దములు ఉచ్చారణకు, ఉచ్ఛ్వాస నిశ్వాసములకు ప్రాణ వాయువే కారణమగుచున్నది.

అపానవాయువు గుదము, రహస్యాంగము, నడుము, పిక్కలు, ఉదరము, నాభి, గజ్జలు, తొడలు మున్నగు స్థానముల యందు నుండును. మూత్రము మలములను విసర్జన చేయుట అపానవాయువు చేయు పనులు.

వ్యానవాయువు, కన్నులు చెవులు, చీలమండలము,నాలుక, ముక్కు, మున్నగు స్థానముల యందు నుండును. ప్రాణాయామము నందు రేచరము, పూరకము కుంభకములను వ్యాన వాయువు చేయుపనులు.

ఉదానవాయువు-కాళ్ళు, చేతుల, మున్నగు అవయవములు సంధుల యందు నుండును. దేహమును లేవనెత్తటం, ఉత్క్రమణము, ఉదాన వాయువు చేయుపనులు అనగా, ఉదాన వాయువు వలన దేహము పైకి లేచి నిలుచును. అవసానదశలో జీవుడు శరీరమును విడిచి పెట్టివెళ్ళును

సమాన వాయువు - అగ్నితో కూడి, శరీరమంతము వ్యాపించి యుండును. అది డెబ్బదిరెండువేల (72,000) నాడుల రంధ్రముల యందు సంచరించుచుండును. తినిన, త్రాగిన వాటియొక్క సారమును సమాన వాయువు శరీరమంతా పంపిణీ చేయును. తద్వారా దేహపుష్టిని కలిగించు చుండును.



తేషాం ముఖ్యతరః ప్రాణో నాభేః కంఠాదవస్థితః।
చరత్యసౌ నాసికయో ర్నాభౌ హృదయపంకజే ॥ **27**

శబ్దోచ్చారణ నిశ్వాసో - చ్ఛ్వాసాదేరపి కారణమ్ ।
అపానస్తు గుదే మేఢ్రే - కటి కంఘోదరే ష్వపి ॥ **28**

నాభికందే వృషణయో - రూరుజానుషు తిష్ఠతి ।
ప్రాణాయామ ధృతి త్యాగ - గ్రహణా ద్యస్య కర్మచ।
తస్య మూత్ర పురీషాది -విసర్గః కర్మకీర్తితమ్ ॥। **29**

వ్యానోఽక్షి శ్రోత్ర గుల్ఫేషు - జిహ్వా ఘ్రాణేషు తిష్ఠతి।
సమానో వ్యాప్య నిఖిలం - శరీరం వహ్నినా సహ ॥
ద్విసప్తతి సహస్రేషు - నాడీరంధ్రేషు సంచరన్ ॥। **30**

భుక్త పీతరసాన్ స్సమ్య - గానయన్ దేహపుష్టికృత్ ।
ఉదానః పాదయోరాస్తే - హస్తయో రంగసంధిషు ॥ **31**

కర్మాఽస్య దేహోన్నయనో - త్క్రమణాది ప్రకీర్తితమ్ ।
త్వగాదిధాతూ నాశ్రిత్య - పంచ నాగాదయ స్థి తాః॥ **32**

ఉద్గారాది నిమేషాది - క్షుత్పిపాసాది కం క్రమాత్ ।
తంద్రీప్రకృతి శోకాది - తేషాం కర్మ ప్రకీర్తితమ్ ॥ **33**

అగ్నేస్తు రోచకం రూపం - దీప్తం పాకం ప్రకాశతామ్ ।
అమర్ష తీక్ష్ణ సూక్ష్మాణా - మోజ స్తేజశ్చ శూరతామ్ ॥ **34**

త్వగాది సప్తధాతువులయందు నాగాది పంచవాయువులు వ్యాపించి యున్నవి. ఎక్కిళ్ళు, వాంతులు మున్నగునవి నాగవాయువు గుణములు. (1) కన్నుతెరుచుట, మూయుట, చూచుట, మున్నగునవి కూర్మవాయువు గుణములు (2) ఆకలి, దాహము, తుమ్ముట మున్నగునవి కృకరవాయువు గుణములు (3) అలసత్వము, నిద్ర, ఆవలించుట మున్నగునవి. దేవదత్త వాయువు గుణములు (4) ప్రకృతిచే సుఖము, దుఃఖముల వలన నవ్వుట, ఏడ్చుట, మున్నగునవి ధనంజయ వాయువు గుణములు.

చక్షుంద్రియము (కన్ను), ప్రకావవంతమగు రూపము, దీప్తి, జీర్ణశక్తి శాంతి, కోపము, తీక్షణత్వము, సూక్ష్మత్వము, బలము, తేజస్సు శౌర్యము మున్నగు గుణములు అగ్నితత్వము నుండి శరీరమునకు లభ్యమగును. మేధాశక్తియు తేజస్సు వలన కలుగును.

రసనేంద్రియము (నాలుక) రసము, శీతలత్వము, స్నేహము, ద్రవ త్వము, స్వేదము, మృదుత్వము మున్నగు గుణములు జలతత్వమునుండి శరీరమునకు లభ్యమగును.

ఘూణేంద్రియము (ముక్కు) గంధము, స్థిరత్వము, దృఢత్వము,గురు త్వము (బరువు), త్వక్కు, మాంసము, రక్తము, ఎముకలు, మజ్జ (క్రొవ్వు), శుక్రము నాడులు, మున్నగు గుణములు భూమితత్త్వము నుండి శరీరము నకు లభ్యమగును.

జీవుడు తినిన అన్నము - జఠరాగ్నిచేత మూడు భాగములుగా విభ జింపబడుచుండును. అందు స్థూల భాగము - మలముగాను, మధ్యమ భాగము మాంసముగాను; కనిష్ఠభాగము మనస్సుగాను మారును. కనుకనే మనస్సును అన్నమయమని చెప్పబడును.

త్రాగిన జలమునందు, స్థూలభాగము-మూత్రముగాను; మధ్యమ భాగము-రక్తముగాను; కనిష్ఠభాగము-ప్రాణముగాను మారును. కనుకనే ప్రాణము జలమయమని చెప్పబడును.

తేజస పదార్థములైన నెయ్యి, నూనె మున్నగునవి తిని నందున తేజస్సు నందు, స్థూలభాగము-ఎముకలుగాను, మధ్యమభాగము-క్రొవ్వుగాను, కనిష్ఠభాగము-వాక్కుగాను మారును.



మేధావితాం తథాఽఽదత్తే - జలాత్తు రసనం రసమ్ ।
శైత్యం స్నేహం ద్రవం - స్వేదం గాత్రాది మృదుతామపి ॥ 35

భూ మేఽ ఘ్రాణేంద్రియం గంధం - స్థైర్యం ధైర్యం చ గౌరవమ్ ।
త్వగసృక్ మాంస మేదోఽస్థి - మజ్జా శుక్రాణి ధాతవః॥ 36

అన్నం పుంసాఽశితం త్రేధా - జాయతే జఠరాగ్ని నా
మలం స్థవిష్ఠో భాగస్స్యా - న్మధ్యమో మాంసతాం వ్రజేత్ ॥ 37

మనః కనిష్ఠో భాగస్స్యా - త్తస్మా దన్నమయం మనః।
అపాం స్థవిష్ఠో మూత్రం స్యా - న్మధ్యమో రుధిరం భవేత్ ॥ 38

కనిష్ఠభాగః ప్రాణస్స్యా - త్తస్మాత్ప్రాణో జలాత్మకః।
తేజసోఽస్థి స్థవిష్ఠ స్స్యా - న్మజ్జామధ్య సముద్భవః ॥ 39

కనిష్ఠా వాఙ్మతా తస్మా త్తేజోఽ బన్నాత్మకం జగత్ ।
లోహితా జ్జాయతే మాంసం - మేదో మాంస సముద్భవమ్ ॥ 40

మేదసోఽస్థీని జాయంతే - మజ్జా చాఽస్థి సముద్భవా ।
నాడ్యోఽపి మాంససంఘాతా - చ్ఛుక్రం మజ్జా సముద్భవమ్ ॥ 41

కావున, ఈ జగత్తు భూమి, జలము, అగ్నితత్త్వములతో ఈ చరాచర ప్రపంచమంతయు కూడి యున్నది.

రక్తము నుండి మాంసము; మాంసము నుండి మేధా; మేదా నుండి ఎముకలు, ఎములనుండి మజ్జా; ఉద్భవించును. మాంసము నుండి నాడులు మజ్జానుండి శుక్రమును కలుగును.

వాతము, పిత్తము శ్లేష్మములని మూడు ధాతువులు. శరీరము నందు పది దోసిళ్ళు జలమును, తొమ్మిది దోసిళ్ళు అన్న రసము నుండును.

రక్తము-ఎనిమిది, పురీషము (మలము) ఏడు; శ్లేష్మము-ఆరు, పిత్తము అయిదు, మూత్రము-నాలుగు, శిరా-మూడు, మేదా-రెండు, మజ్జా-ఒక్కటి దోసిళ్ళు సంఖ్యను కల్గి యుండును.

అరదోసిలి శుక్రము దేహము నందుండును. అదియే బలము ! అనగా శరీరములోని అత్యంత మహత్వ పూర్ణతత్త్వము శుక్రమని చెప్పబడును.

శరీరము నందు ఎముకలు-మూడు వందల అరువది (360) కలవు అవి జలజములు, కపాలములు, రుచరములు, తరణములు, నలకములని పంచ విధములు.

రెండువందల పది (210) అస్థి సంధులు కలవు. వీటిని, రౌరములు ప్రసరములు స్కంధ సేచవములు, ఉలూఖలములు, సముద్రములు, కుండల ములు, శంభావర్తములు, వాయస, తుండకములని అష్టవిధ నామములు. మూడు కోట్ల ఏబది లక్షలు (3,50,00,000) రోమములు, మూడు లక్షల (3,00,000) మీసములు, వెంట్రుకలు కలవు. ఓ దశరథాత్మజా! దేహము యొక్క స్వరూపం వివరించితిని.

ఈ దేహముకంటే సారహీనమైన, నికృష్టమైన పదార్థము మరొక్కటి లేదు. దీనియందు అభిమానముచే, బుద్ధిమంతులు, అహంకారులగు చున్నారు. అట్టివారు పాపపు పనులు చేయుచున్నారు. కావున ధీమంతులైన వారు దేహ స్వరూపమును చక్కగా తెలుసుకోవలెను. అంటూ రామచంద్రు నకు శంకరభగవానుడు వివరించెను.

ఇట్లు ఉపనిషత్తును, బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును అయిన శ్రీ శివరామ సంవాద (ప్రశ్నోత్తర) రూపాత్మకమగు శ్రీశివగీతలో శరీర నిరూపణ వర్ణన యోగమను తొమ్మిదవ అధ్యాయం ముగిసినది.



**వాత పిత్త కఫాశ్చాత్ర - ధాతవః పరికీర్తితాః।**
**దశాంజలిజలం జ్ఞేయం - రసస్యాం జలయో నవ॥ 42**

**రక్తస్యాష్టౌ పురీషస్య - సప్త హి శ్లేష్మణశ్చ షట్ ।**
**పిత్తస్య పంచ చత్వారో - మూత్ర స్యాంజలయ స్త్రయః॥ 43**

**వసాయా మేదసో ద్వౌ తు - మజ్జా త్వంజలిసమ్మితః**
**అర్ధాంజలి తథా శుక్రం - తదేవ బలముచ్యతే ॥ 44**

**అస్థ్నాం శరీరే సంఖ్యాస్యాత్ - షష్టియుక్తం శతత్రయమ్ ।**
**జలజాని కపాలాని - రుచకా స్తరణాని చ ॥ 45**

**నలకానీతి తాన్యాహుః-పంచధాఽస్థీని సూరయః।**
**ద్వే శతే త్వస్థి సంధీనాం - స్యాతాం తత్ర దశోత్తరే ॥ 46**

**రౌరవాః ప్రసరాస్స్కంద - సేచనా స్స్యురులూఖలాః।**
**సముద్రా మండలా శృంఖా- వర్తా వాయస తుండ కాః॥ 47**

**ఇ త్యష్టధా సముద్దిష్టా - శ్శరీరేష్వస్థి సంధయః।**
**సార్ధకోటి త్రయం రోమ్ణాం- శ్శ్మశ్రుకేశా స్త్రిలక్షకాః॥ 48**

**దేహస్వరూపమేవంతే ప్రోక్తం దశరథాత్మజా**
**యస్మాదసారో నాస్త్యేవ పదార్థో భువనత్రయే ॥ 49**

ఓం తత్సదితి శ్రీపద్మపురాణే శివగీతా సూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివ రాఘవ సంవాదే శరీరనిరూపణ యోగోనామ నవమోధ్యాయః

## 10వ అధ్యాయము భావము

రాఘవుడు, అప్పుడు జీవస్వరూపమును తెలుసుకొనుటకు దిగువ విధముగా ప్రశ్నించెను. భగవాన్ ! జీవుడు భౌతిక దేహమునందు ఎక్కడ ఉండును? ఎక్కడ నుండి జీవుడు ఆవిర్భవించుచుండెను? జీవుని స్వరూపము ఎట్టిది ? దేహము గతించిన పిమ్మట, జీవుడు ఎక్కడకు వెడలును? జీవుడు-మరల మరొక దేహమును పొందునా? లేదా?" అంటూ రామచంద్రుడు, తన సందేహములను అడుగగా, శంకర భగవానుడు వివరించుచుండెను.

మహాభాగా ! రామా! నీవు మంచి ప్రశ్నను అడిగితివి. రహస్యాతి రహస్యమైనది. ఇది ఇంద్రాది దేవతలు, నారదాది మహర్షులు కూడ తెలియ దగినది కాదు.

రఘునందనా ? నీదృఢభక్తికిమెచ్చి, అట్టి జ్ఞానమును నీకు చెప్పు చున్నాను. అద్దానిని, నీవు అనధికారులకు చెప్పకూడదు. కావున, నీవు సావధానుడవై వినుము.

నేను – సత్య, జ్ఞానస్వరూపుడను, అనంతుడను, పరమానంద విగ్రహు డను పరమాత్మను, పరంజ్యోతిని, వ్యక్తము, అవ్యక్తమగు కార్యములకు కారణుడను.

నిత్యుడను, శుద్ధుడను, సర్వాత్మ స్వరూపుడను, నిర్లేపుడను, నిరంజను డను జాతి, క్రియ, గుణము, మున్నగు సర్వధర్మములు లేనివాడను, మనస్సు చేత గ్రహింపబడువాడను, కాను.

సర్వేంద్రియములచేత తెలియబడనివాడను, అన్నింటిని గ్రహించు వాడను సర్వలోకములను ఎరిగినవాడను. నన్ను తెలుసుకొను వారెవ్వరూ లేరు. షడ్భావ వికారములకు, అవిద్యా పరిణామములకు దూరుడను.

వాక్కు, మనస్సులు (బాహ్యేంద్రియ, అంతరింద్రియములు) నన్ను పొందలేక (తెలుసుకోలేక) పోవుచున్నవి.

ఆనంద స్వరూపుడను, పరబ్రహ్మ స్వరూపమైన నన్ను తెలుసుకొన్న జ్ఞాని ఎచ్చటను కూడ భయమును పొందదు ? అనగా, అతడు నిర్భయ ముగా నుండును.





# శ్రీ శివగీతా

## అథ దశమోஉధ్యాయః

## జీవస్వరూప నిరూపణ యోగః

శ్రీరామ ఉవాచ

భగవన్ ! నత్ర జీవోஉసౌ - జంతో ర్దేహేஉవతిష్ఠతే ।
జాయతే వా కుతో జీవః - స్వరూపం వాஉస్య కిం వద॥ 1
దేహాంతే వా కుత్ర యాతి - గత్వా వా కుత్ర తిష్ఠతి ।
కథ మాయతి వా దేహం - పున ర్నాయాஉஉతి వా వద॥ 2

శ్రీ భగవాన్ ఉవాచ

సాధు పృష్ఠం మహాభాగ - గుహ్యా ద్గుహ్యతరం హి యత్ ।
దేవైరపి సుదుర్జ్ఞేయ - మింద్రాద్యైర్వా మహర్షిభిః॥ 3
అన్యస్మై నైవ వక్తవ్యం - మయాపి రఘునందన ।
త్వద్భక్త్యాஉహం పరం ప్రీతో - వక్ష్యా మ్యవహిత శృణు॥ 4
సత్య జ్ఞానాత్మ కో உనంతః-పరామానంద విగ్రహః।
పరమాత్మా పరంజ్యోతి - రవ్యక్తో వ్యక్తకారణమ్ ॥ 5
నిత్యో విశుద్ధః స్సర్వాత్మా - నిర్లేపోஉహం నిరంజనః।
సర్వధర్మ విహీనశ్చ - న గ్రాహ్యో మనసాஉపి చ ॥ 6
నాహం సర్వేంద్రియ గ్రాహ్యః - సర్వేషాం గ్రాహకో హ్యహమ్ ।
జ్ఞాతాஉహం సర్వలోకస్య - మమ జ్ఞాతా న విద్యతే ॥ 7
దూర స్సర్వ వికారాణాం - పరిణామాదికస్య చ । 8
యతో వాచో నివర్తంతే - అప్రాప్య మనసా సహ ।
ఆనందం బ్రహ్మ మాం జ్ఞాత్వా - న బిభేతి కుతశ్చన ॥ 9

ఎవ్వడు-సకల భూతములు (జీవులు) నాయందున్నవని తెలుసు కొనునో నన్ను - సకల భూతములయందున్నవానిగా చూచునో; అట్టి జ్ఞాని రాగము, ద్వేషము, మున్నగు భావముల నుండి విడివడును.

సకల భూతములను, తన ఆత్మస్వరూపముగా ఏకత్వమునే చూచునో; అట్టి జ్ఞానికి ఎక్కడిది మోహము? ఎక్కడిది శోకము ? అనగా; మోహశోక ములు అతనికి కలుగవు.

పరమాత్మ సకల భూతములయందు ఆత్మస్వరూపముగ, నిగూఢముగ ఉండి, అజ్ఞానముచేత కనుపించకున్నది. అద్దానిని, సంస్కారము, సూక్ష్మ బుద్ధి ఏకాగ్రత కల్గిన సాధకులు మాత్రమే దర్శించుచున్నారు.

నేను - సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితుడను. అట్టి నేను అనాదియగు అవిద్యచేత ఆవరింపబడి, నామరూపములుగా అభివ్యక్తమయ్యె దను. పరబ్రహ్మ స్వరూపుడగు జగత్కర్తను నేనే మహేశ్వరుడను.

జ్ఞాన దృష్టిచేతనే స్వప్నములో మూడులోకములు కల్పింపబడుచున్నవి. అట్లే, నాయందు అవిద్యచే జగమంతయు ఉన్నది. కనబడుచున్నది. విలీన మగుచున్నది.

నేనే అవిద్యతోకూడి, జీవస్వరూపుడనై యున్నాను. పంచకర్మేంద్రియ ములు, పంచ జ్ఞానేంద్రియములు, అంతఃకరణ చతుష్టయము, పంచమహా వాయువులు వెరశి ఏకోనవింశతి (19) తత్త్వములు కలిసి లింగ శరీర మగును. దీనిని సూక్ష్మ శరీర మంటారు.

లింగ శరీరమునందు అవిద్య సంపర్కముతో చైతన్యము (జీవము) ప్రతిబింబించును. అద్దానిని, వ్యావహారిక జీవుడని, క్షేత్రజ్ఞుడని, పురుషుడని అందురు. ఆ జీవుడే అనాదియగు పుణ్యపాప ఫలములకు భోక్త! ఇహపరము లకు గతి! అతడు జాగ్రదవస్థ, స్వప్నావస్థల యందు భోక్తృత్వము వహిం చును.

దర్పణము (అద్దము) మలినముగానున్నచో మన ముఖము కూడ. మలినముగానే కనుపించును. అదేవిధముగా అంతఃకరణము దోషముగా నున్నచో ఆత్మకూడ దోషంగానే కనుపించును.

ఆత్మ, అంతఃకరణము రెండింటిలో పరస్పరము తాదాత్మ్యము, భ్రమ వలన ఏకత్వాభిమానమును కల్గియుండును అందుచే పరమాత్మ కూడ దుఃఖమును పొందువానివలె నుండును. ఇది యదార్థముకాదు.



యస్తు సర్వాణి భూతాని - మయ్యే వేతి ప్రపశ్యతి ।
మాం చ సర్వేషు భూతేషు తతో న వి జుగుప్సతే ॥ 10

యస్య సర్వాణి భూతాని హ్యాత్మైవా ఽభూ ద్విజానతః।
కో మోహ స్తత్ర క శ్శోక - ఏకత్వ మనుపశ్యతః॥ 11

ఏష సర్వేషు భూతేషు - గూఢో ఽ ఽత్మా న ప్రకాశతే ।
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా - సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥ 12

అనాద్య విద్యయా యుక్త - స్తథాప్యేకో ఽ హ మవ్యయః।
అవ్యాకృత బ్రహ్మరూపో - జగత్కర్తా మహేశ్వరః॥ 13

జ్ఞానమాత్రే యథా దృశ్య - మిదం స్వప్నే జగత్త్రయమ్ ।
తద్వన్మయి జగత్సర్వం - దృశ్యతే ఽ స్తి విలీయతే ॥
నానావిద్యా సమాయుక్తో - జీవత్వేన వసామ్యహమ్ ॥ 14

పంచ కర్మేంద్రియాణ్యేవ - పంచ జ్ఞానేంద్రియాణి చ ।
మనో బుద్ధి రహంకార - శ్చిత్తం చేతి చతుష్టయమ్ ॥ 15

వాయవః పంచ మిళితా యాంతి లింగశరీరతామ్ ।
తత్రా ఽ విద్యా సమాయుక్తం - చైతన్యం ప్రతిబింబితమ్ ॥ 16

వ్యావహారిక జీవస్తు - క్షేత్రజ్ఞః పురుషో ఽ పి వా !
స ఏవ జగతాం భోక్తా ఽ నాద్యయోః పుణ్యపాపయోః॥ 17

ఇహాముత్ర గతి స్తస్య - జాగ్రత్స్వప్నాది భోక్తృతా ।
యథా దర్పణమాలిన్యా - ద్దృశ్యతే మలినం ముఖమ్ ॥ 18

తద్వ దన్తః కరణగై - ర్దోషై రాత్మా ఽ పి దృశ్యతే । 19

మధ్యాహ్న సమయమునందు సూర్యుని కిరణములకు మరుభూమి (ఎడారి) యందు ఎండమావులు-జలమువలె, మందబుద్ధి కలవానికి కనుపించును. వాటిలో జలములేదని తెలిసికొనలేదు. తాపమును కల్గించును.

అట్లే, మూఢునకు ఆ విద్యాదోషముచే నిర్లప్తమైన ఆత్మ కర్తృత్వము, భోక్తృత్వము మున్నగు ధర్మములు కలవానిగా తోచును.

అన్నమయ మాంసపిండమగు దేహములో హృదయమునందు జీవుడుండును. ఆ జీవుడు నఖశిఖ పర్యంతము దేహమంతయు వ్యాపించియుండును. అద్దానిని గూర్చి సాధానముగా చెప్పెదను. శ్రద్ధగా వినుము.

నాభికిపైనను, కంఠమునకు క్రిందను "పురీతత్"అను(నామము కల్గిన) మాంసపిండము కలదు. అందు మధ్యభాగమున అధోముఖమును కల్గి నాళముతో కూడిన పద్మమువలె హృదయమున్నది. అద్దానిలో సూక్ష్మము శుద్ధము ఉత్తమమైన ఒక ఆకాశము కలదు. అదియే దహరాకాశము అందులో జీవుడు ఉండును.

వెంట్రుక చివరి భాగమును నూరుభాగములుచేసి, అందులోని ఒక భాగమును, మరల నూరు భాగములు చేయవలెను. అప్పుడు వాటిలోని ఒకదానియంత సూక్ష్మపరిమాణమును జీవుడు కల్గియుండును. అట్టి జీవుడే అనంతుడని చెప్పబడును.

కదంబ కుసుమము (కడిమిపూవు) నందు ఆవరించిన కేసరములవలె హృదయము నుండి నాడులు, శరీరమంతటా వ్యాపించియుండును.

హృదయ నాడులు, హితమును, బలమును కల్గించును. కావున హితములని చెప్పబడును. అవి, (డెబ్బది రెండువేలు) గా యోగసాధకులచే లెక్కింపబడినవి.

వాటిలో ఏకోత్తర శతము (నూటొక్కటి) నాడులు ముఖ్యమైనవి అవి, సూర్యునినుండి కిరణములవలె, హృదయమునుండి శరీరమంతటను వ్యాపించినవి.

ప్రతీ ఇంద్రియము నుండి ఆయా విషయానుభవము కొరకు పది నాడులు వెడలుచుండును. అట్లే, దశేంద్రియములనుండి నూరు (పది పది) నాడులు కర్మము, అదృష్టము మున్నగువాటి ననుసరించి జాగ్రదవస్థ స్వప్నావస్థలలో ఫలానుభవము కొరకు విషయాభిముఖములగు చుండును.



పరస్పరాధ్యాసవశా - త్స్యా దంతఃకరణాత్మనోః।
ఏకీభావా భిమానేన పరాత్మా దుఃఖభాగివ ॥ 20

మరుభూమౌ జలత్వేన - మధ్యాహ్నార్క మరీచికాః।
దృశ్యంతే మూఢచిత్తస్య - న హ్యార్ద్ర స్తాపకారకః॥ 21

తద్వ దాత్మాఽపి నిర్లేపో - దృశ్యతే మూఢచేతసామ్ ।
స్వాఽవిద్యాఖ్యాత్మ దోషేణ - కర్తృత్వాదిక ధర్మవాన్ ॥ 22

తత్ర చాన్నమయే పిండే - హృది జీవోఽవతిష్ఠతే ।
అనఖాగ్రం వ్యాప్య దేహం - తద్బ్రువేఽవ హిత శృణు॥ 23

పురీత దభిధానేన - మాంసిండో విరాజతే ।
నాభేరూర్ధ్వమధః కంఠా - ద్వ్యాప్య తిష్ఠతి య స్సదా ॥ 24

తస్య మధ్యేఽస్తి హృదయం - సనాలం పద్మకోశవత్ ।
అధోముఖం చ తత్రాస్తి - సూక్ష్మం సుషిర ముత్తమమ్ ॥ 25

దహరాకాశ మిత్యుక్తం - తత్ర జీవోఽవతిష్ఠతే ॥ 26

వాలాగ్ర శతభాగస్య - శతధా కల్పితస్య చ ।
భాగో జీవస్స విజ్ఞేయః స చానన్త్యాయ కల్పతే ॥ 27

కదంబ కుసుమో ద్భుద్ధ - కేసరా ఇవ సర్వతః।
ప్రసృతా హృదయాన్నాడ్యో - యాభిర్వ్యాప్తం శరీరకమ్ ॥ 28

హితం బలం ప్రయచ్ఛన్తి - యస్మాత్తేన హితాః స్మృతాః।
ద్వా సప్తతి సహస్రైస్తా - స్సంఖ్యాతా యోగవిత్తమైః॥ 29

హృదయాఽత్తాస్తు నిష్క్రాంతా - యథార్కాద్రశ్మయ స్తథా ।
ఏకోఽత్తర శతం తాసు - ముఖ్యా విష్వగ్వినిర్గతాః॥ 30

నదులు, జలమును దాల్చునట్లు హృదయనాడులు కర్మఫలమును దాల్చును. వాటిలో "అవంతానిడి" గుదమునుండి శిరస్సు పర్యంతము వరకు వ్యాపించియున్నది. అదియే "సుషుమ్నానాడి". అద్దాని ద్వారా వెడలిన వాడు ముక్తుడగును. అచ్చట నెలకొనియుండు చైతన్యమే "జీవుడు" అని విబుధులు చెప్పెదరు.

రాహుగ్రహము ఏవిధముగా కనుపించక పోయినను, చంద్రమండలము నందు (చంద్రగ్రహణమునాడు గ్రహణ ఛాయా రూపమున) కనుపించును. అట్లే, సర్వ వ్యాపకమైన, రూప రహితమైన ఆత్మయు లింగ దేహముతో సంబంధము కల్గియున్నందున కనుపించును.

ఘటము (కుండ)ను తీసుకొని పోవుచున్నప్పుడు ఘటాకాశము (కుండలో నున్న ఆకాశము)ను కూడా తీసుకొని పోవుచున్నట్లు ప్రతీతమగును. అదేవిధముగా సర్వవ్యాపకమైన, చలన రహితమైన ఆత్మయు లింగదేహముతో సంబంధము కల్గియున్నందున కదలుచున్నట్లు భావింపబడును.

ఆత్మయు-పరిపూర్ణము, నిశ్చలమైనప్పటికీ లింగదేహము యొక్క రాకపోకలవలన చలించుచున్నట్లు ప్రతీతమగును. జీవుడు వాస్తవముగా నిష్క్రియుడే!

సూర్యుడు తన ప్రకాశముతో దశదిశలను వ్యాపించియుండును. అట్లే జీవుడు జాగ్రదావస్థలో జ్ఞానవంతుడై, బుద్ధీంద్రియ స్ఫూర్తిని కల్గియుండును.

లింగదేహమునుండి వృత్తులు ఉత్పన్నములగును. అవి కర్మానుసారముగ, జాగ్రదవస్థయందలి ఫలానుభవముకొరకు నాడులలో చేరి వెడలుచుండును. ఇట్టి లింగ దేహము ముక్తి పొందేవరకు నశింపదు.

తత్త్వజ్ఞానమే, ఆత్మజ్ఞానము, దానిచేత అవిద్యతో కూడిన లింగదేహము నశించును. ఆ సమయమునందు ఆత్మ, తన సచ్చిదానంద స్వరూపము నందు నిలిచియుండును. అట్టి కైవల్యావస్థయే ముక్తియని చెప్పబడును.

ఘటము (కుండ) తయారైన వెంటనే, ఘటాకాశము (కుండలో ఆకాశము)ను కల్గియుండును. ఘటము పగిలిపోయిన వెంటనే, అందులోని ఆకాశము నష్టముకాదు. ఘటాకాశము మహాకాశముయొక్క స్వరూపములో స్థితమైయుండును. అట్లే, ముక్త్యాత్మయు, తన స్వరూపమును పొందును. అనగా జీవాత్మ ముక్తిని పొందినప్పుడు, తన స్వరూపమునందే స్థితమైయుండును.



ప్రతీంద్రియం దశ దశ - నిర్గతా విషయోన్ముఖాః ।
నాద్యః కర్మాది హేతూత్థాః - స్వప్నాదిఫల భుక్తయే ॥ **31**

వహన్త్యంభో యథా నద్యో - నాడ్యః కర్మఫలం తథా ।
అనంతైకోర్ధ్వగా నాడీ మూర్ధపర్యంత మంజసా ॥ **32**

సుషుమ్నేతి సమాదిష్టా - తయా గచ్ఛ న్విముచ్యతే ।
తత్రావస్థిత చైతన్యం - జీవాత్మానం విదుర్బుధాః॥ **33**

యథా రాహు రదృశ్యోఽపి - దృశ్యతే చంద్రమండలే ।
తద్వ త్సర్వగతోఽఽప్యాత్మా - లింగదేహే హి దృశ్యతే ॥ **34**

దృశ్యమానే యథాకుంబే ఘటాకాశోపి దృశ్యతే ।
తద్వ త్సర్వగతోఽప్యాత్మా - లింగదేహే పి దృశ్యతే॥ **35**

నియమానే యథా కుంబే - ఘటాకాశోపి నీయతే ।
తద్వత్ సర్వగతోఽప్యాత్మా -లింగదేహే వినిర్గతే ॥ **36**

నిశ్చలః పరిపూర్ణోఽపి - గచ్ఛతీ త్యుపచర్యతే ।
జాగ్రత్కాలే తథా జ్ఞేయ - మభివ్యక్త విశేషధీః॥
వ్యాప్నోతి నిష్క్రియ స్సర్వాన్ - భాను ర్దశ దిశో యథా ॥। **37**

నాడీభిర్వృత్తయో యాన్తి - లింగదేహ సముద్భవాః।
తత్త త్కర్మానుసారేణ - జాగ్ర ద్భోగోపలబ్ధయే ॥ **38**

జాగ్రదవస్థలో కర్మక్షయమైన తరువాత, స్వప్న సంబంధమగు ఫలము ప్రాప్తించును. పిమ్మట జ్ఞానావస్థను కప్పి స్వప్నావస్థను పొందును. ఆ సమయము నందు దేహేంద్రియాదులలో ఆత్మ చైతన్యముయొక్క సంబంధము నిలిచిపోవును. జాగ్రదవస్థ కర్మవలన మనస్సునందు పూర్వ సంస్కారములను కల్గియుండును.

జీవుడు స్వప్నమునందు ఫలానుభవేచ్ఛచే, తన మాయవలన తానే మాయావంతుడగును. ఇంద్రజాలికునివలె అవస్థాంతరములను ఆశ్రయించును.

స్వప్నములో జీవుడు పూర్వకర్మవాసనలచే ఘటాది విషయములను, జడపదార్థములను, సకల భూతములను బుద్ధ్యాది అంతఃకరణ రూపములో చూచుచుండును. స్వయంజ్యోతి స్వరూపమైన ఆత్మచైతన్యమునకు, జీవుడు సాక్షీభూతుడై యుండును.

ఈ స్వప్నమునందు అనుభవింపబడు అంతఃకరణము, ఇంద్రియములు శరీరములు మున్నగునవి వాసనారూపములు, వాటిచే చేయబడు వ్యవహారములు మున్నగునవి సంస్కారములు. అట్టి సంస్కారముల వలన, జీవుడు వాసనాత్మకుడగును. పరమాత్మ అట్టి వాసనలకు కేవలము సాక్షియగును.

స్వప్నావస్థలో వాసనాప్రపంచము కనబడుచుండును. అది కర్మప్రేరితమైనది జాగ్రదవస్థలోవలె కర్త, కర్మ, క్రియ అను త్రిపుటితో కూడియున్నది.

సమస్త బుద్ధి వృత్తులకు సాక్షియగు ఆత్మ స్వయముగా ప్రకాశించును; అది వాసనా మాత్రమునకు సాక్షియగుటచే స్వాపమనబడును. స్వాపమనగా తనకుతానే పూర్తిగా పొందడం.

శైశవము (బాల్యము) నందు గత జన్మ వాసనలు అంటియుండును. వాటిని స్వప్నమునందు అనుభవించుచుండును.

మధ్యవయస్సు (యవ్వనము) నందు ఈ జన్మలో చేసిన కర్మవాసనలను స్వప్నమునందు అనుభవించుచుండును.

మరణావస్థకు ముందు పరలోక యాత్రకు సంసిద్ధుడైన జీవుడు. సంచిత కర్మ, ఉపాసనాబలముచేత, రాబోవు జన్మ సంబంధమైన రూపమును స్వప్నమునందు అనుభవించుచుండును.

ఆకాశములో చాలాదూరము ఎగిరి అలసిన డేగ విశ్రమించుటకు రెక్కలను ముడుచుకొని తన గూటిలోనికి ప్రవేశించును. అట్లే జాగ్రదావస్థ స్వప్నావస్థలలో విషయములను అనుభవించిన జీవుడు, ఇంద్రియాదులను తనలో సంస్కార రూపమున అణచుకొనును. కారణ దేహములో విలీన మగును. అనగా జీవుడు ఈశ్వరునిలో ఐక్యమునకు పొందుచుండును.



ఇదం లింగశరీరాఖ్య - మామోక్షం న వినశ్యతి।
ఆత్మజ్ఞానేన నష్టేఽస్మిన్ - స్సావిద్యే స్వశరీరకే ॥ 39

ఆత్మ స్వరూపావస్థానం - ముక్తిరిత్య భీధీయతే ॥ 40

ఉత్పాదితే ఘటే యుద్వ - ద్ఘటాకాశత్వ మృచ్ఛతి।
ఘటే నష్టే యథాకాశం - స్వరూపేణావ తిష్ఠతే ॥ 41

జాగ్రత్కర్మ క్షయవశా - త్స్వప్నభోగ ఉపస్థితే ।
బోధ్యావస్థాం తిరోధాయ - దేహాద్యాశ్రయ లక్షణామ్ ॥ 42

కర్మోద్భావిత సంస్కారః-తత్ర స్వప్నరిరంసయా ।
అవశ్చాం చ ప్రయాత్యన్యాం-మాయావీ వాత్మమాయయా॥ 43

ఘటాదివిషయా స్సర్వాన్ బుద్ధ్యాదికరణాని చ ।
భూతాని కర్మవశతో - వాసనామాత్ర సంస్థితాన్ ॥ 44

ఏతా న్పశ్యన్ స్వయంజ్యోతి - స్సాక్ష్యాత్మా వ్యవతిష్ఠతే ।
అత్రాంతః కరణాదీనాం - వాసనా ద్వాసనాత్మతా ॥ 45

వాసనామాత్ర సాక్షిత్వం - తేన తత్ర పరాత్మనః।
వాసనాభిః ప్రపంచోఽత్ర - దృశ్యతే కర్మచోదితః॥ 46

జాగ్రద్భూమౌ యథా తద్వ - త్కర్తృ కర్మ క్రియాత్మకః।
నిశ్శేషబుద్ధి సాక్ష్యాత్మా స్వయమేవ ప్రకాశతే ॥ 47

వాసనామాత్ర సాక్షిత్వం సాక్షిణ స్స్వాప ఉచ్యతే ।
భూతజన్మని యద్భూతం - కర్మ తద్వాసనావశాత్ ॥
నేదీయస్త్వా ద్వయస్యాద్యే - స్వప్నం ప్రాయః ప్రపశ్యతి॥। 48

మధ్యే వయసి కార్కశ్యా - త్కరణానా మిహార్జితః।
ప్రాయేణ వీక్షతే స్వప్నం - వాసనాకర్మ ణోర్వశాత్ ॥ 49

జీవుడు నాడీమార్గముద్వారా ఇంద్రియములయొక్క సూక్ష్మవాసనలను ఆకర్షించి, సర్వకార్యములను తనలోఇముచ్చుకొనును పిమ్మట, అవ్యాకృత మగు ఈశ్వర చైతన్యము నందు విలీనమగుచుండును. అప్పుడు జీవునకు కేవలము ఆనందమేకలుగును. ఈ ప్రపంచమంతయు స్వరూపసత్తుగా లీనమై యుండును.

కాముకులైన స్త్రీ పురుషులు సంభోగ సమయమునందు శరీరక సౌఖ్య ముచే బాహ్య విషయములను స్మరింపక, ఆనందమయులై యుందురు. అట్లే, విజ్ఞానాత్మయగు జీవుడు సుషుప్త్యవస్థలో ప్రాజ్ఞాత్మత్వమును పొంది, ఆనంద మును అనుభవించును. అందువలన జీవుడు కారణాత్మ (ఈశ్వర స్వరూపుడు) అని చెప్పబడును.

ఈ సుషుప్త్యవస్థలో జీవుడు సూక్ష్మమైన అవిద్యా వృత్తిచే సుఖాను భూతిని పొందును. అందుచేతనే స్వప్నము నుండి మేల్కొనిన పిమ్మట, నేనింత వరకు సుఖముగా నిద్రించితిని. బాహ్య ప్రపంచము నేనెరుగను! అని, జీవుడు భావిం చును.

ఇహపరలోకములయందు జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థలు మూడు మారి మారి వచ్చుచుండును.

జీవుడు మేల్కొనిన వెంటనే, మనోబుద్ధ్యాది ఇంద్రియములు అగ్ని నుండి మిణుగురులవలె, కారణాత్మనుండి బయలుదేరును. అవి యధాపూర్వ ముగా సంక్రమించుచుండును.

నీటితో నింపబడిన కుండను జలాశయములో ముంచి, అట్టి నీటి నుండి కుండనుపైకి తీసినట్లు, జీవుడు కారణాత్మనుండి స్వశరీరమునకు వచ్చును.

విజ్ఞానాత్మ స్వరూపియగు కారణాత్మ (ఈశ్వర స్వరూపుడు) సద్వస్తువుల యందు కనుపించును. అవి, నష్టమైనప్పుడు కనుపించకుండును. అనగా అటువంటప్పుడు జీవుడు ఈశ్వరునిలో ఐక్యమగును.

ఒక్క ఆకారము కల్గిన సూర్యుడు జలము, అద్దము మున్నగు భిన్నమైన ఉపాధులయందు వేర్వేరుగా కనుపించును. అట్లే ఈశ్వరుడు నిరాకారు డైనను సాకారునివలె వచ్చుచు, పోవుచున్నట్లు తోచుచుండును.

ఆత్మ చైతన్య స్వభావమున స్వయంజ్యోతి! అది స్థూల, సూక్ష్మ, కారణరూప మైన దేహములకంటే అతీతమైనది. అయినప్పటికీ, జీవునకు మోహ (భ్రమ) రూపమైన ప్రతిబంధకముచేత, తన స్వరూప స్థితి తెలియడం లేదు. అందువలన అంతయు వాటియందున్నట్లుగా తోచుచుండును. ఓదశరథాత్మజా! నీకు జీవుని స్వరూపమును విశదీకరించితిని" అని శంకర భగవానుడు రామచంద్రునకు వివరించెను.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణాంతర్గతంబైన శివగీతయందు జీవస్వరూప నిరూపణ యోగము అను దశమ అధ్యాయం సమాప్తము.



యియాసుః పరలోకం తు - కర్మవిద్యాది సంభృతమ్ ।
భావినో జన్మనో రూపం - స్వప్న ఆత్మా ప్రపశ్యతి ॥ 50

యద్వత్ర్పతానా చ్ఛ్యేనః - శ్ర్శాంతో గగనమండలే ।
ఆకుంచ్య పక్షౌ యతతే - నీడే నిశ్ళయనాయనీః ॥ 51

ఏవం జాగ్రత్స్వప్న భూమౌ - శాంత ఆత్మాఽభిసంచరన్ ।
ఆపీత కరణగ్రామః - కారణేనైతి చైకతామ్ ॥ 52

నాడీమార్గై రింద్రియాణా - మాకృష్యాదాయ వాసనాః।
సర్వం గ్రసిత్వా కార్యంచ - విజ్ఞానాత్మ విలీయతే ॥ 53

ఈశ్వరాఖ్యే ఽవ్యాకృ తేఽథ - యథా సుఖమయోభవేత్ ।
కృత్స్న ప్రపంచవిలయ - స్తథా భవతి చాత్మనః॥ 54

యోషితః కామ్యమానాయాః - సంభోగాంతే యథా సుఖమ్ ।
స ఆనందమయో బాహ్యో - నాఽఽన్తరః కేవలం స్తథా ॥ 55

ప్రాజ్ఞాత్మానాం సమాసాద్య-విజ్ఞానాత్మా తథైవ సః।
విజ్ఞానాత్మా కారణాత్మా యథా తిష్ఠఽన్నథాఽపి సః॥ 56

అవిద్యా సూక్ష్మవృత్తాను - భవత్యేవ యథాసుఖమ్ ।
అజ్ఞానమపి సాక్ష్యాది-వృత్తిభి శ్చానుభూయతే ॥ 57

తథాహం సుఖ మస్వాప్సం - నైవ కించి దవేదిషమ్ ।
ఇత్యేవం ప్రత్యభిజ్ఞాపి - పశ్చాత్తస్యోపపద్యతే ॥ 58

జాగ్రత్స్వప్న సుషుప్త్యాఖ్య - మేవే హా ఽముత్రలోకయోః।
పశ్చాత్కర్మవసాదేవ - విస్ఫులింగా ఇవాఽనలాత్ ॥ 59

జాయన్తే కారణాదేవ - మనోబుద్ధ్యాదికాని తు । 60
పయః పూర్ణ ఘటో యద్వ - న్నిమగ్న స్సలిలాశయే ।
తైరేవోద్ధృత ఆయాతి విజ్ఞానాత్మ తద్వైత్యజాత్ ॥ 61

విజ్ఞానాత్మా కారణాత్మా - తథా తిష్ఠం స్తథాపి సః।
దృశ్యతే సర్వమేష్టేవ - నష్టేష్వా యాత్యదృశ్యతామ్ ॥ 62

ఏకాకారోఽర్యమా తత్త - త్కార్యేష్వివ పరః పుమాన్ ।
కూటస్థో దృశ్యతే తద్వ - ద్గచ్ఛత్యా గచ్ఛతీవ సః॥ 63

మోహ మాత్రాంతరాయత్వా - త్సర్వం తస్యోపపద్యతే ।
దేహాద్య తీతే ఆత్మాపి - స్వయంజ్యోతిః స్స్వభావతః ॥ 64

ఏవం జీవస్వరూపంతే - ప్రోక్తం దశరథాత్మజః॥ 65

ఓం తత్సదితి శ్రీ పద్మపురాణే ఉపరిభాగే శివగీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయం యోగశాస్త్రే శ్రీ శివరాఘవ సంవాదే జీవస్వరూప నిరూపణ యోగోనామ దశమోధ్యాయః

## 11వ అధ్యాయము భావము

"రామా! నీకు దేహాంతర గతిని గూర్చి, పరలోక గతిని గూర్చి చెప్పెదను నృపశార్దూలా ! నీవు సావధానుడవై వినుము అంటూ శంకర భగవానుడు విశదీకరించుచుండెను.

భుజించిన ఆహార పదార్థములు, త్రాగిన పానీయములు పక్వము లగును. వాటి రసముచే స్థూల దేహము, లింగ దేహములకు జీవనము (ప్రాణశక్తి) కలుగుచున్నది.

రోగముచేగాని, ముసలితనముచేగాని, జఠరాగ్నిమందమై శ్లేష్మయుక్తమై తినిన అన్నము (భుక్తము)గాని, త్రాగిననీరు (పీతము)గాని, పచనము కాదు. అనగా జీర్ణముకాదు.

భుక్త పీతములు పచనము కాకపోవడంతో వాటి రసము కూడా లేక పోవును అట్టి రసాభావముచే దేహము నందలి ధాతులు శుష్కించును. ఆహారము, పానముల యొక్క రసము వలననే ధాతువులు (నాడులు) వృద్ధి పొందుచున్నవి.

వాయువు దేహము నందలి ధాతువులు మున్నగువాటికి సమానముగా రససంచారము చేయును. కావున, సమాన వాయువని చెప్పబడును. రసాభావము వలన స్థూల లింగ దేహ సంబంధమునకు హాని కలుగును.

పరిపక్వమైన గుమ్మడి పండు మున్నగునవి భారము వలన స్వయముగా తీగ నుండి పడిపోవును. అట్లే స్థూల దేహము నుండి లింగ దేహము వీడి పోవును.

ఆ సమయమునందు యింద్రియముల యొక్క వాసనలను కలిగి యుండును. ఆధ్యాత్మికాధి భూతములు మున్నగునవి. ఆయా స్థానముల నుండి ఆకర్షింపబడి హృదయ పద్మమునందు ఏకమగును.

తర్వాత, ప్రాణవాయువు కలిగిన తొమ్మిది వాయువులతో కూడి, వానితో కలిసి ఊర్ధ్వోచ్ఛ్వాస్వసము (పైకి శ్వాస)తో వెడలు చుండును. అట్టి సమయము నందు జీవి ప్రాణవాయువుతో ఏకత్వ మగును.



# శ్రీ శివగీతా



## అథ ఏకాదశోఽ ధ్యాయః
## జీవగతి నిరూపణ యోగః

శ్రీ భగవాన్ ఉవాచ

దేహాంతరగతిం తస్య - పరలోక గతిం తథా ।
వక్ష్యామి నృపశార్దూల - మత్త శ్శృణు సమాహితః॥ 1

భుక్తం పీతం యతస్త్వత్ర - తద్రసాదామ బంధనమ్ ।
స్థూలదేహస్య లింగస్య - తేన జీవనధారణమ్ ॥ 2

వ్యాధినా జరయా వాపి - పీడ్యతే జాఠరోఽనలః ।
శ్లేష్మణా తేన భుక్తాన్నం - పీతం వా న పచత్యలమ్ ॥ 3

భుక్త పీతరసాభావాత్ - త్తదా శుష్యంతి ధాతవః
భుక్త పీత రసేనైవ - దేహే లింపంతి నిత్యశః॥ 4

సమీకరోతి యత్తస్మా - త్సమానో వాయు రుచ్యతే ।
తదానీం తద్రసాభావా - దామబంధన హానితః॥ 5

పరిపక్వరస త్వేన - యథా గౌరవ తః ఫలమ్ ।
స్వయమేవ పతత్యాశు - తథా లింగం తనో ర్వ్రజేత్ ॥ 6

తత్తత్ స్థా నాదపాకృష్య - హృషీకాణాం చ వాసనాః
ఆధ్యాత్మికాధిభూతాని - హృత్పద్మే చైకతాం గతః॥ 7

తదోర్ధ్వగః ప్రాణవాయు - స్సంయుక్తో నవవాయుభిః
ఊర్ధ్వోచ్ఛ్వాసీ భవత్యేష - తథా తేనైకతాం గతః॥ 8

విద్యాకర్మ, (ఉపాసన, కర్మఫలము) లతో కూడిన జీవుడు, పూర్వ ప్రజ్ఞానుసారములయిన అనుభవములచే ప్రజ్ఞానాత్మ ప్రేరితుడగును అనగా కారణదేహములోని ఈశ్వర చైతన్యముయొక్క ప్రేరణ కలుగును. అప్పుడు నాడీ (మార్గమును ఆశ్రయించి నేత్రనాడులు (కన్నులు) నుండిగాని, శిరో నాడి సహస్రారము) నుండిగాని, విజ్ఞానుడు (జీవుడు) స్థూల దేహమునుండి బయటకు వెడలును.

ఘటమును దేశ దేశాంతరములకు తీసుకొని పోవుచున్నప్పుడు అద్దానితోపాటు అంతటా నిండియున్న ఆకాశమును కూడ తీసుకొనిపోవుచున్నట్లు ప్రతీతమగును. అట్లే పరమాత్మ స్వరూపమయిన జీవచైతన్యము లింగ దేహముతో ఆయాస్థానములకు వెళ్ళుచున్నట్లు కనుపించును.

జీవి మరల పూర్వ కర్మానుసారము, ఒకదేహము నుండి మరొక దేహమును పొందుచుండును. మోక్షమును పొందునంత వరకు, సంసార ప్రవాహములో జనన మరణములను రెండు ఒడ్డుల మధ్య మత్స్యము (చేప)వలె సంచరించుచుండును.

పాప కర్మల యొక్క భోగమును అనుభవించుటకు యాతనా దేహమును ఆశ్రయించును. యమదూతలచే నరకలోకమునకు వెడలును. యజ్ఞయాగాదులు నిర్వహించటం, తటాకారామారులను కట్టించటం మొదలైనవి ఇష్టాపూర్తాదికర్మలు వాటిని ఆచరించిన జీవుడు శ్రౌత స్మార్తాద్యగ్నివల్ల ధూమ మార్గమును ఆశ్రయించును. తద్వారా పితృలోకమునకు వెడలును.

ఇష్టాపూర్తాదికర్మలను ఆచరించిన జీవుడు ధూమము, రాత్రి, కృష్ణ పక్షము, దక్షిణాయనము మున్నగు మార్గముల నుండి పితృలోకమునకు చేరును. అచ్చట నుండి చంద్రలోకమునకు వెడలును.

చంద్రలోకమునందు దివ్యదేహమును దాల్చును. భోగభాగ్యములను అనుభవించును. జీవుడక్కడ పుణ్య కర్మఫలము ఉన్నంత వరకు వుండును. కర్మశేషముకాగానే, అదేమార్గము నుండి నరలోకమునకు తిరిగి వచ్చును.

జీవి, చంద్రలోకమునందలి దివ్యదేహమును విడిచి, ఆకాశత్వమును పొందును. తర్వాత ఆకాశత్వము నుండి వాయుత్వమును, వాయుత్వము నుండి జలత్వమును క్రమముగా పొందును. పిమ్మట, జలత్వము నుండి మేఘమును పొంది, వర్షమై కురియును. తద్వారా భక్ష్య పదార్థములయిన ధాన్యాదిరూపము దాల్చును.



**చక్షుషోర్వాపి మూర్ధ్న్వా - నాడీమార్గం సమాశ్రితః ।**
**విద్యాకర్మ సమాయుక్తో - వాసనాభిశ్చ సంయుతః॥ 9**

**ప్రజ్ఞాత్మానం సమాశ్రిత్య - విజ్ఞానా త్మోపసర్పతి । 10**

**యథా కుంభో నీయమానో - దేశా ద్దేశాంతరం ప్రతి ।**
**ఖపూర్ణ ఏవ సర్వత్ర - స ఆకాశోఽ పి తత్ర తు ॥**
**ఘటాకాశాఖ్య కాం యాతి - తద్వ ల్లింగం పరాత్మనః ॥। 11**

**పునర్దేహాంతరం యాతి - యథా కర్మానుసారతః ।**
**ఆ మోక్షాన్ సంచర త్యేవం - మత్స్యః కూలద్వయం యథా ॥ 12**

**పాపభోగాయ చేద్గచ్ఛే - ద్యమదూతై రధిష్ఠితః।**
**యాతనాదేహ మాశ్రిత్య - నరకానేవ కేవలమ్ ॥ 13**

**ఇష్టాపూర్తాని కర్మాణి - యోఽనుతిష్ఠతి సర్వదా ।**
**పితృలోకం ప్రియాత్యేష - ధూమమాశ్రిత్య బర్హిషః॥ 14**

**ధూమాద్రాత్రిం తతః కృష్ణ - పక్షం తస్మాచ్చ దక్షిణమ్ ।**
**అయనం చ తతో లోకం - పితౄణాం చ తతః పరమ్ ॥ 15**

**చంద్రలోకే దివ్యదేహం - ప్రాప్య భుంక్తే పరాంశ్రియమ్ ।**
**తత్ర చంద్రమసా సోఽసౌ - యావత్కర్మఫలం వసేత్ ॥ 16**

**తథైవ కర్మశేషేణ - యథా తం పునరావ్రజేత్ ।**
**వపుర్విహాయ జీవత్వ - మాసా ద్యాకాశమేతి సః॥ 17**

**ఆకాశా ద్వాయు మాగత్య - వాయోరంభో వ్రజత్యథ ।**
**అద్భ్యో మేఘం సమాసాద్య - తతో వృష్టి ర్భవే దసౌ ॥ 18**

**తతో ధాన్యాని భక్ష్యాణి - జాయతే కర్మచోదితః।**
**యోని మన్యే ప్రపద్యంతే - శరీరత్వాయ దేహినః॥**
**ముక్తి మన్యేఽనుసంయంతి - యథాకర్మ యథాశ్రుతమ్ ॥। 19**

కర్మప్రేరితుడై జీవి జన్మించును. కొన్ని జీవులు మనుష్యాదియోనులను, మరికొన్ని జీవులు స్థావరాది రూపములను కర్మానుసారముగా పొందుచున్నారు.

అప్పుడు, అన్నము రూపములో ఉండి, తల్లిదండ్రులచే భుజింపబడును. పిమ్మట స్త్రీ పురుషుల యందు శోణితము (రజస్సు) శుక్రము (వీర్యము)ల రూపమును జీవి దాల్చును. శుక్రశోణితముల సంయోగము వలన గర్భధారణ జరుగును.

జీవి తన కర్మానుసారముగా స్త్రీగాను, పురుషుడుగాను, నపుంసకుడుగాను జన్మించును. అని శంకర భగవానుడు రామచంద్రుడునకు వివరించెను.

ఎవరు శాంతి, దాంతి...మున్నగు సద్గుణములను కల్గియుండి; ఎల్లప్పుడు విద్యాసక్తుడగునో (ఉపాసనారతుడగునో) అట్టి నరుడు దేవయాన మార్గమున బ్రహ్మలోకమునకు వెడలును.



జీవుడు దేహమును చాలించిన పిమ్మట, తేజో రూపమున దివ్య పురుషుడగును. (ఇంక దేవయాన మార్గము వివరింపబడుచున్నది) ప్రప్రథమముగా అర్చిలోకమునకు వెడలును. తర్వాత దినాభిమానమైన దేవలోకమునకు శుక్లపక్షాభిమానమైన దేవలోకమునకు, ఉత్తరాభిమానమైన దేవలోకమునకు జీవుడు వెడులును.

దేవలోకము నుండి ఆదిత్య లోకమును చంద్రలోకమును విద్యుశ్లోకమును చేరును. అక్కడకు ఒకానొక దివ్యపురుషుడు బ్రహ్మలోకము నుండి దిగి వచ్చును. ఆ దివ్యపురుషుడు దివ్యదేహమున జీవున్ని సంధించును. (అనగా దివ్య దేహములోనికి జీవున్ని ప్రవేశింప చేయును) తర్వాత, బ్రహ్మలోకమునకు తీసుకొని పోవును.

బ్రహ్మలోకమునందు, జీవుడు దివ్యదేహమున భోగములను అనుభవించును. అచ్చట చిరకాలమునుండి, బ్రహ్మతోపాటు ముక్తిని పొందును.

కేవలము బ్రహ్మమునందు రమించు జీవుడు; నిర్వికారుడై యుండును. అట్టి జ్ఞానియొక్క ప్రాణము లవణ జలము (ఉప్పునీరు) నందు విలీనమైనసైంధవలవణము (ఉప్పుగడ్డ వలె) తనయందే విలీనమగును. దీనినే "కైవల్య ముక్తి" అంటారు.



**తతో౽న్నత్వం సమాసాద్య - పితృభ్యాం భుజ్యతే పరమ్ ।**
**తత శ్శుక్లం రజశ్చైవ - భూత్వా గర్భో౽భిజాయతే ॥ 20**

**తతః కర్మానుసారేణ - భవేత్ స్త్రీ పుం నపుంసకమ్ ।**
**ఏవం జీవగతిః ప్రోక్తా - ముక్తి తస్య వదామి తే ॥ 21**

**యస్తు శాంత్యాదియుక్తస్సన్ - సదా విద్యారతో భవేత్ ।**
**స యాతి దేవయానేన - బ్రహ్మలోకావధిం నరః॥ 22**

**అర్చి ర్భూత్వా దినం ప్రాప్య - శుక్లపక్ష మథో వ్రజేత్ ।**
**ఉత్తరాయణ మాసాద్య - సంవత్సర మథో వ్రజేత్॥ 23**

**ఆదిత్య చంద్రలోకౌ తు - విద్యుల్లోక మతఃపరమ్ ।**
**అథ దివ్యః పుమాన్కశ్చిత్ - బ్రహ్మలోకాది హైతి సః॥ 24**

**దివ్యే వపుషి సంధాయ - జీవ మేవం నయ త్యసౌ।**
**బ్రహ్మలోకే దివ్యదేహే - భుక్త్వా భోగా న్యథేప్సితాన్ ॥ 25**

**తత్రోషిత్వా చిరం కాలం - బ్రహ్మణా సహ ముచ్యతే ।**
**విధాకర్మవిహీనో౽యం తృతీయంస్థానమేతి ॥ 26**

**శుద్ధబ్రహ్మ రతోయస్తు - న స యాత్యేవ కుత్రచిత్ ।**
**తస్య ప్రాణా విలీయంతే - జలే సైంధవ ఖిల్యవత్ ॥**

స్వప్నములో చూచిన ప్రపంచము-మేల్కొనిన వానికి తిరోహిత మగును. అట్లే, బ్రహ్మజ్ఞానము కల్గినవానికి, పూర్వము అనుభవించిన సంస్కారములన్నియు తొలగిపోవును.

శాస్త్రవిహితమైన యజ్ఞయాగాది కర్మలు, ఉపాసనలు చేయని భోగ లాలసులే విద్యాకర్మ విహీనులు! అట్టివారికి తృతీయ స్థానమగు నరకము లభ్యమగును. అచ్చట మహాభయంకరమైన రౌరవాది మహానరకయాతన లను జీవుడు అనుభవించును.

పూర్వ కర్మశేషముచే జీవుడు క్షుద్ర జంతువుగా పుట్టును. పేను, దోమ, ఈగ...మున్నగు నీచయోనులలో భువిని జన్మించును. 'ఓ రామా! నీకు జీవునిగతినిగూర్చి, జీవునిముక్తిని గూర్చి సవివరముగ చెప్పితిని. ఇంకేమైనా, సంశయములున్నచో అడుగుము" అని, శంకర భగవానుడు అనగా; రామచంద్రుడు.

"భగవాన్ ! ప్రభో ! జ్ఞాన కర్మలయొక్క ఫలముగా బ్రహ్మలోకము, చంద్రలోకముల యందు జీవుడు భోగములను అనుభవించునని వచించి తిరి. గంధార్వాది లోకముల యందు ఏవిధముగా భోగములు లభించును. దేవత్వము, ఇంద్రత్వము....మున్నగునవి కర్మఫలమా ? విద్యా ఫలమా? "ఓ గిరిజాకాంతా! నాదు సంశయములను నివారించండి" అని రామ చంద్రుడు అడిగిన వాటికి, శంకర భగవానుడు చెప్పుచుండెను.

"ఓ రామా! విద్యాకర్మలను అనుసరించే ఫలములు కలగును. యువ కుడు ఆరోగ్యవంతుడు బలవంతుడునగు మనుష్యునకు సప్త ద్వీపములను నిష్కంటముగా పరిపాలించిన, ఎట్టి ఆనందము కలుగునో; అది మానుషా నందమని చెప్పబడును.

మనుష్యుడు తపస్సుచేసి గంధర్వుడగును. గంధర్వునకు మనుష్యుని కన్న శత గుణమగు (వందరెట్లు) కలుగును.

గంధర్వుని కంటే శతగుణమగు ఆనందము దేవ గంధర్వులకు కలు గును ఇందులో సంశయములేదు. ఈ విధముగా ఉత్తరోత్తరముగా (క్రమ క్రమముగా) ఒకరికంటే మరొకరికి శతగుణమగు ఆనందము అధికముగా కలుగును.



స్వప్న దృష్టా యథా సృష్టిః - ప్రబుద్ధస్య విలీయతే !
బ్రహ్మజ్ఞాన వతస్తద్వ - ద్విలీయంతే తథైవతే ॥
విద్యాకర్మ విహీనో య - స్తృతీయం స్థానమేతి సః।
భుక్త్వా చ నరకాన్ఘోరాన్ - మహారౌరవ రౌరవాన్ ॥
పశ్చా త్ప్రాక్తన షేణ - క్షుద్ర జంతు ర్భవే దసౌ । 27
యూకా మశకదంశాది - జన్మాఽసౌ లభతే భువి ।
ఏవం జీవగతిః ప్రోక్తా కిమన్య చ్ఛ్రోతు మిచ్ఛసి ॥ 28

శ్రీరామ ఉవాచ

భగవన్ ! యత్త్వయా ప్రోక్తం ఫలం తు జ్ఞానకర్మణోః
బ్రహ్మలోకే చంద్రలోకే - భుంక్తే భోగానితి ప్రభో ! 29
గంధర్వాదిషు లోకేషు - కథం భోగ స్సమీరితః।
దేవత్వం ప్రాప్నుయాత్కశ్చిత్ - కశ్చి దింద్రత్వ మేవ చ ॥ 30
ఏతత్కర్మఫలం వాఽస్తు - విద్యాఫల మథాపి వా ।
తద్బ్రూహి గిరిజాకాంత - తత్ర మే సంశయో మహాన్ ! 31

శ్రీ భగవాన్ ఉవాచ

తద్విద్యా కర్మణో రేవా ఽనుసారేణ ఫలం భవేత్ ।
యువా చ సుందర శ్శూరో నీరోగో బలవాన్భవేత్ ॥ 32
సప్తద్వీపాం వసుమతీం - భుంక్తే నిష్కంటకం యది।
స ప్రోక్తో మానుషానంద - స్తస్మా చ్ఛతగుణో మతః॥ 33
మనుష్య స్తపసా యుక్తో గంధర్వో జాయతేఽ స్యతు।
తస్మాచ్ఛతగునో దేవ - గంధర్వాణాం న సంశయః॥ 34
ఏవం శతగుణానంద - ఉత్త రోత్తరతో భవేత్ ।
పితౄణాం చిరలోకానా - మాజాన సురసంపదామ్ ॥ 35
దేవతానా మథేంద్రస్య గురో స్తద్వత్ప్రజాపతే ।
బ్రహ్మణశ్చైవ మానందః - పురస్తా దుత్తరోత్తరమ్ ॥ 36
జ్ఞానాధిక్యా త్సుఖాధిక్యం - నాఽ న్య దస్తి సురాలయే ।
శ్రోత్రియోఽవృజినోఽకామ హతో యస్తు ద్విజో భవేత్ ॥ 37

చిరలోక వాసులగు పితృదేవతలు ఆజ్ఞాన దేవతలు దేవతలు దేవతలకు రాజగు ఇంద్రుడు దేవతలకు గురువైన బృహస్పతి ప్రజాపతియైన బ్రహ్మ దేవుడు...మున్నగువారికి వరుసగా శతగుణమగు ఆనందము అధికముగా కలుగును.

జీవునకు జ్ఞానాధిక్యము వలన దేవలోకములో సుఖాధిక్యము కల్గును. నిష్కామ కర్మలు చేసిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో, బ్రహ్మజ్ఞానం కల్గిన జ్ఞాని కామమును జయించును. పాపము నుండి విడివడును అట్టి వానికి ఉత్తరోత్తరముగా ఆనందము కలుగును.

ఓ దశరధనందనా ! ఆత్మజ్ఞానము కంటే ఉత్తమమైనది మరియొకటి లేదు. బ్రహ్మజ్ఞాని కర్మలచే వృద్ధి క్షీణదశలు (లాభనష్టములు) పొందడు. అతడు కర్మలచే పాతకుడైనప్పటికీ, జ్ఞానముచే వాటికి దూరముగా నుండును.

అందువలన బ్రహ్మజ్ఞానియగు విప్రుడు, జ్ఞానమును కల్గియుండుట వలన సర్వాధికుడు అందరిలో శ్రేష్ఠుడుగా నుండును. ఎవరు తెలిసి సత్కర్మ లను చేయునో, వారు అక్షయమగు ఫలమును పొందును.

మనుష్యుడు–కోటి బ్రాహ్మణులకు భోజనము పెట్టినందు వలన ఎట్టి పుణ్యఫలమును పొందునో బ్రహ్మజ్ఞానికి భోజనము పెట్టినందు వలన పొందును.

బ్రహ్మజ్ఞానియగు ద్విజున్ని ద్వేషించిన నరాధములు క్షయరోగ పీడితులై, మృతి చెందెదరు ఎందువలననగా, బ్రహ్మజ్ఞాని పరమేశ్వర స్వరూపుడని చెప్పబడును.

ఈశ్వరోపాసకులు అధోగతిని పొందరు. కావున, రామా! నీవు ఉపాసన చేసి, సుఖమును పొందుము అని, శంకర భగవానుడు రామచంద్రుని ఆశీర్వదించెను.

ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణమునందలి యోగశాస్త్రము, బ్రహ్మవిద్యా శ్రీ శివరాఘవ సంవాదరూపములగు శ్రీశివగీతా ఉపనిషత్తునందలి జీవగతి నిరూపణ యోగమను పదకొండవ అధ్యాయం సంపూర్ణము.



తస్యా ప్యేవం సమాఖ్యాతా – ఆనందా శ్చోత్తరోత్తరమ్ ॥ **38**

ఆత్మ జ్ఞానాత్పరంనాస్తి – తస్మాత్ ద్దశరాథాత్మజ ।
బ్రాహ్మణః కర్మభిర్నైవ – వర్ధతే నైవ హీయతే ॥ **39**

న లిప్యతే పాతకేన – కర్మణా జ్ఞానవాన్యది ।
తస్మా త్సర్వాధికో విప్రో – జ్ఞానవానేవ జాయతే ॥ **40**

జ్ఞాత్వా యః కురుతే కర్మ – తస్యాఽక్షయ్యఫలం భవేత్ । **41**

యత్ఫలం లభతే మర్త్యః – కోటి బ్రాహ్మణ భోజనైః
తత్ఫలం సమవాప్నోతి – జ్ఞానినం యస్తు భోజయేత్ ॥ **42**

జ్ఞానవంతం ద్విజం యస్తు – ద్విష్యతే చ నరాధమః
స శుష్యమాణో మ్రియతే – యస్మా దీశ్వర ఏవ సః॥ **43**

ఉపాసకో న యాత్యేవ – యస్మాత్పున రధోగతిమ్ ।
ఉపాసనరతో భూత్వా – తస్మాదా స్స్వ సుఖీభవ ॥ **44**

ఓం తత్సదితి శ్రీపద్మపురాణే శివగీతా సూఽపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీశివ రాఘవ సంవాదే జీవగతి నిరూపణ యోగోనామ ఏకాదశోధ్యాయః

## 12వ అధ్యాయము భావము

"భగవాన్ ! దేవా ! దేవేశా! మీకు నమస్కారము. మహేశ్వరా ! నాకు ఉపాసనా విధినిగూర్చి చెప్పండి మీరు నాయందు అనుగ్రహముతో ఉపాస నకు దేశకాలములను, తదంగములను వివరించండి. అని రామచంద్రుడు ప్రశ్నించగా; శంకర భగవానుడు సమాధానమిచ్చుచుండెను.

"రామా! నీకు ఉపాసనకు సంబంధించిన దేశకాలమును గూర్చి చెప్పెదను. నీవు వినుము. నాదు అంశముచే పరిచ్ఛిన్నమగు రూపములో సకల దేవతలయొక్క దేహములు కలుగుచున్నవి.

రాజేంద్రా! ఎవరు అన్యదేవతలను భక్తిశ్రద్ధలతో పూజించుచున్నారో వారు నన్నే పొందుచున్నారు. కాని వారు నన్ను అఖండ స్వరూపముగా తెలుసుకోలేక పోవడంచేత అది విధిపూర్వకమైన ఉపాసనకాదు.

ఈ సకల విశ్వము నాయొక్క ఉనికి కన్నా భిన్నము కాదు. కావున సకల క్రియలను అనుభవించువాడను నేనే. వాటికి ఫలములను సమర్పించు వాడను నేనే."

ఎవరు ఏ దేవతలయొక్క ఆకారములో నన్ను ఉపాసించుచున్నారో, వారికి ఆయా ఆకారములోనే ప్రసన్నుడనై, వాంఛితములను నెరవేర్చు చున్నాను.

విద్యుక్తముగా లేకగాని, భక్తితో నన్ను ఉపాసించిన వారికి ప్రసన్నుడ నగుదును అట్టివారికి తగిన ఫలమును ఇచ్చెదను. ఇందు సంశయము లేదు.

మిక్కిలి దూరాచార పరుడైనను, పశ్చాత్తాపమునొంది, అనన్య చిత్త ముతో నన్ను సేవించువాడు సజ్జనుడని చెప్పబడును. అతనియొక్క నిశ్చ యము కార్యము నిర్దిష్టమైనవి.

ఉపాసకుడు తనయొక్క జీవ స్వరూపము మరియు నా యొక్క ఈశ్వర స్వరూపము ఒక్కటే అను అనన్యబుద్ధి కలిగియుండునో వానికి బ్రహ్మ హత్యాది పాతకములు స్పృశింపజాలవు.



# శ్రీ శివగీతా

## అథ ద్వాదశోఽధ్యాయః

## ఉపాసనా యోగః



శ్రీరామ ఉవాచ

భగవన్ ! దేవ! దేవేశ - నమస్తేఽస్తు మహేశ్వర।
ఉపాసనవిధిం బ్రూహి - దేశం కాలం చ తస్య తు ॥
అంగాని నియమాంశ్చైవ మయి తేఽనుగ్రహో యది ॥1॥

శ్రీ ఈశ్వర ఉవాచ

శృణు రామ ! ప్రవక్ష్యామి దేశం కాల ముపాసనే ।
సర్వకారోహ మేవైకః-సచ్చిదానంద విగ్రహః॥ 2
మదంశేన పరిచ్ఛిన్నా - దేహాః స్వర్వదివౌకసామ్ । 3
యే త్వన్య దేవతా భక్తా - యజంతే శ్రద్ధయాన్వితాః ।
తేఽపి మామేవ రాజేన్ద్ర !- యజంత్య విధిపూర్వకమ్ ॥ 4
యస్మా త్సర్వమిదం విశ్వం - మత్తో న వ్యతిరిచ్యతే ।
సర్వక్రియాణాం భోక్తాహం - సర్వస్యాహం ఫలప్రదః॥ 5
యేనాకారేణ యే మర్త్యా - మామేవైక ముపాసతే ।
తేనాకారేణ తేభ్యోఽహం ప్రసన్నో వాంఛితం దదే ॥ 6
విధినాఽవిధినా వాపి - భక్త్యా యే మా ముపాసతే ।
తేభ్యః ఫలం ప్రయచ్ఛామి - ప్రసన్నోఽహం న సంశయః॥ 7
అపీ చేస్సు దురాచారో - భజతే మా మనన్యభాక్ ।
సాధురేవ స మన్తవ్య - సమ్యగ్ వ్యసితో హిసః॥ 8
స్వజీవత్వేన యో వేత్తి - మామేవైక మనన్య ధీః।
తం న స్పృశంతి పాపాని - బ్రహ్మహత్యాదికాన్యపి ॥ 9

ఉపాసన చతుర్విధములని విద్వాంసులచే చెప్పబడుచుండెను. అవి 1. సంపదుపాసన 2. ఆరోపోపాసన 3. సంవర్గోపాసన మున్నగునవి. గుణ సంబంధమున అల్పమైన దానిని అధికముగా చింతించు ఉపాసనా విధానము "సంపదుపాసన" అనబడును ఉదాహరణకు "మనస్సు అనంత విశ్వదేవత" అని చింతన చేయడం.

అంగమునందు ఆరోపించిన ఉపాసనా విధానము "ఆరోపోపాసన" అనబడును. ఉదాహరణకు, ఓంకారము సామవేదము యొక్క ఉద్గీధమని తెలుసుకొనడము.

బుద్ధి పూర్వకముగా ఆరోపింపబడిన ఉపాసనా విధానము "ఆధ్యాసోపాసన"అనబడును. ఉదాహరణకు గర్భాదానమునందు భర్త భార్యయందు అగ్ని బుద్ధిని కలిగియుండడం.

క్రియాసామ్యముచే చేయబడిన ఉపాసనా విధానము "సంవర్గోపాసన" అనబడును. ఉదాహరణకు ప్రథమ కాలమందు వాయువు సకల భూతములను తన యందు విలీనము చేయడం.

తత్త్వోపదేశమున దేవతకు తనకు ఉన్న భేదముచే దేవతాత్మత్వమును కలిగియుండడమే "అంతర్గతోపాసన" అనబడును. అద్దానికంటే భిన్నమగు సంపదాది ఉపాసనా విధానములు బహిర్గతోపాసనలు.

అంతర్గతోపాసనలో సజాతి జ్ఞాన సమూహమువలన తదేక నిష్ఠతో ఉపాస్య దేవతలకు ధ్యానింపవలెను. ఆ విధముగా దేవతా సాక్షాత్కారము కలుగునంతవరకు ధ్యానించడమే "ఉపాసన" మనబడును.

బహిర్గతోపాసనలయిన సంపదాదుల యందు దృఢమైన బుద్ధి "ఉపాసన" మని చెప్పబడును. యజ్ఞయాగాది కర్మలు చేయు సమక్షములో తదంగములగు ఆజ్యాదుల యందు దృష్టిని మాత్రము పెట్టడం ఉపాసనమే.

రామచంద్రా నీకు ఈవిధముగా ఉపాసన గూర్చి చెప్పితిని. ఇక ఉపాసన యొక్క అంగములను గూర్చి చెప్పెదను వినుము.

ఉపాసకుడు తన చిత్తమునకు ఎచ్చట ఏకాగ్రతగా నుండునో, అచ్చటనే ఈశ్వరోపాసనను కొనసాగించవలెను. కాని తీర్థక్షేత్రములకు వెళ్ళవలెననే శ్రద్ధను పరిత్యజింపవలెను.



ఉపాసా విధయ స్తత్ర - చత్వారః పరికీర్తితాః।
సంపదారోప సంవర్గా - ధ్యాసా ఇతి మనీషిభిః॥ 10

అల్పస్య చాధికత్వేన - గుణయోగా ద్విచింతనమ్ ।
అనంతం వై మన ఇతి - సంపద్విధి రుదీరితః॥ 11

విధా వారోప్య యోపాసా - సా౽౽రోపః పరికీర్తితః।
యద్వ దోంకార ముద్గీథ - ముపాసీతే త్యుదాహృతః॥ 12

ఆరోపో బుద్ధిపూర్వేణ - య ఉపాసావిధిశ్చ సః।
యోషిత్యగ్ని మతిర్యత్త - దధ్యాస స్స ఉదాహృతః॥ 13

క్రియా యోగేన చోపాసా - విధి స్సంవర్గ ఉచ్యతే ।
సంహృత్య వాయుః ప్రలయే - భూతన్యే కో౽వసీదతి॥ 14

ఉపసంగమ్య బుద్ధ్యా య - దాసనం దేవతాత్మనా ।
తదుపాసన మంతస్స్యా - త్తద్బహి స్సంపదాదయః॥ 15

జ్ఞానాంత రానంతరిత - సజాతిజ్ఞాన సంతతేః।
సంపన్న దేవతాత్మత్వ - ముపాసన ముదీరితమ్ ॥ 16

సంపదాదిషు బాహ్యేషు - దృఢబుద్ధి రుపాసనమ్ ।
ఉపాసన మితి ప్రోక్తం - తదంగాని బ్రువే శృణు ॥
కర్మకాలే తదంగేషు - దృష్టిమాత్ర ముపాసనమ్ ॥। 17

ఏకాంత స్థలములో నియమముగా నుండవలెను. అచ్చట కంబళి యందుగాని మృదు తల్పమునందుగాని, వ్యాఘ్రచర్మము నందుగాని, ఆసనమును ఏర్పర్చుకొనవలెను. అద్దానియందు కంఠము, శిరస్సు, దేహమును సమముగా నుండునట్లు కూర్చొనవలెను.

విభూతిని లలాటమునందు, సర్వాంగములయందు ధరింపవలెను. పిమ్మట ప్రాణాయామము ద్వారా సకలేంద్రియములను నిగ్రహించుకొనవలెను. భక్తితో స్వగురువునకు నమస్కారము కావించి, ధ్యాన యోగమును ప్రారంభింపవలెను.

ఎవడు వివేక జ్ఞానము లేనివాడో మనో నిగ్రహము లేనివాడో, వానికి అసమర్థుడైన సారధికి చెడ్డ గుర్రములవలె సకలేంద్రియములు స్వాధీనములో నుండవు.

ఎవడు వివేక జ్ఞానము కలవాడో, మనోనిగ్రహము కలవాడో వానికి కుశలుడైన సారధికి మంచి గుర్రములవలె సకలేంద్రియములు స్వాధీనములో నుండును.

ఎవడు వివేక జ్ఞానము లేనివాడో, చంచల మనస్సు కలవాడో, శుచిత్వము లేనివాడో, వాడు పరమపదమగు మోక్షమును పొందలేక, జనన మరణరూప సంసారమునందు తిరుగుచుండును.

వివేక జ్ఞానము కలిగిన విజ్ఞాని మనోనిగ్రహమును, బాహ్యాభ్యంతర శౌచమును కలిగియుండి, పరమపదమగు మోక్షమును పొందును. అట్టి విజ్ఞాని తిరిగి సంసారమును పొందడు.

ఎవడు శరీరరూప రథమునందు సారధిని వివేక జ్ఞాన స్వరూపముగా చేయునో మనస్సుకు కళ్ళెమువేసి స్వాధీనములో నుంచుకొనునో, అట్టి వాడు సంసార మార్గముయొక్క అంతిమ లక్ష్యమును పొందును. అదియే నా యొక్క శ్రేష్ఠమగు పరమపదము.

హృదయ పద్మమును రజోగుణ రహితమైనదిగాను నిర్మలమైనదిగాను పవిత్రమైనదిగాను, శోకరహితమైనదిగాను, సాధకుడు చింతన చేయవలెను అద్దానియందు పరమేశ్వరుడగు నన్ను ధ్యానింపవలెను.



**తీర్థ క్షేత్రాది గమనే - శ్రద్ధాం తత్ర పరిత్యజేత్ ।**
**స్వచిత్తైకాగ్రతా య తత్ర - తత్రాసీత సుఖం ద్విజః॥ 18**

**కంబలే మృదుతల్పే వా - వ్యాఘ్రచర్మణి వా స్థితః।**
**వివిక్తదేశే నియతః - స్సమగ్రీవ శిరస్తనుః॥ 19**

**అత్యాశ్రమస్థః స్సకలా - నీంద్రియాణి నిరుధ్య చ ।**
**భక్త్యాథ స్వగురుం నత్వా - యోగం విద్వాంశ్చ యోజయేత్ ॥ 20**

**యస్త్వ విజ్ఞానవా న్భవ - త్యవ్యక్త మనసా సదా ।**
**తస్యేంద్రియా ణ్యవశ్యాని - దుష్టాశ్వా ఇవ సారథే ॥ 21**

**విజ్ఞానీ యస్తు భవతి - యత్నేన మనసా సహ ।**
**తస్యేంద్రియాణి వశ్యాని - సదశ్వా ఇవ సారథే ॥ 22**

**యస్త్వ విజ్ఞానవాన్ భవ - త్యమనస్కః స్సదాఽశుచిః॥**
**న స తత్పదమాప్నోతి - సంసారం చాధిగచ్ఛతి ॥ 23**

**విజ్ఞానీ యస్తు భవతి - సమనస్క స్సదా శుచిః॥**
**స తత్పద మవాప్నోతి - యస్మా ద్భూయో న జాయతే ॥ 24**

**విజ్ఞానసారథి ర్యస్తు-మనః ప్రగ్రహ ఏవ చ।**
**సోఽధ్వనః పార మాప్నోతి - మమైవ పరమం పదమ్ ॥ 25**

చింతింపరానివాడు, వ్యక్తము కానివాడు, అనంతుడు, అమృత స్వరూపుడు, శుభకరుడు, ఆదిమధ్యాంతరహితుడు, ప్రశాంత స్వరూపుడు, బ్రహ్మకు కారణుడు, విభువు, చిదానందరూపుడు, పుట్టుకలేనివాడు, శుద్ధ స్ఫటిక కాంతికలవాడు, అర్ధనారీశ్వరుడు, వ్యాఘ్రచర్మమును దాల్చినవాడు, నీల కంఠుడు, త్రిలోచనుడు, జటాధరుడు, చంద్రమౌళి, నాగయజ్ఞోపవీతుడు, క్రింది రెండు చేతులయందు వర అభయముద్రలను, పైన రెండు చేతుల యందు పరశువు, మృగములను ధరించినవాడు, సర్వాంగములయందు విభూతిని దాల్చినవాడు, సర్వాభరణము అలంకరించిన వాడునగు నన్ను ధ్యానింపవలెను.

ఆత్మ (అంతఃకరణము)ను క్రింది అరణి కొయ్యగాను, ప్రణవము (ఓం కారము)ను పై అరణి కొయ్యగానుచేసి, జ్ఞానముచే మధించు సాధకుడు తేజో రూపుడనగు నన్ను దర్శించును.

వేద వాక్యములను శాస్త్రములను పఠించుటచేత లభ్యమగువాడను కాను నేను! కాని ఎవరు ధ్యానముచే నన్ను చింతించెదరో వారికి నేను ప్రసన్నుడనై వశమగుదును.

దుశ్చరితమునుండి దూరము కానివాడు, శాంతిలేనివాడు, నిశ్చల చిత్తము లేనివాడు నన్ను పొందలేరు. కేవలం తత్త్వజ్ఞానముచేతనే నన్ను పొందగలరు.

జాగ్రత్స్వప్న, సుషుప్తి మున్నగు ప్రపంచములు ఏ పరంజ్యోతి చేత ప్రకాశించుచున్నవో అట్టి పరంబ్రహ్మ స్వరూపమును నేనే ! అని తెలుసు కొనిన జ్ఞాని సకల బంధములనుండి విడువబడును.

త్రివిధములైన జాగ్రత్స్వప్న, సుషుప్తి...మున్నగు అవస్థలయందు భోగ్యము (అనుభవింపదగినది), భోక్త (అనుభవించువాడు), భోగము (అనుభవము) ఏవి కలవో వాటికి విలక్షణుడనగు సాక్షిని! చిన్మాత్ర స్వరూపుడ నగు సదా శివుడను నేనే!

కోటిమంది మధ్యాహ్న సూర్యులతో సమానమగు తేజము, కోటి మంది పూర్ణిమ చంద్రులతో సమానమగు శీతలము, సూర్యచంద్రాగ్ని నేత్రములు కలిగిన నాదుముఖ పద్మమును (నన్ను) స్మరింపుము.



హృత్పుండరీకం విరజం విశుద్ధం విశదం తథా ।
విశోకం చ విచింత్యాఽత్ర - ధ్యాయేన్మాం పరమేశ్వరమ్ ॥ 26

అచింత్యరూప మవ్యక్త మనంత మమృతం శివమ్ ।
ఆది మధ్యాంత రహితం - ప్రశాంతం బ్రహ్మకారణమ్ ॥ 27

ఏవం విభుం చిదానంద - మరూప మజ మద్భుతమ్ ।
శుద్ధ స్ఫటిక సంకాశ - ముమాదేహార్ధ ధారిణమ్ ॥ 28

వ్యాఘ్ర చర్మాంబరధరం - నీలకంఠం త్రిలోచనమ్ ।
జటాధరం చంద్రమౌళిం -నాగ యజ్ఞోపవీతినమ్ ॥ 29

వ్యాఘ్ర చర్మోత్తరీయం చ - వరేణ్య మభయప్రదమ్ ।
పరాభ్యా మూర్ధ్వ హస్తాభ్యాం - బిభ్రాణం పరశుం మృగమ్॥ 30

కోటిమధ్యాహ్న సూర్యాభ్యం చంద్రకోటి సుశీతలం ।
సూర్యచంద్రాగ్ని నయనం స్మేర వక్త్ర సరోరుహమ్ ॥
భూతి భూషిత సర్వాంగం సర్వాభరణ భూషితమ్ ॥। 31

ఏతాదృశం,మాం ధ్యాయోదితి పూర్వతనెనాన్వయః।

ఏవ మాత్మారణిం కృత్వా - ప్రణవం చోత్తరారణిమ్ ॥
జ్ఞాన నిర్మథ నాభ్యాసా త్సాక్షాత్పశ్యతి మాం జనః॥। 32

వేదావాక్యై రలభ్యోఽహం - న శాస్త్రై ర్నాపి చేతసా ।
ధ్యానేన వృణుతే యో మాం - సర్వదాఽహం వృణోమితమ్ ॥ 33

నాఽవిరతో దుశ్చరితాఽన్నా - శాంతో నా ఽసమాహితః।
నాఽశాంత మానసో వాపి - ప్రజ్ఞానేన లభేత మామ్ ॥ 34

జాగ్రత్స్వప్న సుషుప్త్యాది - ప్రపంచో యః ప్రకాశతే ।
తద్బ్రహ్మాహ మితి జ్ఞాత్వా - సర్వబంధైః ప్రముచ్యతే ॥ 35

త్రిషు ధామసు యద్భోగ్యం - భోక్తా భోగశ్చ యద్భవేత్ ।
తేభ్యో విలక్షణ స్సాక్షీ - చిన్మాత్రోఽహం సదాశివః॥ 36

ఒక్కడే దైవము! అది సర్వభూతములయందు నిగూఢముగా నున్నది. సర్వ వ్యాపి, సర్వాంతర్యామి, సర్వాధ్యక్షుడు, సర్వ భూతాధివాసుడు, సర్వసాక్షి కేవలము నిర్గుణుడు.

ఒక్కటిగానే సృష్టికి పూర్వము నున్నది. అది తన మాయాశక్తిచే సర్వ భూతములయందు అంతరాత్మయై బీజరూపమున నున్నది. అదియే నా యొక్క నిత్య స్వరూపము. అట్టి నన్ను దర్శించిన ధీరుడే శాశ్వతమైన శాంతిని పొందును తదితరులు పొందలేరు.

అగ్ని ఏవిధముగా ప్రపంచ పదార్థములు వృక్షములు (లోహములు మొదలగువాటి) నుండి ప్రతిరూపము యొక్క రూపమును పొంది ప్రకాశించును. అట్లే ఒకే పరమాత్మ సకల భూతములలో అంతర్యామి రూపముగా నుండును. అది సాంసారిక సుఖదుఃఖములు మున్నగు వాటిని అంటుకొనకుండా బాహ్యముగా నుండును.

నన్ను సనాతనునిగాను మహాత్మునిగాను సూర్యకాంతి కలవానిగాను అంధకారములకు అవ్వలనున్న వానిగాను తెలుసుకొనిన సాధకుడు అమృత స్వరూపుడగును. మోక్షమునకు ఇంతకంటే వేరే మార్గములేదు.

పూర్వము బ్రహ్మను సృష్టించి వానికి వేదవిజ్ఞానములను అనుగ్రహించితిని, అట్టి నన్ను పురాణ పురుషునిగాను, దేవవంద్యునిగాను తెలుసుకొనిన జ్ఞాని మృత్యువాత నుండి విడువబడును.

ఎవరీ విధముగా శమదమాది సద్గుణములను కలిగియుండి నన్ను ధ్యానించునో; అట్టి సాధకుడు నాయొక్క తత్త్వ స్వరూప జ్ఞానమును పొందును సాంసారిక దుఃఖముల నుండి విముక్తుడై అంత్యమున పరమేశ్వర రూపమగు నా యందే ఐక్యమగును.

ఇది వ్యాసోక్త పద్మపురాణాంతర్గతముగా నున్న బ్రహ్మవిద్య, యోగవిద్య అయిన శ్రీ శివరామ సంవాదము అనుపేరుగల శివగీత యందు ఉపాసనా యోగమనే పన్నెండవ అధ్యాయం ముగిసిది.



ఏకోదేవః స్సర్వభూతేషు గూఢః-స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా ।
సర్వాధ్యక్షః స్సర్వభూతాధివాస స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ ॥ 37

ఏకోవశీ సర్వభూతాంతరాత్మా
ప్యేకం బీజం నిత్యదా యః కరోతి
తం మాం నిత్యం యేఽనుపశ్యంతి ధీరా
స్తేషాం శాంతి శ్శాశ్వతీ నేతరేషామ్ ॥ 38

అగ్ని ర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ ।
ఏక స్తథా సర్వభూతాంతరాత్మా
న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః॥ 39

వేదేహ యో మాం పురుషం మహాంత
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।
న ఏవ విద్యా నమృతోఽత్ర భూయా
న్నాన్యః పంథా అయనాయ విద్యతే ॥ 40

హిరణ్యగర్భం విదధామి పూర్వం
వేదాంశ్చ తస్మై ప్రహిణోమి యోఽహమ్।
తం దేవ మీడ్యం పురుషం పురాణం
నిశ్చిత్య మాం మృత్యుముఖా త్ప్రముచ్యతే ॥ 41

ఏవం శాన్త్యాయుక్తఃస్సన్ వేత్తి మాం యస్తు తత్త్వతః।
నిర్ముక్త దుఃఖసంతాన - సోఽంతే మయ్యేవ లీయతే ॥ 42

ఓం తత్సదితి శ్రీపద్మపురాణే ఉపరిభాగే శివగీతా సూపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీశివరాఘవ సంవాదే ఉపాసనావర్ణనయోగోనామ ద్వాదశోధ్యాయః

## 13వ అధ్యాయము భావము

సూతుడు చెప్పుచున్నాడు. రాముడీ విషయమును విని ముక్తి లక్షణమును అడుగుటకు ఉపక్రమించెను.

పరమేశ్వరా ! ముక్తియొక్క స్వరూపము, లక్షణములను గూర్చి చెప్పండి అని అడిగిన రామచంద్రునకు, శంకర భగవానుడు విశదీకరించుచుండెను.

ఓ రాఘవా! సాలోక్యము, సారూప్యము, సార్ష్యము, సాయుజ్యము, కైవల్యము అని ముక్తి అయిదు విధములు.

నన్ను నిష్కామముగా పూజించిన సాధకుడు అజ్ఞానంలేని వాడగును. అంతమునందు నాదు లోకమునకు వచ్చి, తాను కోరిన భోగములను అనుభవించును దీనినే "సాలోక్యముక్తి" అందురు.

సకల కామములు లేనివాడై విధి విధానం తెలుసుకొని, నన్ను పూజించిన సాధకుడు సమాన రూపత్వమును పొందును. అనగా నావంటి రూపమును ధరించును నాదు లోకవాసులగు ప్రమాధాధి గణములచే పూజింపబడును. దీనినే "సారూప్యముక్తి" అందురు.

ఇష్టాపూర్తాది కర్మలను నాదు ప్రీతికొరకు ఎవరు ఆచరించునో ప్రతి దినము కర్మలు చేసినది. ఆహారం భుజించినది, హోమం చేసినది దానము చేసినది, తపస్సు చేసినది, (ఈశ్వరార్పణ బుద్ధితో) నాకు సమర్పణ చేయునో, అట్టి సాధకుడు అంత్యమునందు నాదు లోకమునకువచ్చి, నాతో సమానంగా వైభవమును అనుభవించును దీనినే "సార్ష్యముక్తి" (సామీప్యముక్తి లేదా క్రమ ముక్తి) అందురు.

ఎవరు శాంతి, దాంతీ మున్నగు సద్గుణములను కలిగియుండి, నన్ను తనఆత్మగా తెలుసుకొనునో, అట్టి సాధకుడు అంత్యమునందు పరంజ్యోతియై కేవలం అద్వైతమగు పరబ్రహ్మ స్వరూపుడగును. దీనినే "సాయుజ్యముక్తి" అందురు.

ఆత్మస్వరూపంలో నిరంతరం కలిసిపోవడమే "ముక్తి" అని చెప్పబడినది. దీనినే "కైవల్యముక్తి" లేదా జీవన్ముక్తి అందురు.





## శ్రీ శివగీతా

### అథ త్రయోదశోఽ ధ్యాయః

### కైవల్యముక్తి నిరూపణయోగః

సూత ఉవాచ

ఏవం శ్రుత్వా కౌసలేయ - స్తుష్టో మతిమతాం వరః।
పప్రచ్ఛ గిరిజాకాంతం - సుభగం ముక్తిలక్షణమ్ ॥ 1

శ్రీరామ ఉవాచ

భగవన్ ! కరుణావిష్ట - హృదయం ! త్వం ప్రసీద మే ।
స్వరూపం లక్షణం ముక్తేః - ప్రబ్రూహి పరమేశ్వరః॥ 2

శ్రీ భగవాన్ ఉవాచ

సాలోక్యమపి సారూప్యం - సార్ష్యం సాయుజ్య మేవ చ।
కైవల్యం చేతి తాం విద్ధి - ముక్తిం రాఘవ ! పంచధా ॥ 3

మాం పూజయతి నిష్కామః - స్సర్వదా ఽ జ్ఞాన వర్జితః।
స మే లోకం సమాసాద్య - భుంక్తే భోగాన్యథేప్సితాన్ ॥ 4

జ్ఞాత్వా మాం పూజయే ద్యస్తు - సర్వ కామవివర్జితః।
మయా సమానరూప స్స - న్మమ లోకే మహీయతే ॥ 5

ఇష్టాపూర్తాని కర్మాణి - మత్ప్రీత్యైకురుతే తు యః।
యత్కరోతి యదశ్నాతి - యజ్జుహోతి దదాతి యత్ ॥ 6

య త్తపస్యతి తత్సర్వం - యః కరోతి మదర్పణమ్ ।
మల్లోకే స శ్రియం భుంక్తే - మత్తుల్యం ప్రాభవం భజన్ ॥ 7

యస్తు శాంత్యాది యుక్తస్స- న్మా మాత్మత్వేన పశ్యతి ।
స జాయతే పరంజ్యోతి - రద్వైతం బ్రహ్మ కేవలమ్ ॥ 8

ఆత్మ స్వరూపావస్థానం - ముక్తి రిత్యభిధీయతే ।
సత్యం జ్ఞానమనంతం య - దానందం బ్రహ్మకేవలమ్ ॥ 9

ఆత్మ స్వరూపమే కేవలం పరబ్రహ్మం అది సత్య జ్ఞాన స్వరూపమైనది. అనంతమైనది. ఆనంద స్వరూపమైనది. నిర్వికారమైనది సకల ధర్మములకు అతీతమైనది. మనస్సుకు వాక్కుకు అందనిది. సజాతీయ విజాతీయ పదార్థములతో సిద్ధించదు. అద్వైతమను పేరుతో పిలువబడుచున్నది.

ఓ రామా! ఇదియే నా స్వరూపం. శుద్ధమైనదిగా తలంచు. నాయందే స్థావర జంగమాత్మకమగు జగత్తు చూడబడుచున్నది.

ఆకాశమునందు గంధర్వ నగరం (మాయా పట్టణం) కన్పించి మాయమగును. అట్లే అనాదియగు ఆ విద్యచే సకల ప్రపంచం నాయందే కల్పింపబడుచున్నది.

నాయొక్క స్వరూపమును తెలుసుకొనుటచే ఎప్పుడు అవిద్య (ద్వైత జ్ఞానం) నశించునో, అప్పుడు మనస్సు వాక్కులకు అగోచరుడనై నేను ఒక్కడనేయున్నాను. ఎల్లప్పుడు పరమానంద స్వరూపం కలవాడనై స్వ ప్రకాశచైతన్యంతో నేనున్నాను.



కాలము, పంచభూతములు, దిక్కులు, విదిక్కులు మున్నగునవి నన్ను విడిచిలేవు. నాకంటే భిన్నమైన దేదియులేదు. నేనొక్కడనే నిత్యుడనై యున్నాను.

నాదు స్వరూపమును దర్శించుటకు శక్యముకాదు. ఎవ్వరూ నన్ను కంటితో చూడలేరు. హృదయములో ఏకాగ్రచిత్తముతో ధ్యానాదులచేత నన్ను దర్శించిన మనిషి (సాధకుడు) అమృతస్వరూపమగు మోక్షమును పొందును.

రామచంద్రుడు శంకర భగవానున్ని అడుగుచుండెను.

పరమేశ్వరా! నీదు శుద్ధ స్వరూప జ్ఞానము మానవునకు ఎట్లు అలవడును. హరా! అద్దానికి ఉపాయమును నాయందు నీకు అనుగ్రహమున్నచో చెప్పుము.

అని రామచంద్రుడు అడుగగా; శంకర భగవానుడు చెప్పుచుండెను.

“రామా! బ్రహ్మపదము భోగములయందు విరక్తిని పొంది దయను వహించి పుత్రమిత్ర కళత్రాదులయందు సమబుద్ధిని కలిగియుండవలెను. మోక్షశాస్త్రములయందు శ్రద్ధనుంచి, వేదాంత జ్ఞాన సముపార్జనకు సమిధాదులను తీసుకొని శ్రోత్రియ బ్రహ్మ విష్ణులయిన సద్గురువును ఆశ్రయించవలెను. ఆచార్యున్ని చిరకాలము సేవించి వారి దయచే సకల వేదాంత వాక్యార్థములను ఏకాగ్రచిత్తముతో గ్రహింపవలెను.



సర్వ ధర్మవిహీనం చ - మనోవాచా మగోచరమ్ ।
సజాతీయ విజాతీయ - పదార్థానా మసంభవాత్ ॥ 10
అతస్త ద్వ్యతిరిక్తానా - మద్వైతమితి సంజ్ఞితమ్ ।
మత్వా రూపమిదం రామ - శుద్ధం య దభిధీయతే ॥ 11
మయ్యేవ దృశ్యతే సర్వం - జగత్ స్థావర జంగమమ్ ।
వ్యోమ్ని గంధర్వ నగరం - యథా దృష్టం న దృశ్యతే ॥ 12
అనాద్యవిద్యయా విశ్వం - సర్వం మయ్యేవ కల్ప్యతే ।
నివర్తతే చ మయ్యేవ - మయ్యేవేదం విలీయతే ॥ 13
మమ స్వరూప జ్ఞానేన - యదాఽవిద్యా ప్రణశ్యతి।
తదైక ఏవ వర్తేఽహం-మనోవాచా మగోచరః॥ 14
సదైవ పరమానందః - స్వప్రకాశ శ్చిదాత్మనా ।
న కాలః పంచభూతాని - న దిశో విదిశశ్చ న ॥ 15
మదన్యం నాస్తి యత్కించి - త్తదా వర్తేఽహమేకలః।
న సందృశే తిష్ఠతి మే స్వరూపం - న చక్షుషా పశ్యతి మాంతుకశ్చిత్।
హృదా మనీషా మనసాఽభిక్లుప్తం-యే మాం విదుస్తే హ్యమృతాభవన్తి॥16

శ్రీరామ ఉవాచ

కథం భగవతో జ్ఞానం - శుద్ధం మర్త్యస్య జాయతే ।
తత్రోపాయం హరః బ్రూహి - మయితే ఽనుగ్రహోయది॥ 17

శ్రీభగవాన్ ఉవాచ

విరజ్య సర్వభూతేభ్య - ఆవిరించి పదాదపి ।
ఘృణాం వితత్య సర్వత్ర - పుత్రమిత్రాదికేష్వపి ॥ 18
శ్రద్ధాళుర్మోక్షశాస్త్రేషు - వేదాంత జ్ఞానలిప్సయా ।
ఉపాయనకరో భూత్వా - గురుం బ్రహ్మవిదం వ్రజేత్ ॥ 19
సేవాభిః పరితోష్యైనం - చిరకాలం సమాహితః।
సర్వవేదాంత వాక్యార్థం - శృణుయా త్సుసమాహితః॥ 20

సకల వేదాంత వాక్యములయొక్క తాత్పర్యము ఒకే నిశ్చయముగా తెలిసికొనడమే శ్రవణము అని బ్రహ్మజ్ఞానులు చెప్పుదురు.

లోహము, మణి, మున్నగు దృష్టాంతములు యుక్తులచే వేదాంత వాక్యార్థములను చింతన చేయడమే మననము అని పల్కుదురు.

అహంకార మమకారములు లేనివాడై, రాగ ద్వేషములు విడిచినవాడై శాంత్యాది గుణములు కలవాడై, ఆత్మయందు పరమాత్మను దర్శించుచూ సర్వదా ధ్యానయోగమును కలిగియుండుటమే "నిధి ధ్యాసనము" అని చెప్పుదురు.

సకల కర్మలు క్షయమైనప్పుడే ఆత్మసాక్షాత్కారమగును. అది ఒకరికి శీఘ్రముగాను మరియొకరికి ఆలస్యముగాను కలుగును.

కోటి జన్మలయందు ఆర్జించిన కర్మరాశి జ్ఞానముచేతనే నశించును. అది ఇష్టా పూర్తాది కర్మలను ఆచరించుటచే నశించదు.

ఆత్మ జ్ఞానము కలిగిన పిమ్మట, ఏ పాటి పుణ్యము పాపములను చేసినను వాటిచే జ్ఞాని బంధింపబడడు.

శరీరము వచ్చుటకు ప్రారబ్ధ కర్మము కారణమగుచున్నది. అది జీవుని అనుభవముచే నష్టమగును కాని జ్ఞానముచే నశింపదు.

జ్ఞానియగువాడు మోహములేనివాడై, అహంకారము లేనివాడై, నిర్లిప్తుడై సంగవర్జితుడై యుండును. సకల జీవులయందు తన ఆత్మను, తన ఆత్మ యందు సకల జీవులను ఎవరు దర్శించునో నన్ను ధ్యానించుచూ సంచ రించునో వాడే జీవన్ముక్తుడు.

పాముకుబుసము తెలుసుకొను పర్యంతము భయమును కలిగించును. పిమ్మట అది భయమును కలిగించదు.

అట్టి జ్ఞాని దేనికీ భయపడక ఎవరినీ భయపెట్టక యుండును. ఎప్పుడు తన వశములైన సకల కామ వాసనలు నశించునో, అప్పుడు మానవుడు అమృత స్వరూపమగు మోక్షము (బ్రహ్మము)ను పొందును. ఇదియే శాస్త్రము యొక్క అనుశాసనము మోక్షమునకు ఆవాసముగాని గ్రామాంతరముగాని లేదు.

అజ్ఞానమనెడు హృదయగ్రంథిని నాశనము చేయడమే "మోక్షము" ఇది స్మృతులయందు చెప్పబడినది.



సర్వవేదాంతవాక్యానాం - మయి తాత్పర్యనిశ్చయమ్ ।
శ్రవణం నామ తత్ప్రాహుః-స్సర్వే తే బ్రహ్మవాదినః॥ 21

లోహమణ్యాది దృష్టాంతై - ర్యుక్తిభి ర్యద్విచింతనమ్ ।
తదేవ మననం ప్రాహు - ర్వాక్యార్థ స్యోపబృంహణమ్ ॥ 22

నిర్మమో నిరహంకారః - స్సమః స్సంగవివర్జితః।
సదా శాంత్యాది యుక్తస్సన్ - ఆత్మనాత్మాన మీహతే ॥
యత్సదా ధ్యానయోగేన - తన్నిది ధ్యాసనం స్మృతమ్ ॥। 23

సర్వకర్మ క్షయవశాత్ - సాక్షాత్కారోఽపి చాత్మనః।
కస్య చిజ్జాయతే శీఘ్రం - చిరకాలేన కస్యచిత్ ॥ 24

కూటస్థానీహ కర్మాణి - కోటి జన్మార్జితాన్యపి ।
జ్ఞానేనైవ వినశ్యంతి - న తు కర్మాఽయుతై రపి ॥ 25

జ్ఞానాదూర్ధ్వం తు యత్కించి - త్పుణ్యం వా పాపమేవ వా ।
క్రియతే బహు వాప్యల్పం - తేనాయం విలిప్యతే ॥ 26

శరీరారంభకం యత్తు - ప్రారబ్ధం కర్మ తన్మతమ్॥
తద్భోగేనైవ నష్టం స్యా-న్నతు జ్ఞానేన నశ్యతి ॥ 27

నిర్మోహో నిరహంకారో - నిర్లేపః స్సంగవర్జితః॥ 28

సర్వభూతేషు చాత్మానం - సర్వభూతాని చాత్మని ।
యః పశ్య సంచరత్యేవ - జీవన్ముక్తోఽభిధీయతే ॥ 29

అహినిర్ల్వయినీ యద్వ - ద్ద్రష్టుః పూర్వం భయప్రదా।
తతోఽస్య నభయం కించి - త్తద్వ ద్ద్రష్టురయం జనః 30

యదా సర్వే ప్రముచ్యంతే - కామా యేఽస్య వశంగతాః।
అథ మర్త్యోఽమృతో భవ - త్యేతావ దనుశాసనమ్ ॥ 31

మోక్షస్య నహి వాసోఽస్తి - న గ్రామాంతర మేవ వా ।
అజ్ఞాన హృదయగ్రంథి - నాశో మోక్ష ఇతి స్మృతః॥ 32

వృక్షముయొక్క పై భాగమునుండి కాలు జారగానే క్రిందకు పడిపోవును. అట్లే అజ్ఞానము నశించి ఆత్మజ్ఞానము కలుగగానే నిశ్చితముగా మోక్షము కలుగును.

పుణ్య తీర్థమునందుగాని చండాల గృహమునందుగాని చైతన్యముతో దేహమును పరిత్యజించినను జ్ఞానము వలననే విముక్తి కలుగును. జీవించి యున్నప్పుడు భక్ష్యాభక్ష్యములను భుజించినను, ఎచ్చట శయనించినను, సర్వాత్మ స్వరూపుడగు జ్ఞాని-ముక్తిని పొందును.

పాలు నుండి తీయబడిన నెయ్యి మరల పాలలో కరిగిపోదు. అదే విధముగ సంసారమునందున్న జ్ఞాని మరల సంసార (మాయ)లో ఏకత్వం చెందదు.

రామా! ఎవరు ప్రతినిత్యం ఈ అధ్యాయమును చదివెదరో వినెదరో వారు ఈ దేహబంధం నుండి అనాయాసంగా విముక్తులగుదురు. కావున మహీపతీ నీవు మనస్సును నిగ్రహించి ప్రతినిత్యం ఈ అధ్యాయ మును చదువుము. అద్దానిని నీవు అనాయాసంగా మోక్షమును పొందెదవు" అంటూ శంకరభగవానుడు విశదీకరించెను.

ఇది శ్రీ పద్మపురాణాంతంబైన శివగీత యందు కైవల్యముక్తి యోగము అను పదమూడవ అధ్యాయం సమాప్తం.



వృక్షాగ్ర చ్యుతపాదోయ - స్స తదైవ పతత్యధః।
త ద్వాజ్ఞాన వతోముక్తి - ర్జాయతే నిశ్చితాఽపి తు ॥ 33

తీర్థే చండాలగేహే వా - యది వా నష్టచేతనః।
పరిత్యజన్ దేహమేవం - జ్ఞానాదేవ విముచ్యతే ॥ 34

సంవీతో యేన కేనాశ్నన్ - భక్ష్యం వాఽభక్ష్యమేవ వా ।
శయానో యత్ర కుత్రాపి - సర్వాత్మా ముచ్యతేఽత్ర సః॥ 35

క్షీరాదుద్ధృత మాజ్యం యత్ - క్షిప్తం పయసి తత్పునః।
న తేనైవైకతాం యాతి - సంసారే జ్ఞానవాం స్తథా ॥ 36

నిత్యం పఠతి యోఽధ్యాయ - మిమం రామ! శృణోతి వా ।
స ముచ్యతే దేహబంధా - దనాయాసేన రాఘవ॥ 37

తత స్సంయుత చిత్తస్త్వం - నిత్యం పఠ మహీపతే ।
అనాయాసేన తేనైవ - సర్వథా మోక్ష మాప్స్యసి ॥ 38

ఓం తత్సదితి శ్రీపద్మపురాణే శివగీతా సూఽపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివ రాఘవ సంవాదే కైవల్యముక్తి నిరూపణయోగోనామ త్రయోదశోధ్యాయః

## 14వ అధ్యాయము భావము

భగవాన్ ! మీయొక్క సచ్చిదానంద స్వరూపము నిశ్చలమైనది. నిష్క్రియమైనది, శాంతమైనది, దోషరహితమైనది, మాయారహితమైనది.

అది కర్తృత్వము, భోక్తృత్వము మున్నగు సకల ధర్మములకు అతీతమైనది. మనస్సు, వాక్కులకు అగోచరమైనది. అంతటా వ్యాపించియున్న ఆత్మస్వరూపమైనది. ఆత్మజ్ఞానము, తపస్సులకు మూలమైనది, తత్పదముచేత పరబ్రహ్మ స్వరూపమైనది. ఉపనిషత్తులకు పరమమైనది, రూపరహితమైనది, సకల జీవులయొక్క ఆత్మ స్వరూపమైనది, జగత్కారణమగు మాయ... మున్నగు వాటికి కారణమైనది.

ఓ శంకరా! ఈ విధముగా ఇట్టిదని చెప్పుటకుగాని, గ్రహించుటకు గాని వీలులేనిదైయున్న; అద్దానిని గూర్చి ఏ విధముగా తెలుసుకొనవలెను? అట్టి ఉపాయమును తెలియకోరి అడుగుచున్నాను ? అని, రామచంద్రుడు అడుగగా, శంకరభగవానుడు చెప్పుచుండెను.

ఓ రామా! మహాభుజా ! నీకు ఉపాయమును చెప్పెదను వినుము ! నిర్గుణ పరబ్రహ్మమును తెలుసుకొనుటకు ముందు సగుణోపాసనచే చిత్తమును ఏకాగ్రము చేయవలెను. పిమ్మట, స్థూలారుంధతీ న్యాయము చేత, చిత్తమును సచ్చిదానంద స్వరూపమైన పరబ్రహ్మమునందు లగ్నము చేయవలెను.

మాంస పిండమైన స్థూల దేహము జీవునియొక్క అన్నమయ కోశమనబడును. అది జన్మము, రోగము, ముసలితనము, మృత్యువులకు నిలయమైనది. అట్టి స్థూల దేహము నందు దృఢమైన అభిమానము ఏర్పడును. "దేహమే నేను"అను ఆత్మత్వబుద్ధి జీవునకు నిశ్చలముగా నుండును.

ఆత్మ నిత్యమైనది. అది జన్మించదు. నశించదు. పుట్టుటఉండుట, మార్పుచెందుట, పెరుగుట, క్షీణించుట, నశించుట అను షడ్భావ వికారములు దేహమునకు మాత్రమే యుండును.

ఘటాకాశమువలె ఆత్మకు వికారము లేదు. అందువలన, విబుధులు నేను ఆత్మను ! దేహమునుకాను!" అని భావన చేయవలెను.



# శ్రీ శివగీతా



## అథ చతుర్దశో ऽధ్యాయః
## పంచకోశ వర్ణన యోగః

శ్రీరామ ఉవాచ

భగవన్ ! యది తే రూపం సచ్చిదానంద విగ్రహమ్ ।
నిష్కలం నిష్క్రియం శాంతం – నిరవద్యం నిరంజనమ్ ॥ 1
సర్వధర్మ విహీనం చ – మనోవాచా మగోచరమ్ ।
సర్వవ్యాపిన మాऽత్మాన-మీక్షతే సర్వతస్థ్సితమ్ ॥ 2
ఆత్మవిద్యా తపోమూలం – తద్బ్రహ్మోపనిష త్పరమ్ ।
అమూర్తం సర్వభూతాత్మ- ऽకారం కారణకారణమ్ ॥ 3
యత్తదదేశ్య మగ్రాహ్యం – తద్గ్రాహ్యం వా కథం భవేత్ ।
అత్రోపాయ మజానాన – స్తేన ఖిన్నోऽస్మి శంకర! 4

శ్రీ శివ ఉవాచ

శృణు రామ ! ప్రవక్ష్యామి- తత్రోపాయం మహాభుజ ।
సగుణోపాసనాభితు – చిత్తైకాగ్ర్యం విధాయ చ॥ 5
స్థూలారుంధలికాన్యాయత్ – తత్రచిత్తం ప్రవర్తయేత్ ।
తస్మిన్నన్నమయే పిండే – స్థూలదేహే తనూభృతామ్ ॥ 6
జన్మవ్యాధి జరామృత్యు – నిలయే వర్తతే దృఢా ।
ఆత్మబుద్ధి రహంమానా – త్కదాచి న్నైవ హీయతే ॥ 7
ఆత్మా నజాయతే నిత్యో – మ్రియతే వా కథంచన ।
సంజాయతేऽస్తి విపరి – ణమతే వర్ధతేऽపిచ ॥ 8
క్షీయతే నశ్యతీత్యేతే – షడ్భావా వపుష స్మృతాః।
ఆత్మనో న వికారిత్వం – ఘటస్థ నభసో యథా ॥ 9
ఏవమాత్మా వపుస్తస్మా – దితి సంచింతయే ద్బుధః।
మూషానిక్షిప్త హేమాభః – కోశః ప్రాణమయో భవేత్ ॥ 10
కర్మేంద్రియైః సమాయుక్తః-చలనాది క్రియాత్మకః 11

మూసయందుంచబడిన బంగారమువలె అన్నమయ కోశములో ప్రాణమయ కోశమున్నది దీనిని ప్రాణాది పంచవాయువులు స్థూలదేహముతో సంబంధమును కల్గించును. ఇందులో పంచ కర్మేంద్రియములు ఉన్నాయి. దీని ద్వారా చలనాది క్రియలు కలుగును. ఇది ఆకలిదప్పులు కల్గియుండును, ఆత్మ స్వరూపముకాదు. జడపదార్థమైనది.

ఆత్మతత్త్వము చిద్రూపమైనది అది జడమగు దేహము మున్నగు వాటిని తెలుసుకొను చైతన్యము! పరబ్రహ్మము యొక్క స్వరూపము. అందువలన క్రియలేనిది అది దుఃఖరహితమైన సుఖసాగరము! పరబ్రహ్మము ఒక దానికి భోగ్యము కాదు. మరియొకటి పరబ్రహ్మమునకు భోగ్యముకాదు.

ప్రాణమయ కోశమునందు మనోమయ కోశమున్నది. ఇది సంకల్పము వికల్పములను కలిగియున్నది. బుద్ధింద్రియములతో కూడియున్నది.

కామము, క్రోధము, మోహము, మదము మాత్సర్యము అను ఆరు శత్రువులు (అరిషడ్వర్గము) మమత, ఇచ్ఛా మున్నగునవి. మనోమయ కోశమునకు ధర్మములు.



వేదములు, శాస్త్రములయొక్క జ్ఞానము వలన లౌకిక, అలౌకిక విషయములను బుద్ధి నిశ్చయించును. అట్టి బుద్ధి, జ్ఞానేంద్రియములు కలసి విజ్ఞానమయ కోశమనబడును.

ఇహలోకము నందలి సకల కార్యములు "నేను చేయుచున్నాను." అను కర్తృత్వాభిమానము కలుగును. ఇందు సందేహములేదు. ఇహ, పర లోకములలో సంచరించువాడే జీవుడని వ్యవహరింపబడును.

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములే పంచ మహాభూతములు, అటువంటి వాటియొక్క సత్త్వగుణ అంశముల నుండి జ్ఞానేంద్రియములు కలుగుచున్నవి.

ఆకాశమునుండి శ్రోత్రేంద్రియము (చెవి), భూమి నుండి ఘ్రాణేంద్రియము (ముక్కు), జలము నుండి జిహ్వేంద్రియము (నాలుక), తేజస్సునుండి చక్షురింద్రియము (కన్ను), వాయువునుండి త్వగింద్రియము (చర్మము) ఉత్పన్నములగుచున్నవి. కావున అవి పాంచభౌతికములని చెప్పబడును.



క్షుత్పిపాసా పరాభూతో - నాఽయమాత్మా యతో జడః।
చిద్రూప ఆత్మాయేనైవ - స్వదేహ మభిపశ్యతి॥ 12

ఆత్మైవ హి పరం బ్రహ్మ - నిర్లేప స్సుఖనీరధిః।
న తదశ్నాతి కం చైత - న్న తదశ్నాతి కశ్చన ॥ 13

తతః ప్రాణమయే కోశే - కోశే ఽ స్త్యేవ మనోమయః।
స సంకల్ప వికల్పాత్మా - బుద్ధీంద్రియ సమాయుతః॥ 14

కామః క్రోధ స్తథా లోభో-మోహో మాత్సర్యమేవ చ।
మదశ్చే త్యరిషడ్వర్గో - మమతేచ్ఛాదయోఽపి వా॥ 15

మనోమయస్య కోశస్య - ధర్మా ఏతస్య తత్ర తు ।
యా కర్మవిషయా బుద్ధి - ర్వేదశాస్త్రార్ధ నిశ్చితా॥ 16

సా తు జ్ఞానేంద్రియైస్సార్ధం - విజ్ఞానమయకోశతః
ఇహ కర్తృత్వాభిమానీ - స ఏవ తు న సంశయః॥ 17

ఇహాముత్ర గతి స్తస్య - జీవో వ్యావహారికః।
వ్యోమాదిసాత్త్వికాంశేభ్యో - జాయంతే ధీంద్రియాణి తు॥ 18

వ్యోమ్న శ్శ్రోత్రం భువో ఘ్రాణం-జలాజ్జిహ్వాఽథ తేజసః।
చక్షుర్వాయోస్త్వగుత్పన్నా - తేషాం భౌతికతా తతః॥ 19

పంచమహాభూతములయొక్క సత్త్వగుణ అంశములనుండి బుద్ధి, మనస్సు కలుగుచున్నవి. ఇందులో బుద్ధి నిశ్చయాత్మకమైనది. మనస్సు, సంశయాత్మకమైనది. వాక్కు (నోరు), పాణి (చేతులు), పాదము(కాళ్ళు), పాయువు(గుదము) ఉపస్థ (మూత్రేంద్రియము)లు కర్మేంద్రియములు అవి పంచ మహాభూతముల యొక్క రజోగుణ అంశములనుండి క్రమముగా ఉత్పన్నములగుచున్నవి. పంచ మహాభూతములయొక్క రజోగుణ అంశము లచేరి కవలన పంచవాయువులు కలుగుచున్నవి.

ఈవిధముగా జ్ఞానేంద్రియ పంచకము (5), కర్మేంద్రియ పంచకము (5) వాయు పంచకము (5), మనోబుద్ధి ద్వయము (2) వెరశి సప్తదశాత్మ కము (పదునేడుతత్త్వముల సమూహము) లింగశరీర మనబడును.

ఈ లింగశరీరము కాల్చబడిన ఇనుపముద్దవలె పరస్పరారోపయోగము వలన అనగా ఇనుపముద్ద అగ్నిలోను, అగ్నియొక్క దహనశక్తి ఇనుపముద్ద లోను పరిస్పరాధ్యాసకలుగునట్లు సాక్షియగు చైతన్యముతో కూడియుండును. అదియే ఆనందమయకోశము.

అది సకల విషయములయందు భోక్తృత్వమును పొందుచున్నది, అదియే ఇహపరములకు భోక్తయని చెప్పబడుచున్నది.

సుషుప్తిలో లింగశరీరముతో పరస్పరాధ్యాస విడువబడి తన నిజ స్వరూపములోనున్న చైతన్యము సాక్షిరూపముగా యుండును, ఆ సమయము నందే సుషుప్త్యవస్థ సుఖమును అనుభవించును.

ఆత్మ ఇంద్రియానుభవములకు స్మృతికి సాక్షి యగును. అంతఃకరణ ములో పరస్పరాధ్యాన వలన ఆత్మలో భోక్తృత్వము సాక్షిత్వము అనురెండూ ఆరోపింపబడును.

వెలుగు-నీడలు రెండూ సూర్యుని ప్రకాశమువలన విరాజిల్లుచున్నట్లు; సాక్షి చైతన్యమే సుఖ దుఃఖాది భోగములను సంభవింపచేయును, ఆ చైత న్యమే అంతఃకరణ విశిష్టమై కర్మ ఫలభోగమును అనుభవించును.

క్షేత్రజ్ఞుడగు సాక్షి చైతన్యము రధికునిగాను, క్షేత్రమగు శరీరము రధము గాను, బుద్ధి సారధిగాను, మనస్సు కళ్ళెముగాను తెలిసికొనుము.

దశేంద్రియములే గుర్రములుగాను, ఇంద్రియవిషయములే మార్గములు గాను తెలిసికొనుము. పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు మనస్సుతో కూడిన ఆత్మను భోక్తయగు పురుషునిగాను తెలిసికొనుము.



వ్యోమాదీనాం సమస్తానాం - సాత్త్వికాంశేభ్య ఏవ తు ।
జాయతే బుద్ధిమనసీ బుద్ధిః - స్యా న్నిశ్చయాత్మికా॥ **20**

వాక్పాణి పాదపాయూపస్థాని-కర్మేంద్రియాణి తు।
వ్యోమాదీని రజోఽం శేభ్యో - వ్యస్తేభ్యస్తాన్యనుక్రమాత్ ॥ **21**

సమస్తేభ్యో రజోఽంశేభ్యః - పంచ ప్రాణాది వాయవః।
జాయంతే సప్తదశక - మేవం లింగశరీరకమ్ ॥ **22**

ఏత ల్లింగశరీరం తు - తప్తాయ పిండవద్యతః।
పరస్పరాధ్యాసయోగా - త్సాక్షి చైతన్యసంయుతమ్ ॥ **23**

తదానందమయః కోశో- భోక్తృత్వం ప్రతిపద్యతే ।
విద్యా కర్మఫలాదీనాం - భోక్తే హాముత్ర స స్మృతః॥ **24**

యదాధ్యాసం విహాయైష - స్వస్వరూపేణ తిష్ఠతిః।
అవిద్యామాత్ర సంయుక్త - స్సాక్ష్యాత్మా జాయతే తదా ॥ **25**

ద్రష్టాంతఃకరణాదీనా - మనుభూతే స్మృతే రపి।
అతోఽన్తః కరణాధ్యాసా - దధ్యాసిత్వేన చాత్మనః॥ **26**

భోక్తృత్వం సాక్షితా చేతి - ద్వైధం త స్యోపపద్యతే ।
ఆతపశ్చాపి తాచ్ఛాయా - తత్రప్రకాశే విరాజతే ॥
ఏకో భోజయితా తత్ర - భోక్తాన్య కర్మణ ఫలమ్ ॥। **27**

క్షేత్రజ్ఞం రథినం విద్ధి - శరీరం రథమేవ చ ।
బుద్ధిం తు సారథిం విద్ధి - ప్రగ్రహం తు మనస్తథా ॥ **28**

ఏ ద్విజుడు శాంతి దాంతి మున్నగు సద్గుణములను కలిగియుండి నిత్యము ఉపాసన చేయునో; అతడు అరటిచెట్టుయొక్క దొప్పలను క్రమముగా తొలగించినచో మధ్యలో సారమైనదూట లభ్యమగునట్లు పంచకోశములను ఒక్కొక్క దానిని నిరాకరించి ఈ క్షేత్రములలో సారమగు ఆత్మ తత్వమును తెలిసికొనును.

ద్విజుడు ఈవిధముగా మనస్సును నిగ్రహించి నియమమును కలిగియుండవలెను. తర్వాత నిరాకారమగు పరమాత్మ స్వరూపమునందు చిత్తమును ప్రవర్తింప చేయవలెను. పిమ్మట మనస్సు గ్రహింపనలవికాని, చూడ శక్యముగాని అణురూపమైన యుక్తిగోచరమైన పరబ్రహ్మ తత్వమును పొందుచుండును. అని శంకరభగవానుడు వివరించెను.

పరమేశ్వరా! కొందరు శ్రవణముచేతనే వేదశాస్త్రములను తెలిసికొన్నవారు యజ్ఞాది కర్మలను నిర్వహిస్తారు. సత్యమునే మాట్లాడుతారు, మరి కొందరు శ్రవణము చేసినను ఆత్మతత్వమును తెలిసికొనరు. ఇంక కొందరు తెలిసికొనియు, నీదు మాయాశక్తిచే అంతా మిధ్యయని భావిస్తారు. దీనికి కారణమేమి ? అంటూ రామచంద్రుడు ప్రశ్నించగా శంకర భగవానుడు సమాధాన మిచ్చుచుండెను. మహాబాహూ! రామా! ఈ విషయమునకు విచారించవద్దు.

త్రిగుణాత్మకమగు నాదు మాయదివ్యమైనది. దాట శక్యముకానిది ఎవరు నన్ను ఆశ్రయించెదరో వారు నాదు మాయను దాటుదురు.

నా యందు శ్రద్ధలేని భక్తిహీనులు ఐహిక అముష్మిక ఫలములను కోరుచూ నశించే అల్పమగు కర్మఫలమును పొందుచున్నారు. ఈ విషయము తెలియక ఏ నరాధములు కర్మలు చేయుచున్నారో వారు తల్లి గర్భమునందు, మృత్యు ముఖము (మరణము)నందు మరల మరల పడుచున్నారు.

అనేక యోనులయందు జన్మించిన ఒకానొక జీవికి కోటి జన్మముల యందు అర్జించుకొనిన పుణ్యఫలముచే నా యందు భక్తి కలుగుతున్నది.

శ్రద్ధతో కూడిన నాదు భక్తుడే జ్ఞానమును పొందును, ఈ జ్ఞానమును కోటి జన్మముల చేతనైనను పలుకర్మలు చేసినను ఎవరూ పొందలేరు. కావున సమస్త కామ్యములను విడిచిపెట్టి నా యందు భక్తిని కలిగియుండుము.



ఇంద్రియాణి హయాన్విద్ధి - విషయాం స్తేషు గోచరాః।
ఇంద్రియై ర్మనసా యుక్తం - భోక్తారం విద్ధి పూరుషమ్ ॥ 29

ఏవం శాంత్యాదియుక్త స్స-న్నుపాస్తే య స్సదా ద్విజః।
ఉద్ఘాట్యోద్ఘాట్యైక మేకం - యద్వేవం కదళీతరోః॥ 30

వల్కలాని తతః పశ్చా - ల్లభతే సారముత్తమమ్ ॥ 31

తథైవ పంచకోశేషు - మన స్సంక్రమయన్ క్రమాత్ ।
తేషాం మధ్యే తతస్సార - మాత్మానమపి విందతి ॥ 32

ఏవం మన స్సమాధాయ - సంయతో మనసి ద్విజః।
అథ ప్రవర్తయే చ్చిత్తం - నిరాకారే పరాత్మని ॥ 33

తతో మనః ప్రగృహ్ణాతి - పరాత్మానం హి కేవలమ్ ।
యత్తదద్రేశ్య మగ్రాహ్య - మస్థూలాద్యుక్తి గోచరమ్ ॥ 34

శ్రీరామ ఉవాచ

భగవన్ ! శ్రవణేనైవ - ప్రవర్తంతే జనాః కథమ్
వేదశాస్త్రార్థ సంపన్నా - యజ్వాన స్సత్యవాదినః॥ 35

శృణ్వంతోऽపి తథాత్మానం - జానంతే నైవ కేచన ।
జ్ఞాత్వా ऽపి మన్యతే మిథ్యా - కిమేత త్తవ మాయయా ॥ 36

శ్రీ భగవాన్ ఉవాచ

ఏవమేవ మహాబాహో - నాత్ర కార్యా విచారణా ।
దైవీ హ్యేషా గుణమయీ - మమ మాయా దురత్యయా ॥ 37

మామేవ యే ప్రపద్యంతే - మాయా మేతాం తరంతి తే ।
అభక్తా యే మహాబాహో - మమ శ్రద్ధావివర్జితాః॥ 38

ఫలం కామయమానస్తే - చైహికాముష్మికాదికమ్ ।
క్షయిష్ణ్వల్పం సాతిశయం - తతః కర్మఫలం మతమ్ ॥ 39

తదవిజ్ఞాయ కర్మాణి - యే కుర్వంతి నరాధమాః।
మాతుః పతంతి తే గర్భే - మృత్యోర్వక్త్రే పునః పునః॥ 40

నానా యోనిషు జాతస్య - దేహినో యస్య కస్యచిత్ ।
కోటిజనార్జితైః పుణ్యైః - ర్మయి భక్తిః ప్రజాయతే ॥ 41

సకల ధర్మములు (దేహేంద్రియ మనోబుద్ధ్యాదులకు సంబంధించిన లౌకిక వైదికధర్మములు) విడిచిపెట్టి నన్ను ఒక్కనినే శరణు వేడుకొనుము. నేను నిన్ను సకల పాపములనుండి విముక్తుణ్ణి చేసెదను, నీవు విచారింపకుము.

ఓరామా! నీవు ఏమి చేసినను, ఏది తినినను, ఎట్టిహోమ మొనర్చినను, ఏమి దానము చేసినను, ఎట్టి తపమాచరించినను, ఆది యంతయు నాకు అర్పింపుము.

రఘుకుల శ్రేష్ఠుడవైన ఓ రామా! నాయందు భక్తికి ఇంత కంటే వేరే సాధన ఏమీలేదు అని శంకర భగవానుడు విశదీకరించెను.



ఇది వ్యాసోక్త సంస్కృత పద్మపురాణమునందు శివగీతలో ఉపనిషత్తు బ్రహ్మవిద్య, యోగశాస్త్రము అయిన శ్రీ శివరామ సంవాదములో పంచకోశ వర్ణన యోగము అనుపేరుగల పద్నాలుగవ అధ్యాయం ముగిసినది.



**సయేవ లభతే జ్ఞానం-మద్భక్తఃశ్రద్ధయాన్వితః।**
**నాన్యకర్మాణి కుర్వాణో - జన్మకోటి శతైరపి ।**
**తత స్సర్వం పరిత్యజ్య - మద్భక్తిం సముపాశ్రయ॥ 42**

**సర్వధర్మాన్ పరిత్యజ్య - మామేకం శరణం వ్రజ ।**
**అ హం త్వా సర్వపాపేభ్యో - మోక్షయిష్యామి మాశుచః॥ 43**

**యత్కరోషి యదశ్నాసి - యజ్జుహోషి దదాసి యత్ । 44**
**యత్తపస్యసి రామ త్వం - తత్కురుష్వ మదర్పణమ్ ।**
**తతః పరతరా నాస్తి - భక్తిర్మయి రఘూత్తమ ॥ 45**

ఓం తత్సదితి శ్రీపద్మపురాణే ఉపరిభాగే శివగీతా సూఉపనిషత్సు బ్రహ్మ విద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివ రాఘవ సంవాదే పంచకోశ వర్ణన యోగనామ చతుర్దశోధ్యాయః

## 15వ అధ్యాయము భావము

శ్రీరాముడు ప్రశ్నించు చున్నాడు.

ఓ శివదేవా! నీ యందుభక్తి ఏవిధంగా కలుగును? ఏ భక్తిచే నిర్వాణ రూపమగు ఉత్తమమగు మోక్షము లభించును. ఓ గిరిజాకాంతా ! నాయందు అనుగ్రహంతో నాకు చెప్పండి.

పరమశివుడు చెప్పుచున్నాడు. ఎవరు వేదాధ్యయము, యజ్ఞము, దానము ధర్మము మొదలైనవి నాకు సమర్పించెదరో వారు నాకు భక్తులు, ప్రియులు.

ఓరామా! శ్రోత్రియ గృహమునుండి అగ్నిహోత్రము చేసిన భస్మం తెచ్చి శుద్ధిచేయవలెను. అద్దానిని 'అగ్నిరితభస్మ' అను మంత్రములతో అభి మంత్రించి యధావిధిగా దేహమునందలి అంగములకు ధరించవలెను. అట్టి భస్మధారణలోనే ఎవరు నన్ను పూజించెదరో వానికంటే ఉత్తముడగు భక్తుడు లేడు.

ఎల్లప్పుడు శిరస్సునందు, కంఠమునందు రుద్రాక్షమాలలను దాల్చెదరో ఎవరు శివపంచాక్షరీని నిరంతరం జపించెదరో వారు నాకు ప్రియభక్తులు.

దేహమునందు భస్మం దాల్చి, భస్మమున శయనించి, ఎల్లప్పుడు జితేంద్రియుడై (ఇంద్రియ జయమునకు అభ్యాసంచేయుచు) రుద్ర సూక్తము లను పఠించుచు నిశ్చలచిత్తముతో నన్ను చింతన చేయుదరో వారు శరీర మునందే సాక్షాత్తు శివస్వరూపులగుచున్నారు.

ఎవరు రుద్రసూక్తములను, ఉత్తములయిన అధర్వశిరోపనిషత్తు, కైవల్యో పనిషత్తు, శ్వేతాశ్వతరోపనిషత్తు మొదలైన వాటిని పారాయణ చేయుదురో అట్టివారికంటే ఉత్తమ భక్తులు నాకులోకంలో లేరు. ధర్మాధర్మ కార్యముల కంటే భూత భవిష్యద్వర్తమానములకంటే, విలక్షణమైనది ఏది కలదో, అద్దా నిని చెప్పెదను సావధానంగా వినుము.

ఎటువంటి పరమపదమును గలుగజేయు వస్తువు పెరుగునుండి దీయబడిన వెన్నవలె సమస్త శాస్త్రము చేతను వేదములతోడను తీయబడినదో యే వస్తువు కోరబడినదై మునులచేత బ్రహ్మచర్య మాచరింపబడు చుండునో అట్టి దానిని నీకు సంక్షిప్తంగా వివరింతును. అదే ఓంకారము అదే నాశ రహితమగు పరబ్రహ్మము దీనిని తెలిసికొనియే బ్రహ్మలోకమును పొందు దురు. ఇదే అక్షరము ఇదే పరము.





## శ్రీ శివగీతా

### అథ పంచదశోఽధ్యాయః

### భక్తి యోగః

శ్రీరామ ఉవాచ

భక్తిస్తే కీదృశీ దేవ - జాయతే వా కథం చ సా ।
యయా నిర్వాణరూపం తు - లభతే మోక్షముత్తమమ్ ॥
తద్బ్రూహి గిరిజాకాంత - ప్రాప్యతేయేన నివృత్తిః॥ 1

శ్రీ భగవాన్ ఉవాచ

యో వేదాధ్యయనం యజ్ఞం-దానాని వివిధాని చ ।
మదర్పణ ధియా కురాత్స - మే భక్తః స్సమే ప్రియః॥ 2
నర్యభస్మ సమాదాయ - విశుద్ధం శ్రోత్రియాలయాత్ ।
అగ్ని రిత్యాదిభి ర్మంత్రై - రభిమంత్ర్య యథావిధి ॥ 3
ఉద్ధూలయతి గాత్రాణి - తేన చార్చతి మామపి ।
తస్మాత్పరతరా భక్తి - ర్మమ రామ ! న విద్యతే ॥ 4
సర్వదా శిరసా కంఠే - రుద్రాక్షా న్ధారయేత్తు యః।
పంచాక్షరీ జపపరః స్సమే భక్తః స్సమే ప్రియః॥ 5
భస్మచ్ఛన్నో భస్మశాయీ - సర్వదా విజితేంద్రియః।
యస్తు రుద్రం జపేన్నిత్యం - చింతయే న్మామనన్యధీః॥ 6
స తేనైవ చ దేహేన - శివ స్సంజాయతే స్వయమ్ ।
జపేద్యో రుద్రసూక్తాని - తథాథర్వశిరః పరమ్ ॥ 7
కైవల్యోపనిషత్సూక్తం - శ్వేతాశ్వతర మేవ చ ।
తతః పరతరో భక్తో - మమ లోకే న విద్యతే ॥ 8
అన్యత్ర ధర్మాదన్యస్మా - దన్యత్రాస్మా త్కృతాకృతాత్ ।
అన్యత్ర భూతాద్భవ్యాచ్చ - యత్ప్రవక్ష్యామి తచ్ఛృణు॥ 9
వదంతి యత్పదం వేదా - శ్శాస్త్రాణి వివిధాని చ।
సర్వోపనిషదాం సారం-దధ్నోఘృతమివోద్ధృతమ్ ॥ 10
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం - చరంతి మునయస్సదా ।
తత్తేపదం సంగ్రహేణ - బ్రవీమ్యోమితి యత్పరమ్ ॥ 11
ఏతదేవాక్షరం బ్రహ్మ - ఏతదేవాక్షరం పరమ్ ।
ఏతదేవాక్షరం జ్ఞాత్వా - బ్రహ్మలోకే మహీయతే ॥ 12
ఛందసాం యస్తు ధేనూనా -మృషభత్వేన చోదితః।
ఇదమేవపతిః స్సేతు - రమృతస్య చ ధారణాత్ ॥ 13

వేదమంత్ర రూప ఛందస్సులనెడి గోవుల నడుమ వృషభంవలె ప్రధానమైనది ఓంకారము. ఇది మోక్షసాధనమైనందున సంసార సాగరమునకు వంతెన (ఆనకట్ట) వంటిది. ఇదియే దివ్యజ్ఞానమును తనలో ఇముడ్చుకొనే పరబ్రహ్మకోశము.

ప్రణవమునకు నాలు మాత్రలు అవి 1. అకారము 2 ఉకారము 3 మకారము 4 అర్థమాత్ర.

ప్రథమ మాత్రయగు 'అ'కారమునకు భూలోకము. ఋగ్వేదము, బ్రహ్మము, అష్టవసువులు, గార్హపత్యాగ్ని, గాయత్రీ ఛందస్సు, గంగానది ప్రాతఃస్సవన యజ్ఞము మొదలైనవి.

ద్వితీయ మాత్రయగు ఉకారమునకు భువర్లోకము. విష్ణువు, రుద్రుడు, అనుష్టుప్ ఛందస్సు-యజుర్వేదము, యమునానది, దక్షణాగ్ని, మధ్యందినసవన యజ్ఞము మొదలైనవి.

తృతీయ మాత్రయగు 'మ'కారమునకు సువర్లోకం, సామవేదం, సూర్యుడు, మహేశ్వరుడు, ఆవాహనాగ్ని, జగతీ ఛందస్సు, సరస్వతీనది, సాయం సవన యజ్ఞము మొదలైనవి.

చతుర్థ మాత్రయగు "అర్థ" మాత్ర ఓంకారోచ్చారణకు చిట్టచివరి దశ అద్దానికి చంద్రలోకము అధర్వణ వేదము, అంగీరసులు సంవర్తకాగ్ని, మరుద్గోము విరాట్ ఛందస్సు సభ్యావ సంధ్యాగ్ని శతుద్రినది యజ్ఞపుచ్ఛము మొదలైనవి.

అకారము ఎరుపురంగు, ఉకారము ప్రకాశించు బంగారువన్నె, మకారము మెరుపుకాంతి, అర్ధమాత్ర - తెలుపురంగు

అంతా ఓంకారమే ! బహు విధముల విచిత్రమగు ఈ విశ్వము ఇది వరకు పుట్టినది, ముందు పుట్టబోవునది అంతము ఓంకారమునందే ప్రతిష్ఠంపబడి యున్నది.

ఇది వరకు పుట్టినది. ఇంక పుట్టబోవునది అంతయు రుద్ర స్వరూపమని చెప్పబడుచున్నది. రుద్రునియందే ప్రాణములున్నవి. ఈ చరాచర ప్రపంచమంతయు రుద్రాభిన్నమగు ఓంకారమని చెప్పబడుచున్నది. ఈ విధముగా ఓంకారముతో రుద్రునకు అభేదము చెప్పబడినది.



మేదయా పిహితే కోశం - బ్రహ్మణో యత్పరమోమితి ।
చతస్రస్స్య మాత్రాస్స్యుః - రకారోకారకౌ తథా ॥ 14

మకార శ్చావసానేஉర్ధ - మాత్రేతి పరికీర్తితా ।
పూర్వత్ర భూశ్చ ఋగ్వేదో - బ్రహ్మాష్టవసవ స్తథా ॥ 15

గార్హపత్యశ్చ గాయత్రీ - గంగా ప్రాతస్సవ స్తథా ।
ద్వితీయా తు భువో విష్ణు - రుద్రోஉనుష్టు బ్యజుస్తథా ॥ 16

యమునా దక్షిణాగ్నిశ్చ - మాధ్యందినసవ స్మృతః।
తృతీయా చ సువ స్సామా - న్యాదిత్యశ్చ మహేశ్వరః॥ 17

అగ్ని రాహవనీయశ్చ - జగతీ చ సరస్వతీ।
తృతీయం సవనం ప్రోక్త - మథర్వత్వేన యన్మతమ్ ॥ 18

చతుర్థీ యావసానే ఉర్ధ - మాత్రా సా సోమలోకగా ।
అథర్వాంగిరస స్సంవ - ర్తకోஉగ్నిః మరుతత్సదా ॥ 19

విరాట్సభ్యావసథ్యౌ చ - శుతుద్రిర్యజ్ఞపుచ్ఛకః।
ప్రథమా రక్తవర్ణాస్యా - ద్వితీయా భాస్వరా మతా ॥ 20

తృతీయా విద్యుదాభా సా - చతుర్థీ శుక్లవర్ణినీ ।
జాతం చ జాయమానం చ - తదోంకారే ప్రతిష్ఠితమ్ ॥ 21

విశ్వం భూతంచ భువనం - విచిత్రం బహుధా తథా ।
జాతం చ జాయమానం - య త్తత్సర్వం రుద్ర ఉచ్యతే ॥ 22

తస్మిన్నేవ పునః ప్రాణా - స్సర్వమోంకార ఉచ్యతే ।
ప్రవిలీనం తదోంకారే - పరం బ్రహ్మ సనాతనమ్ ॥ 23

తస్మాదోంకారజాపీ యః - స్సముక్తో నాత్ర సంశయః॥ 24

ఓంకారమునందే సనాతనమగు పరంబ్రహ్మము లీనమైయున్నది. అందుచే ఓంకారమును జపించువారు ముక్తులగుదురు. ఇందులో సంశయము లేదు.

త్రేతాగ్ని (యజ్ఞాగ్ని) నుండిగాని, స్మార్తాగ్నినుండిగాని, శైవాగ్నినుండిగాని, సంపాదించిన భస్మమును ఓంకారముతో మంత్రించి, ఎవరు నన్ను పూజించెదరో వారికంటే భక్తులు నాకు లోకములో లేరు.

వంటశాలలోని అగ్నినుండిగాని, దావాగ్ని నుండిగాని తీసిన భస్మమును అభిమంత్రించి, దేహమునందు దాల్చినవారు శూద్రులైనను ముక్తులగుదురు. కుశాగ్రములతో బిల్వదళములతో, కొండలలో లభించే పుష్పములతో, ఓంకారమును ఉచ్చరించుచూ; నన్ను పూజించువారు నాకు ప్రియమైన భక్తులు.



పుష్పములు, ఫలములు (పండ్లు) మూలములు (గడ్డలు), పత్రములు (ఆకులు), సలిలము (నీరు), మున్నగు వాటిలో ఏదైనను ఓంకారమును ఉచ్చరించుచూ; నాకు సమర్పించినచో కోటిరెట్లు అధిక ఫలితము కలుగును.

అహింస, సత్యము, ఆస్తేయము దొంగిలింపకుండుట, శౌచము, ఇంద్రియ నిగ్రహము, నిత్యము వేదశాస్త్రాధ్యయనము మున్నగు వాటిని ఎవరు పాటించెదరో వారే నాకు భక్తులు, ప్రియులు.

ప్రదోషకాలమునందు శివాలయమునకు వెళ్లి నన్ను పూజించినవారు, ఉత్తమమైన ఐశ్వర్యమును పొందెదరు. పిమ్మట నాలో ఐక్యమయ్యెదరు.

అష్టమి, చతుర్దశి మున్నగు తిధులయందు పరిశుద్ధులై, సర్వాంగములకు విభూతిని ధరించి రాత్రులయందు నన్ను పూజించువారు నాకు భక్తులు నాకు ప్రియులు. ఇదియే కృష్ణపక్షమునందు ఇంకా విశేషముగా పూజా ఫలితము కలుగును.

ఏకాదశితిథియందు ఉపవాసముండి, ఆనాటిరాత్రి యందు నన్ను పూజించిన భక్తులు ఎన్నటికీ నాశనమును పొందరు. ఇదియే సోమవారము నాడు ఇంకా విశేషముగా పూజా ఫలితము కలుగును.



త్రేతాగ్నే స్మార్తవహ్నే ర్వా - శైవాగ్నేర్వాసమాహితమ్ ।
భస్మాభిమంత్ర్య యో మాంతు - ప్రణవేన ప్రపూజయేత్ ॥
తస్మాత్పరతరో భక్తో - మమ లోకే న విద్యతే ॥। **25**

శాలాగ్నే ర్దావవహ్నే ర్వా - భస్మానీ యాభిమంత్రితమ్ ।
యో విలింపతి గాత్రాణి - స శూద్రోఽపి విముచ్యతే ॥ **26**

కుశపుష్పైర్బిల్వదళైః - పుష్పైర్వాగిరిసంభవైః।
యో మామర్చయతే నిత్యం - ప్రణవేన ప్రియో హి సః॥ **27**

పుష్పం ఫలం సమూలం వా పత్రం సలిలమేవ వా।
యో దద్యా త్ప్రణవై ర్మహ్యం - తత్కోటిగుణితం భవేత్ ॥ **28**

అహింసా సత్య మస్తేయం - శౌచమింద్రియనిగ్రహః।
యస్యాస్త్యధ్యయనం నిత్యం - స మే భక్త స్సమే ప్రియః॥ **29**

ప్రదోష యో మమ స్థానం - గత్వా పూజయతే తు మామ్ ।
స పరాం శ్రియ మాప్నోతి - పశ్చా న్మయి విలీయతే ॥ **30**

అష్టమ్యాం చ చతుర్దశ్యాం - పర్వణో రుభయోరపి ।
భూతి భూషితసర్వాంగో - యః పూజయతి మాం నిశి ॥ **31**

కృష్ణపక్షే విశేషేణ - సమే భక్తస్స మే ప్రియః।
ఏకాదశ్యా ముపోష్యైవం యః పూజయతి మాం నిశి ॥ **32**

సోమవారే విశేషేణ స మే భక్తో న నశ్యతి ॥ **33**

పంచామృతై స్స్నాపయే ద్యః - పంచగవ్యేన వా పునః।
పుష్పోదకైః కుశజలై - స్తస్మా న్నాన్యః ప్రియో మమ॥ **34**

ఆవుపాలు, పెరుగు, నెయ్యి, తేనె, పంచదార, మున్నగు పంచామృత ములతోను, ఆవుపాలు, పెరుగు, నెయ్యి, గోమయము, గోమూత్రము మున్నగు పంచగవ్యములతోను, పుష్పోదకము, కుశోదకము, మున్నగు వాటితో నన్ను స్నానము చేయించినవారు...నాకు ప్రియభక్తులు.

పాలు,నెయ్యి, తేనె, చెరుకురసము, మామిడిపండ్ల రసము, నారికేళో దకము గంధోదకము మున్నగువాటితో, రుద్రమంత్రములను (నమకచమక ములను) ఉచ్చరించుచూ నన్ను అభిషేకము చేసిన వారికంటే ప్రియతములు మరియొకరు నాకు లేరు.

నీటిలో నిలబడి, సూర్యభగవానునికెదురుగా, చేతులు పైకెత్తి సూర్య బింబములో నా (శివ) స్వరూపమును ధ్యానించి, అధర్వాంగిరస మంత్రము లను జపించవలెను. అటువంటివారు గృహమునందు యజమాని ప్రవే శించునట్లు నా దివ్య శరీరమునందు ప్రవేశించెదరు.

బృహద్రథంతరము, వామదేవ్యము, దేవవ్రతము, మున్నగు యాగము లను చేయుచూ, సామవేద మంత్రములను నా సాన్నిధ్యమునందు ఎవరు గానము చేయుదురో వారు ఇహలోకమునందు సకల సంపదలను పొందె దరు. దేహావసానము తర్వాత నా (శివ) సాయజ్యమును పొందెదరు.

ఈశావాస్యోపనిషత్తు మున్నగు ఉపనిష న్మంత్రములను నా సన్నిధిని నిత్యము పారాయణము చేయువారు నా (శివ) సాయుజ్యమును నా (శివ) లోకమును పొందెదరు.

ఓ రఘుకులోత్తమా ! రామా! నేను నీకు భక్తి యోగమును చెప్పితిని. ఇది సకల కోరికలను నెరవేర్చును. అని శంకర భగవానుడు పేర్కొన్నాడు.

ఇది వ్యాసోక్త పద్మపురాణము నందలి శివరామ సంవాద రూపమున గల బ్రహ్మవిద్య యోగశాస్త్రము ఉపనిషత్తు అయిన శివగీత యందు భక్తియోగం అనే పదిహేనవ అధ్యాయం సమాప్తము.





పయసా సర్పిషా చాపి - మధునేక్షురసేన వా ।
పక్వామ్ర ఫలజేనాపి - నారికేళ జలేనవా ॥ 35

గంధోదకేనవా మాం యో - రుద్రమంత్రం సముచ్చరన్ ।
అభిషించేత్తతో నాన్యః - కశ్చి త్ప్రియతమో మమ ॥ 36

అహింసోత్యారమ్భకశ్చి-త్ప్రియతరో మమేత్యోతదస్తం సుగమమ్।
ఆదిత్యాభిముఖో భూత్వా - హ్యూర్ధ్వబాహుర్జలే స్థితః॥ 37

మాం ధ్యాయన్ రవిబింబస్థ - మథర్వాంగిరసం జపేత్ ॥ 38

ప్రవిశేన్మే శరీరేఽసౌ - గృహం గేహపతిర్యథా ।
బృహద్రథంతరం వామ- దేవ్యం దేవవ్రతాని చ ॥ 39

తద్యోగ యాజ్యదోహాంశ్చ - యో గాయతి మమాగ్రతః।
ఇహ శ్రియం పరాం భుక్త్వా - మమ సాయుజ్య మాప్నుయాత్ ॥ 40

ఈశావాస్యాదిమంత్రాన్యో - జపే న్నిత్యం మమాగ్రతః।
మత్సాయుజ్య మవాప్నోతి - మమ లోకే మహీయతే ॥ 41

భక్తియోగో మయాప్రోక్తం - ఏవం రఘుకులోద్వహ ।
సర్వకామప్రదోమత్త్య కి - మన్య చ్ఛ్రోతు మిచ్ఛసి॥ 42

ఓం తత్సది శ్రీ పద్మపురాణే శివగీతాసూఽ పషత్సు
బ్రహ్మవిద్యాయా యోగశాస్త్రే శ్రీ శివరాఘవ సంవాదే భక్తియోగోనామ
పంచదశోధ్యాయః

## 16వ అధ్యాయము భావము

భగవాన్! నీవు మోక్షము యొక్క మార్గమును సుగమముగా బోధించితివి. అట్టి మోక్షమునకు అధికారి ఎవరో చెప్పుము. ఈ సంశయమును నివారించండి ! అంటూ, రామచంద్రుడు అడుగగా, శంకర భగవానుడు విపులీకరించు చుండెను.

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, స్త్రీలు, పురుషులు అందరూ మోక్షమార్గమునకు అధికారులే!

బ్రహ్మచారి, గృహస్థుడు, అనుపనీతుడైన బ్రాహ్మణుడు, వానప్రస్థుడు, వనస్థుడు కానివాడు, యతి, పాశుపతవ్రతుడు, జడుడు, గ్రుడ్డివాడు, చెవిటివాడు, మూగవాడు, రోగాదికారణాలవలన శుచికానివాడు, శాస్త్రీయ కర్మలను చేయనివాడు అవివేకి, భక్తులను అపహాస్యము చేయువాడు, భస్మమును, రుద్రాక్షమాలలనుదాల్చి, శివార్చనయందు భక్తి కల్గిన వారందరు మోక్షమార్గమునకు అధికారులే!

శివలింగార్చన చేయు భక్తులను ద్వేషించినవారు, మోక్షమునకు అధికారులు కారు. నరాధిపా! ఎవరు నన్ను గురువును, పాశుపత వ్రతమును ఆచరించు వానిని, విష్ణువును ద్వేషించెదరో, వారు శతకోటి జన్మములకైనా ముక్తి మార్గమును పొందలేరు.

అనేక లౌకిక కర్మలను చేసిన సంసారి శివజ్ఞానమును తెలుసుకొనక, శివభక్తి లేనివాడైనచో, అట్టి గృహస్థుడు సంసారబంధము నుండి విముక్తిని పొందలేడు.

శాస్త్ర నిందిత ఫలాకాంక్షచే అవైదిక కర్మలైన వామచారములయందు ఆసక్తుడైనవాడు, తత్ఫలమును మాత్రమే పొందును. కాని మోక్షాధికారి కాలేడు.

అవిముక్తి (వారణాసి) ద్వారక, శ్రీశైలము, పుండరీకము (చిదంబరము) మున్నగు పుణ్యక్షేత్రములలో నివశించు భక్తులయందు అనుగ్రహముతో నేను, వారి దేహావసాన సమయమునందు తారక మంత్రోపదేశము చేసెదను. తద్వారా వారు పరంబ్రహ్మ పదమును పొందెదరు.



# శ్రీ శివగీతా

## అథ షోడశోఽధ్యాయః

## మోక్షాధికారి యోగః



శ్రీరామ ఉవాచ

భగవన్ ! మోక్షమార్గో య-స్త్వయా సమ్య గుదాహృతః।
తత్రాధికారిణం బ్రూహి - తత్ర మే సంశయో మహాన్ ॥ 1

శ్రీ భగవాన్ ఉవాచ

బ్రహ్మ క్షత్త్ర విశశ్శూద్రాః - స్త్రి యశ్చా త్రాధికారిణః।
బ్రహ్మచారీ గృహస్థోవాఽ - నుపనీతోఽథ వా ద్విజః॥ 2

వనస్థో వాఽవనస్థో వా యతిః పాశుపతవ్రతీ ।
బహునాఽత్రకి ముక్తేన - యస్య భక్తి శ్శివార్చనే ॥ 3

స ఏవాత్రాధికారీ స్యాత్ - నాన్యచిత్తః కథంచన।
జడోఽన్ధో బధిరో మూకో - నిశ్శౌచః కర్మవర్జితః।
అజ్ఞోపహాసాభక్తాశ్చ - భూతిరుద్రాక్ష ధారిణః॥ 4

లింగినో యశ్చ వా ద్వేష్టి - తే నైవాఽత్రాధికారిణః।
యో మాం గురుం పాశుపతం - వ్రతం ద్వేష్టి నరాధిప ।
విష్ణుం వా స న ముచ్యేత - జన్మకోటి శతైరపి ॥ 5

అనేక కర్మసక్తోఽపి - శివజ్ఞాన వివర్జితః।
శివభక్తి విహీనశ్చ - సంసారీనైవ ముచ్యతే ॥ 6

ఆసక్తాః ఫలసంగేన- యే త్వ వైదిక కర్మణి ।
దృష్టమాత్రఫలాస్తే తు - న ముక్తావధికారిణః॥ 7

అవిముక్తే ద్వారవత్యాం - శ్రీశైలే పుండరీకకే ।
దేహాంతే తారకం బ్రహ్మ - లభతే మదనుగ్రహాత్ ॥ 8

యస్య హస్తౌ చ పాదౌ చ - మనశ్చైవ సుసంయతమ్ ।
విద్యా తపశ్చ కీర్తిశ్చ - స తీర్థఫల మశ్నుతే ॥ 9

ఎవ్వని హస్తములు, పాదములు, మనస్సు...నియమములతో నుం డునో, విద్య, తపస్సు కీర్తి...మున్నగునవి సమకూరునో వానికే తీర్థఫలము లభించును.

యజ్ఞోపవీతము ధరించని (ఉపనయన సంస్కారములేని) బ్రాహ్మణు నకు విధి చెప్పబడినది ఏమనగా స్వధా దానాది పితృకార్యముల తప్ప తదితర కార్యములయందు వేదమంత్రములను ఉచ్చరించరాదు. ఉపనయన సంస్కారము జరుగనంతవరకు బ్రాహ్మణుడు శూద్రునితో సమానము.

పరమేశ్వర నామ సంకీర్తనము, ధ్యానములకు, ద్విజులు, ద్విజేతరులు అందరకు అధికారమున్నది. శివుణ్ని ధ్యానముచేసి, తాదాత్మ్య (అతడే నేనను) భావనవలన నరుడు సంసారబంధమునుండి విముక్తుడగును. కావున దానము, తపస్సు, వేదాధ్యయనము తదితర కర్మలచేత లభించు ఫలము నిత్యము శివధ్యానముచేత కలుగు ఫలము యొక్క సహస్రాంశమునకు సమానము కాదు.

జాతి, ఆశ్రమము, యమాది అష్టాంగములు, దేశము, కాలము, మరియు అంగన్యాసాది కర్మలు...మున్నగు వాటిని ధ్యానము నందు విచా రించే ఆవశ్యకత లేదు. అనగా అవి ధ్యానము చేయు సాధకునకు అవస రములేదు. ధ్యానమునందు భావనయే ప్రధానమైనది.

నడచుచు, నిలుచుచు, పడుకుని జపించుచు, తదితరములైన పనులు చేయుచు ధ్యానము చేయు సాధకుడు, పాపము (మైల)తో కూడినవాడైనను సంసార బంధమునుండి విముక్తుడగును.

ధ్యానాభ్యాసము వలన నాశములేదు. ప్రత్యవాయదోషము కలుగదు. స్వల్పముగా చేయబడిన, ధర్మసంబంధమైన ధ్యానఫలము మృత్యురూపమైన మహాభయము నుండి రక్షించును. అనగా శివధ్యానముచేయు భాగవతునకు ఇతర భయములుండవు.

ఆశ్చర్యము,భయము, శోకము, మున్నగు భావావేశములందుగాని, తుమ్ము వచ్చినప్పుడుగాని, ఏదేని నెపము (వ్యాజము)తోగాని, నాదు నామ మును స్మరించిన మానవులు పరమగతిని పొందెదరు.



విప్ర స్యానుపనీతస్య - విధిరేవ ముదాహృతః।
నాభివ్యాహారయే ద్బ్రహ్మ - స్వధాని నయనాదృతే ॥ 10

స శూద్రేణ సమస్తావ - ద్యావద్వేదాన్న జాయతే ।
నామసంకీర్తనే ధ్యానే - సర్వ ఏవాధికారిణః॥ 11

సంసారా న్ముచ్యతే జంతు - శ్శివతాదాత్మ్య భావనాత్ । 12

సహస్రాం స్నాతు నారహంతి- సర్వదా ధ్యాన కర్మణః।
యథా దానం తపోవేదా - ధ్యయనం చాऽన్యకర్మవా ॥ 13

జాతి మాక్షమ మంద్రాని - దేశంకాల మతాపివా ।
అసనాదీని కర్మాణి ధ్యానం - నాపేక్షతే క్వచిత్ ॥ 14

గచ్ఛం స్తిష్ఠం శ్చరన్వాపి - శయానో వాऽన్యకర్మణి।
పాతకేనాపి యుక్తోవా - ధ్యానాదేవ విముచ్యతే ॥ 15

నేహాభిక్రమనాశోऽస్తి - ప్రత్యవాయో న విద్యతే ।
స్వల్ప మప్యస్య ధర్మస్య - త్రాయతే మహతో భయాత్॥ 16

ఆశ్చర్యే వా భయే శోకే - క్షుతే వా మమ నామయః।
వ్యాజేనాపి స్మర స్మర్త్యః-స్సయాతి పరమాం గతిమ్ ॥ 17

మహాపాపై రపి స్పృష్టో - దేహాంతే యస్తు మాం స్మరేత్ ।
పంచాక్షరీం వోచ్చరతి - స ముక్తో నాత్ర సంశయః॥ 18

మహాపాపము చేసిన వాడైనను మరణ సమయమునందు, నన్ను (శివ నామమును) స్మరించినను, పంచాక్షరీ మహామంత్రము (ఓం నమశ్శివాయ)ను ఉచ్చరించినను అట్టి సాధకుడు మోక్షమును పొందును. ఇందులో సందేహములేదు.

ఈ చరాచరమంతా సదాశివమయముగా తలంచి, నిర్మల చిత్తముతో పరమేశ్వరుణ్ని సాక్షాత్కరించుకొను భాగవతులకు, తీర్థక్షేత్రములు మున్నగు పుణ్యకర్మల వలన ఏమి ప్రయోజనము ? అనగా అట్టి శివభక్తులు పరిపూర్ణులై పరమ పురుషుణ్ని సాధించినందున వానికి పుణ్యకర్మలతో ప్రయోజనము లేదు.

సాధకులెల్లరు ఎల్లప్పుడు విభూతిని రుద్రాక్షలను ధరించవలెను. శివభక్తిని ఆకాంక్షించు వారికివిధి ముఖ్యమైయున్నది. భస్మమును పూసుకొని రుద్రాక్షలను దాల్చిన నరుడు మహాపాపముల నుండి విముక్తుడగును. ఇందులో సందేహములేదు.

శైవ సంబంధములైన తదితర కర్మలను చేసినను చేయకపోయినను; ఎల్లవేళల శివనామమును జపించినచో ముక్తిని పొందును.

ఎవ్వడు అవసాన కాలమునందు రుద్రాక్షలను, విభూతిని దాల్చియుండునో వాడు మహాపాపములు ఉపపాపములచేత చుట్టబడిన నరాధముడైనను అట్టివాని దరికి యమకింకరులు చేరరు. అట్లే బిల్వ వృక్షము మూలములోని మట్టిని దేహమునకు పూనుకొనిన శివభాగవతునకు అవసాన కాలమునందు యమదూతలు దూరముగా పారిపోవుదురు అనగా అట్టి సాధకులు సద్గతిని పొందుదురు.

శంకరభగవాన్ ! నిన్ను ఏయే ప్రతీకలయందు పూజించిన నీవు ప్రసన్నుడవగుదువు? అట్టివాటిని గూర్చి తెలుసుకొనవలెనని జిజ్ఞాస కలుగుచున్నది. కావున నాకు చెప్పండి. అని శ్రీరాముడు పలుకగా శంకరుడు దయతో–

రామా! మృణ్మయము (మట్టి) గోమయము (ఆవుపేడ) భస్మము చందనము ఇసుక, కర్ర, రాయి, ఇనుము, తగరము, సీసము, కంచు, ఇత్తడి, రాగి, వెండి, బంగారము, కర్పూరము, రత్నము, పాదరసము, మున్నగు వాటిచే ప్రతిమగా, పరమేశ్వరుని ఆకారముగాని, శివలింగాకృతిగాని తయారుచేయుము. అప్పుడు వాటియందు నన్ను పూజించిన ఆరాధకులకు కోటిరెట్లు అధికఫలితము కలుగును.



విశ్వం శివమయం యస్తు పశ్య త్యాత్మానమాత్మనా ।
తస్య క్షేత్రేషు తీర్థేషు – కిం కార్యం వాన్యకర్మసు॥ 19

సర్వేణ సర్వదా కార్యం – భూతిరుద్రాక్ష ధారణమ్ ।
యుక్తే నాథాప్యయుక్తేన – శివభక్తి మభీప్సతా ॥ 20

నరో భస్మసమాయుక్తో – రుద్రాక్షా న్యస్తు ధారయేత్ ।
మహాపాపైరపి స్పృష్టో – ముచ్యతే నాత్ర సంశయః॥ 21

అన్యాని శైవకర్మాణి – కరోతి న కరోతి వా।
శివనామ జపే ద్యస్తు – సర్వదా ముచ్యతే తు సః॥ 22

అంతకాలే తు రుద్రాక్షాన్ – విభూతిం ధారయేత్తు యః।
మహా పాపోపపాపౌఘై – రపి స్పృష్టో నరాధమః॥ 23

సర్వథా నోపసర్పంతి – తం జనం యమకింకరాః।
బిల్వమూల మృదాయస్తు – శరీర ముపలింపతి ॥
అంతకాలేఽ౦తక జనైః – స్సదూరీ క్రియతే నరః॥ 24

శ్రీరామ ఉవాచ

భగవన్ ! పూజితః కుత్ర – కుత్రవా త్వం ప్రసీదసి ।
తద్బ్రూహి మమ జిజ్ఞాసా – వర్తతే మహతీ విభో॥ 25

శ్రీ భగవాన్ ఉవాచ

మృదావా గోమయేనాపి – భస్మనాచందనేన వా ।
సికతాభిర్దారుణా వా – పాషాణేనార్థ నిర్మితాః॥ 26

లోహేనాథ రంగేణ – కాంస్యకర్పర పిత్తలైః ।
తామ్ర రౌప్యసువర్ణైర్వా రత్నై ర్నానావిధైరపి ॥ 27

అథ వా పారదేనైవ కర్పూరేణా థవా కృతా ।
ప్రతిమా శివలింగం వా ద్రవ్యైరేతైః కృతం తు యత్ ॥ 28

తత్ర మాం పూజయే త్తేషు – ఫలం కోటిగుణోత్తరమ్ ।
మృద్దారుకాంస్య లోహైశ్చ – పాషాణేనాపి నిర్మితా ॥ 29

గృహస్థుడు మట్టి, కర్ర, కంచు, ఇనుము, రాయి..మున్నగువాటిచే శివునియొక్క ప్రతిమగాని, లింగాకారమునుగాని చేసి ప్రతిష్ఠించవలెను. అద్దానిని పూజించిన ఆరాధకునకు క్రమముగా ఆయువు, సంపద, వంశము, ధర్మము, పుత్రులు, మున్నగునవి కలుగును.

బిల్వవృక్షమునుగాని, బిల్వఫలము (మారేడుకాయ) నుగాని, శివుని ప్రతీకగా చేసుకొని నన్ను పూజించిన ఆరాధకుడు ఇహమునందు మహదైశ్వర్యమును పొందును. పిమ్మట నాదులోకమగు కైలాసమును చేరును.

బిల్వవృక్షము సన్నిధిని విధివిధానముతో మంత్రజపము చేసిన ఆరాధకునకు ఒక్కరోజునకే పురశ్చరణ పూర్తిచేసిన ఫలితము కలుగును. బిల్వవనమునందు కుటీరము నిర్మించుకొని నివాసముండిన ఆరాధనకునకు మంత్రములన్నియు జపించినంత మాత్రముననే సిద్ధించును.

పర్వతశిఖరమున నదీ తీరమున బిల్వవృక్షమూలమున శివాలయమున అగ్ని హోత్రమున (యజ్ఞశాలను) హరిసన్నిధిని ఆరాధకుడుచేయు మంత్ర జపమునకు దానవులుగాని, యక్షులుగాని, రాక్షసులుగాని, విఘ్నములను కల్గించలేరు. అటువంటి సాధకున్ని పాపములంటవు. పిమ్మట శివసాయుజ్యమును పొందును.

రాఘవా! భూమి జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచ మహా భూతములలో సద్గురువులో అంతరాత్మలో నన్ను (శివున్ని) పూజించిన ఆరాధకుడు స్వల్ప ప్రయత్నముతోనే సంపూర్ణ ఫలితమును పొందును.

రామా ! ఆత్మపూజతో సమానమగు పూజ మరొక్కటిలేదు. ఆరాధకుడు చండాలుడైనను ఆత్మ పూజచేయడం వలన నాదు సన్నిధిని (శివసాయుజ్య రూపమగు) ముక్తిని పొందును.

సాధకుడు కంబలాసనము నందు కూర్చొని మంత్రమును జపించిన సకల కోరికలు నెరవేరును. అట్లే కృష్ణాజినము, (నల్లజింకచర్మము) ఆసనము నందు జపించిన ముక్తి కలుగును. వ్యాఘ్రచర్మము (పులిచర్మము) ఆసనము నందు జపించిన మోక్షము, సంపద కలుగును, కుశాసనము (దర్భలతో చేసిన ఆసనము) నందు జపించిన జ్ఞానము కలుగును. పత్రాసనము (ఆకులతో చేసిన ఆసనము) నందు జపించిన ఆరోగ్యము కలుగును. పాషాణము (రాతి)పై జపించిన దుఃఖము కలుగును.

కాష్ఠము (కర్ర)పై జపించిన రోగము కలుగును. వస్త్రముపై జపించిన సంపద కలుగును. ఏ ఆసనము లేకుండా భూమిపై కూర్చొని మంత్రజపము చేసిన సిద్ధింపదు. సాధకులు, ఉత్తరముఖముగాగాని తూర్పు ముఖముగా గాని కూర్చొని మంత్రజపమును, దేవతాపూజను, ఆచరించవలెను.



గృహిణా ప్రతిమా కార్యా - శివం శశ్వదభీప్సతా ।
ఆయుశ్శ్రియం కులం ధర్మం - పుత్రానాప్నోతి తైఃక్రమాత్ ॥ 30

బిల్వవృక్షే తత్ఫలే వా - యో మాం పూజయతే నరః।
పరాం శ్రియ మిహ ప్రాప్య - మమ లోకే మహీయతే ॥ 31

బిల్వవృక్షం సమాశ్రిత్య - యో మంత్రా న్విధినా జపేత్ ।
ఏకేన దివసేనైవ - తత్పురశ్చరణం భవేత్ ॥ 32

యస్తు బిల్వవనేనిత్యం - కుటీం కృత్వా వసేన్నరః ।
సర్వేమంత్రాః ప్రసిధ్యంతి - జపమాత్రేణ కేవలమ్ ॥ 33

పర్వతాగ్రే నదీతీరే - బిల్వమూలే శివాలయే ।
అగ్నిహోత్రే కేశవస్య - సన్నిధౌ చ జపేత్తు యః॥ 34
నైవాస్య విఘ్నం కుర్వంతి - దానవా యక్షరాక్షసాః॥ 35

తం న స్పృశంతి పాపాని - శివసాయుజ్య మృచ్ఛతి।
స్థండిలే వా జలే వహ్నౌ - వాయావాకాశ ఏవ వా ॥ 36

గిరౌ స్వాత్మని వా యోమాం - పూజయేత్ప్రయతో నరః।
స కృత్స్నం ఫల మాప్నోతి - లవమాత్రేణ రాఘవ ? 37

ఆత్మపజాసమనాస్తి - పూజా రఘుకులోద్వహ ।
మత్సాయుజ్య మవాప్నోతి - చండాలోఽ ప్యాత్మపూజయా ॥ 38

సర్వా న్కామా నవాప్నోతి - మనుష్యః కంబలాసనే ।
కృష్ణాజినే భవేన్ముక్తి ర్మోక్ష - శ్రీ ర్వ్యాఘ్రచర్మణి ।
కుశాసనే భవేత్ జ్ఞాన - మారోగ్యం పత్రనిర్మితే ॥। 39

ఉదఙ్మః ముఖఃప్రాఙ్ముఖోవా - జపం పూజాం సమాచరేత్ ॥ 40

పాషాణే దుఃఖ మాప్నోతి - కాష్ఠే నానావిధాన్ గదాన్ ।
వస్త్రే శ్రియవాప్నోతి - భూమౌ మంత్రో న సిద్ధ్యతి॥ 41

రాజా! జపమాలా విధానమును చెప్పెదను. నీవు సావధానముగా వినుము. అంటూ శంకర భగవానుడు రామచంద్రునకు ఉపదేశించు చుండెను.

స్ఫటికమాల సామ్రాజ్యమును, పుత్ర జీవమాల సంపదనిచ్చును, కుశ గ్రంథుల (దర్భముడుల) మాల-ఆత్మజ్ఞానమును, రుద్రాక్షమాల సకల కోరి కల నొసగును పగడమాల లోకమును వశమొనర్చును, అమలక (ఉసరిక పండ్ల) మాల - మోక్షమును ప్రసాదించును. ముత్యాలమాల-సకల విద్యల నొసగును. మాణిక్యమాల ముల్లోకములను వశమొనర్చును. నీలమణులు, మరియు మరకతమణులమాల శత్రు భయమును పోగొట్టును.

బంగారముతో చేయబడిన మాల గొప్ప సంపదను; వెండితో చేయ బడిన మాల కోరిన కన్యను పాదరసముతో చేయబడిన మాల సకల కోరికల నొసగును.

నూటయెనిమిది (108) సంఖ్య కల్గినమాల ఉత్తమోత్తమమైనది. నూరు (100) సంఖ్య కల్గిన మాల ఉత్తమమైనది. ఏబది (50) సంఖ్య కల్గినమాల మరియు ఏబది నాలుగు (54) సంఖ్య కల్గినమాల మధ్యమమైనది. కనీసము ఇరువదియేడు (27) సంఖ్య కల్గిన మాలయైన నుండవలెను. ఇరువదియైదు (25) సంఖ్య కల్గినమాల అధమమైనది.

ఒకప్పుడు నూరు (100) సంఖ్య కల్గిన మాలయైనచో, వర్ణమాల యొక్క ఏబది అక్షరములను (అకారాది క్షకారాంతముగా) జపించవలెను. పిమ్మట ళకారమును మెరుపుగా చేసుకొని, అనులోమ ప్రతిలోమ క్రమ ముగా, వర్ణముల మాల స్థాపించవలెను. జపమాలను ఎవరికిని చూప కూడదు.



అక్షమాలావిధిం వక్ష్యే - శృణుష్వావహితో నృప ।
సామ్రాజ్యం స్ఫటికో దద్యాత్ - పుత్రజీవః పరాంశ్రియమ్ ॥ 42

ఆత్మజ్ఞానం కుశగ్రంథీ - రుద్రాక్ష స్సర్వకామదః।
ప్రవాళైశ్చ కృతామాలా - సర్వలోకవశప్రదా ॥ 43

మోక్షప్రదా చ మాలా స్యా - దామలక్యాః ఫలైః కృతా ।
ముక్తాఫలైః కృతామాలా - సర్వవిద్యాప్రదాయినీ॥ 44

మాణిక్యరచితా మాలా - త్రైలోక్యస్య వశంకరీ।
నీలై ర్మరకతైర్వాపి - కృతా శత్రుభయప్రదా ॥ 45

సువర్ణరచితా మాలా - దద్యాద్వై మహతీం శ్రియమ్ ।
తథా రౌప్యమయీ మాలా - కన్యాం యచ్ఛతి వాంఛితామ్॥
ఉక్తానాం సర్వకామానాం - దాయినీ పారదైః కృతా । 46

అష్టోత్తరశతం మాలా - తత్ర స్యాదుత్తమోత్తమా।
శతసంఖ్యోత్తమా మాలా - పంచాశన్మధ్యమా మతా ॥ 47

చతుఃపంచాశతీ యద్వా - అథమా సప్తవింశతిః।
అథమా పంచవింశత్యా - యది స్యాచ్ఛతినిర్మితా ॥ 48

పంచాశదక్షరాణ్యత్రా - నులోమ ప్రతిలోమతః।
ఇత్యేవం స్థాపయేత్స్పష్టం - న కస్మై చిత్ప్రదర్శయేత్ ॥ 49

వర్ణైవిరన్యస్తయా యస్తు - క్రియతే మాలయా జపః।
ఏకవారేణ తస్మైవ - పురశ్చర్యా కృతా భవేత్ ॥ 50

అక్షరన్యాసము చేసిన మాల అధికశక్తి కలిగియుండును. అట్టి వర్ణము లచే ఎవరు మంత్రజపము చేయుదురో; వారికి ఒక్క పర్యాయమునకే పురశ్చరణ పూర్తిచేసిన ఫలితము కలుగును.

ఎవరు యోనిముద్రాసనమునందు కూర్చొని, తదేక చిత్తముతో ఇష్ట దేవతా మంత్రజపము చేయునో, వారికి సకల సిద్ధులు కలుగును.

మంత్రశాస్త్రము ప్రకారము భిన్నరుద్ధ, స్థంభన, మారణ, మిలిత, మూర్ఛితసుప్త, మత్త, వీర్యహీన, దగ్ధ, ప్రత్యర్థి పక్ష, బాల, యౌవన, వృద్ధాది మంత్రములు ఆయా కార్యములకు ప్రసిద్ధములైనవి. ఈ మంత్రము లన్నియు యోనిముద్రయందు జపించిన వారికి సిద్ధించును. మరియొకరికి సిద్ధింపవు.

బ్రాహ్మీముహూర్తకాలము నుండి ప్రారంభించి మధ్యాహ్న కాలము వరకు మంత్రములను జపించవలెను. మధ్యాహ్నమైన తర్వాత జపించిన వినాశము కలుగును. కాని ఈ విధానము కామ్యఫలముల నొసగుమంత్ర జపమునకు, మరియు పురశ్చరణకు మాత్రమే చెప్పబడినది.

నిత్యములు, నైమిత్తికములైన కర్మలు, నిష్కామమైన తపస్సు మున్నగు వాటిని ఎల్లప్పుడు కాలనియమము లేక ఆచరింపవచ్చును. ఇందు వలన దోషములేదు.

రఘువంశములో శ్రేష్ఠుడవైన ఓరామా ! ఎవరు నిష్కామ భావముకలిగి ఇంద్రియములను నిగ్రహించి నాదు స్వరూపమును ధ్యానించుచూ రుద్రా ధ్యాయము (నమకము, చమకము)ను గాని, షడక్షరి (ఓం నమశ్శివాయ) మంత్రమునుగాని జపించెదరో; అట్లే, అథర్వశిరము (అథర్మశిరోపనిషత్తు) నుగాని, కైవల్యోపనిషత్తునుగాని పఠించెదరో; వారు ఈ దేహము నందే స్వయముగా శివస్వరూపులగుచున్నారు. అంటూ శంకర భగవానుడు విశదీకరించెను.

ఎవరు నిత్యము శ్రీ శివగీతను అధ్యయనము (పారాయణము) చేయు దురో మరియు శ్రవణము చేయుదురో, వారు సంసార బంధము నుండి విముక్తులగుదురు. అంటూ శంకరభగవానుడు రామచంద్రునకు శ్రీ శివ గీతా మహాత్మ్యమును విశదీకరించెను. పిమ్మట మహాదేవుడైన పరమశివుడు అంతర్ధానమయ్యెను.



సవ్యపాణిం గుదే స్థాప్య - దక్షిణం చ శివోపరి।
యోనిముద్రాబంధ ఏవం - భవేదాసనముత్తమమ్ ॥ 51

యోనిముద్రాసనే స్థిత్వా - ప్రజపే ద్యస్సమాహితః।
యం కంచి దపి వా మంత్రం - తస్య స్యుస్సర్వసిద్ధయః॥ 52

ఛిన్నారుద్ధాస్తం భితాశ్చ - మీలితా మూర్ఛితా స్తథా ।
సుప్తా మత్తా హీనవీర్యా -దగ్ధాః స్త్రస్తారిపక్షగాః॥ 53

బాలా యౌవనమత్తాశ్చ - వృద్ధా మంత్రాశ్చ యే మతాః।
యోనిముద్రాసనే స్థిత్వా - మంత్రానేవం విధాన్జపేత్ ॥ 54

తస్య సిద్ధ్యంతి తే మంత్రాః - నాన్యస్యతు కథంచన ॥ 55

బ్రాహ్మం ముహూర్తమారభ్య - మధ్యాహ్నం ప్రజపేన్మనుమ్ ।
అత ఊర్ధ్వం కృతే జాప్యే - వినాశో భవతి ధ్రువమ్ ॥ 56

పురశ్చర్యావిధావేవం - సర్వకామ్యఫలేష్వపి ।
నిత్యే నైమిత్తికే వాఽ తో - తపశ్చర్యాసు వాపునః॥
సర్వదైవ జపః కార్యో - న దోషస్తత్ర కశ్చన ॥। 57

యస్తు రుద్రం జపేన్నిత్యం - ధ్యాయమానో మమాకృతిమ్ ।
షడక్షరం వా ప్రణవం - నిష్కామో విజితేంద్రియః॥ 58

అథాథర్వశిరోమంత్రం - కైవల్యం వా రఘూత్తమ।
స తేనైవ హి దేహేన - శివస్సంజాయతే స్వయమ్ ॥ 59

అధీతే శివగీతాం యో - నిత్యమేతాం జపేత్తుయః
శృణుయాద్వాసముక్తస్యాత్ - సంసారాన్నాత్ర సంశయః 60

రామచంద్రుడు, తన్ను తాను కృతార్థుడనైతినని భావించెను.

సూతమహాముని:

మునీంద్రులారా! నేను మీకు శ్రీ శివగీతను బోధించితిని. ఇద్దానిని ఎవరు ఏకాగ్రచిత్తముతో పారాయణము చేయుదురో, శ్రవణము చేయుదురో అట్టివారికి ముక్తి అరచేతిలో నున్నది. కావున మీకు నిత్యము నిశ్చల భక్తితో శ్రీశివగీతను వినండి.

సులభముగా (సునాయాసముగా) మోక్షము లభించును. ఇందులో ఏ మాత్రము సందేహము లేదు. శరీరమునకు క్లేశములేదు. మనస్సునకు క్షోభలేదు. ధనమునకు నష్టములేదు. దేహమునకు పీడలేదు. శ్రీశివగీతను శ్రవణము చేయడంవలన కైవల్య రూపమగు మోక్షము లభించును. కావున ముని శ్రేష్ఠులారా! నిత్యము శ్రీ శివగీతను శ్రవణముచేసి, మననము చేయండి! అంటూ, సూత మునీంద్రుడు మంగళాశాసనము కావించెను. పిమ్మట శౌనకాది మహర్షులంతా ఈ విధముగా ప్రశంసించారు.

సూతపౌరాణికా ! ఈనాటి నుండి మాకు, నీవే ఆచార్యుడవు ! తండ్రివి! గురుడవు మాయొక్క అవిద్యను రూపుమాపి, పరమేశ్వరతత్త్వమును ప్రబోధించితివి. మమ్ము తరింపచేసితివి.

కన్నతండ్రి మరియు గురువు కంటే బ్రహ్మజ్ఞానమును కల్గించిన ఆచార్యుడే శ్రేష్ఠుడగును. కావున సూతపుత్రా! నీకంటే గురు శబ్దవాచ్యుడు మరొక్కరు మాకు లేరు. ఇది ముమ్మాటికి సత్యము అంటూ ప్రస్తుతించి, భక్తి ప్రపత్తులతో సూతమహర్షికి నమస్కరించారు. శౌనకాది మహర్షులందరూ సంతుష్టులైనారు. వారు సాయం సంధ్యోపాసన ఆచరించుటకు గాను గోమతీ నదీతీరమునకు వెడలినారు. అని వ్యాసభగవానుడు పద్మ పురాణమునందు చెప్పుచు వ్రాసెను.

ఇది వ్యాసమహర్షిచే వ్రాయబడిన పద్మపురాణమునందు శ్రీ శివరామ సంవాద రూపమగు బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, ఉపనిషత్తు అయిన శ్రీ శివగీతయందు మోక్షాధికారి యోగం అనే పదహారవ అధ్యాయం సంపూర్ణము.

-- ఓం తత్‌సత్ --



సూత ఉవాచ

**ఏవముక్త్వా మహాదేవ - స్తత్రైవాంతరధీయత।**
**రామః కృతార్థ మాత్మాన - మమన్యత తదైవ సః॥ 61**

**ఏవం మయా సమాసేన - శివగీతా సమీరితా।**
**ఏతాం యః ప్రజపేన్నిత్యం - శృణుయాద్వా సమాహితః॥ 62**

**ఏకాగ్రచిత్తో యో మర్త్యో - తస్య ముక్తిః కరే స్థితా ॥ 63**

**అత శ్శృణుధ్వం మునయో - నిత్యమేతాం సమాహితాః।**
**అనాయాసేనైవ ముక్తి ర్భవితా నాత్ర సంశయః॥ 64**

**కాయక్లేశో మనఃక్షోభో - ధనహాని ర్న చాత్మనః।**
**న పీడా శ్రవణాదేవ - యస్మా త్కైవల్యమాప్నుయాత్ ॥ 65**

**శివగీతా మతో నిత్యం - శృణుధ్వం మునిసత్తమాః।**

ఋషయ ఊచుః

**అద్య ప్రభృతి నస్సూత! త్వమాచార్యః పితా గురుః॥**
**అవిద్యాయాః పరం పారం - యస్మాత్తారయితాసి నః॥ 66**

**ఉత్పాదక బ్రహ్మదాత్రో - ర్గరీయాన్ బ్రహ్మదః పితా।**
**తస్మాత్ సూతాత్మజ! త్వత్త - స్సత్యం నాన్యోఽస్తినో గురుః॥ 67**

వ్యాస ఉవాచ

**ఇత్యుక్త్వా ప్రయయు స్సర్వే - సాయం సంధ్యా ముపాసితమ్ ।**
**స్తువంత స్సూతపుత్రంతే - సంతుష్టా గోమతీతటమ్ ॥ 68**

ఓం తత్సదితి శ్రీ పద్మపురాణే ఉత్తరఖండే శివగీతాసూఽపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీ శివ రాఘవ సంవాదే మోక్షాధికారి యోగోనామ షోడశోధ్యాయః



## గీతా మాహాత్మ్యము

(పద్మ పురాణాంతర్గతం)

పరమేశ్వరుడు - పార్వతీదేవికి గీతామాహాత్మ్యము నీవిధముగా నుప దేశించెను. ఓ దేవీ ! ఈ గీతాశాస్త్రము కన్న పరమ రహస్యమగునది వేరొకటి లేదు. ఇది సకల సంతాప హారకమును, మహాపాతక వినాశన మునై అలరారు చున్నది. ఇంకను, దీని శ్రేష్ఠత్వమును సావధానముగా వినుము.

కాలములలో నిత్యుడనగు నా (ఈశ్వరుని) వలెను, ఆవులలో కామధేనువు వలెను, మునీంద్రులలో వేదవ్యాసునివలెను, దేవతలలో దేవేంద్రునివలెను, గురువులలో బృహస్పతి వలెనను, రసములలో అమృతమువలెను, పర్వతములలో కైలాసమువలెను, నక్షత్రములలో చంద్రునివలెను, తీర్థములలో పుష్కర తీర్థమువలెను, పుష్పములలో పద్మము వలెను, పతివ్రతలలో అరుంధతి వలెను, యజ్ఞములలో అశ్వమేధము వలెను, ఉద్యానవనములలో నందనోద్యానము వలెను, రుద్రులలో వీరభద్రుని వలెను, దానములలో భూదానమువలెను, నదులలో గోదావరి వలెను, పుణ్యక్షేత్రములలో ధర్మకార్యాచరణకు బదరికాశ్ర మమువలెను, శాస్త్రములలో శివగీత మహోత్కృష్టమైనది అని శంకర భగవవానుడు గీతా మాహాత్మ్యమును విశదీకరించెను.





గీతా మాహాత్మ్యము

(పద్మ పురాణాంతర్గతం)

శ్రీ శివ ఉవాచ :

నాతః పరతరం కించిత్ - రహస్యం హంసగామిని !<br>
ఉపతాపత్రయ హరం - మహాపాతక నాశనం !<br>
యథా కాలేష్వహం నిత్యో - యథా పశుషుకామధుక్ ।<br>
యథా వ్యాసో మునీంద్రేషు - వ్యాసేషు బ్రహ్మవిత్తమః।<br>
యథా దివౌకసాం శక్రో - శుక్రాదిషు గురుర్వరః।<br>
యథా రసానాం పీయూష - ముత్తమం విశ్వవిశ్రుతం ।<br>
తథా గిరీణాం కైలాసో - యథా చేంద్రో దివౌకసాం ।<br>
తీర్థానాం పుష్కరతీర్థం - యథా పుష్పేషు పంకజం ।<br>
పతివ్రతాసు నారీషు - యథా లోకే హ్యరుంధతీ ।<br>
యథామఖేష్వశ్వమేధో - యథో ద్యానేషు నందనం ।<br>
యథా రుద్రేషు సర్వేషు - వీరభద్రో మమానుగః।<br>
యథా దానేషు భూదానం - యథా సింధుషు గౌతమీ ।<br>
యథా లోకే హరిక్షేత్రం - ప్రశంసః ధర్మకర్మసు॥

ఇతి పద్మపురాణే గీతా మహాత్మ్యం

## గీతా మాహాత్మ్యము

(వరాహ పురాణాంతర్గతం)

ఒకానొక సమయమందు భూదేవి విష్ణుసాన్నిధ్యమునకు వెళ్ళి, కృతాంజలియై విష్ణువుతో నిట్లనెను.

ఓ దేవా! ఈ సంసార సాగరమందు పూర్వజన్మ కర్మానుసారముగా ప్రారబ్ధమనుభవించు వారికి; పరమేశ్వరుని యొక్క చరణ కమలమందు భక్తి ఏ ప్రకారము కలుగునో దయయుంచి ఉపాయమును చెప్పుమని వేడుకొనెను.

విష్ణుభగవానుడు నిట్లు చెప్పెను.

నిత్యము శివగీతయగు భగవద్గీతను పఠించుటయందు యిష్టము కలవాడు ప్రారబ్ధ వశమున వచ్చిన కర్మలను అనుభవించుచున్నను, లోకమందు సుఖమును ముక్తిని పొందును. కర్మలతో ఆతనికి సంబంధము లేదు. ఏమనగా,ఘోరమైన పాపకర్మలయందు ప్రవర్తించినప్పటికి భగవద్గీతను పఠించిన యెడల, తామరాకును నీరు అంటనియట్లు ఆ మనుజుని పాపములు అంటనేరవు.

శివగీత పుస్తకముండ తావునను, పఠించు తావునను, ప్రయాగ... మున్నగు పుణ్యతీర్థము లన్నియు నివసించుచున్నవి. సర్వదేవతలు, ఋషులు, యోగులు, పన్నగులను భగవద్గీత ప్రవర్తించుచున్న స్థలమందు వేగముగ సహాయపడెదరు.

ఓ భూదేవీ ! శివగీతల అర్థవిచారణ చేయు తావునందును, పఠించు తావునందును; రామ సంకీర్తన స్థలమునందు వాయు సూనుండుడునట్లు, నిశ్చయముగా నేనెప్పుడు నుందును. అక్కడ నెట్టి యాపదలు రావు. ఒకవేళ ప్రారబ్ధవశముచే, ఏదైన కష్టము వచ్చిన యెడల నేను శీఘ్రముగా వెళ్ళి నివారణ చేతును. నేను గీతలనంటియుండుదును. గీతలే నాకు నివాసము గీతలయందు నుడువబడిన శివ జ్ఞానమును బట్టియె మూడులోకములను పాలించుచుంటివి.

గీతయనగా గాయత్ర్యర్థ ప్రతిపాదకమైన బ్రహ్మవిద్య ! 'యః పరస్సమహేశ్వరః' అనునట్లు అర్థమాత్ర రూపమైన శివ సంబంధము కలది. కనుకనే శివ శక్త్యాత్మకమైన శంకరభగవానుడు తన ప్రియశిష్యుడైన రామచంద్రునకు ఉపదేశించెను. వేదత్రయ స్వరూపమైనది. కనుక, శివగీత వేగముగా తత్త్వార్థమును కలిగించును.



## గీతా మాహాత్మ్యము

(వరాహపురాణాంతర్గతం)

ధరోవాచ :

భగవాన్ ! పరమేశాన ! భక్తి రవ్యభిచారిణీ ।
ప్రారంబ్ధం భుజ్యమానస్య – కథం భవతి హే ప్రభో ! 1

విష్ణురువాచ :

ప్రారబ్ధం భుజ్యమానోఽపి–గీతాభ్యాస రతస్సదా !
సముక్త స్స సుఖీలోకే కర్మణా నోపలిప్యతే ॥ 2
మహాపాపాది పాపాని – గీతాధ్యానం కరోతి చేత్ ।
క్వచిత్ స్పర్శం న కుర్వంతి – నళినీదళ మంభసా ॥ 3
గీతాయాః పుస్తకం యత్ర – యత్ర పాఠః ప్రవర్తతే ।
తత్ర సర్వాణి తీర్థాని – ప్రయాగాదీని తత్రవై॥ 4
సర్వే దేవాశ్చ ఋషయో – యోగినః పన్నగాశ్చయే ।
గోపాలా గోపికా వాఽపి–నారదోద్ధవ పార్షదైః॥
సహాయో జాయతే శీఘ్రం – యత్ర గీతా ప్రవర్తతే ॥ 5
యత్రగీతా విచారశ్చ – పఠనం పాఠనం శ్రుతమ్ ।
తత్రాహం నిశ్చితం పృధ్వి–నివసామి సదైవహి ॥ 6
గీతాశ్రయోఽహం తిష్ఠామి – గీతామే చోత్తమం గృహం ।
గీతాజ్ఞాన ముపాశ్రిత్య – త్రీన్లోకాన్ పాల యామ్యహం ॥ 7
గీతా మే పరమా విద్యా – బ్రహ్మరూపా న సంశయః।
అర్ధమాత్రాక్ష రా నిత్యా స్వ నిర్వాచ్య పదాత్మికా॥ 8
పాఠే ఽసమర్థ స్సంపూర్ణే – తదర్ధం పాఠ మాచరేత్ ।
తదా గోదానజం పుణ్యం – లభతే నాత్ర సంశయః॥ 9
త్రిభాగం పఠమానస్తు – గంగాస్నాన ఫలం లభేత్ ।
షడంశం జపమానస్తు – సోమయాగ ఫలం లభేత్ ॥ 10
ఏకాధ్యాయం తు యో నిత్యం – పఠతే భక్తి సంయుతః।
రుద్రలోక మవాప్నోతి – గణోభూత్వా వసే చ్ఛివమ్ ॥ 11

శివగీత, పదునారు అధ్యాయములను నిశ్చల చిత్తముతో నెవడు పారాయణముచేయునో;వాడు ఇహమందు అష్టసిద్ధులను,మరణానంతరమందు శివపదమును పొందును. సంపూర్ణ గీతను పారాయణ చేయుటకు అసమర్థుడేని ఎనిమిది అధ్యాయములను పఠించిన యెడల గోదానపుణ్యము లభించును. ఇందుకు నెంతమాత్రము సందేహములేదు. అందువలన సమర్థుడు కాడేని నాలుగు అధ్యాయములను యెవడు పఠనము చేయునో; వాడు గంగాస్నానఫలము నొందును. రెండు అధ్యాయములను పఠించువాడు సోమయాగ ఫలము నొందును. భక్తి పూర్వకముగ నొక్క అధ్యాయమును పఠించువాడు కైలాసమునకు వెడలిశంకరుని ప్రమథ గణములలో చేరి చిరకాలముండును.

ఒక్క అధ్యాయములో నొక్క శ్లోకమునుగాని, ఒక్క పాదమునుగాని, పఠించినవాడు ఒక్క మన్వంతరము వరకు సుందర మనుష్యుడై జన్మించును.

ఓ భూదేవీ ! గీతాపాఠమును నిత్యము చేయువాడు పదివేల సంవత్సరములు చంద్రలోకమందు నివాసము చేయును. గీతాపాఠము చేయుచు దేహత్యాగమును చేసినవాడు వెంటనే దివ్య శరీరమును పొందును. ఈ ప్రకారము కొన్ని జన్మలు గీతాభ్యాసమును చేసినవాడు మోక్షము పొందును.

గీతా ! గీతా ! గీతయను రెండక్షరముల నుచ్చరిస్తూ మరణించినవాడు ఉత్తమగతి నొందుచున్నాడు. ఘోరపాపియైనను గీతార్థశ్రవణమందు నిచ్చగలవాడు పరమపదమొందును. శివపరమాత్మతో కూడా ఆనంద మనుభవించును. ఈ ప్రకారము అనేక కర్మలు చేయువాడైనను, గీతార్థ తాత్పర్యములను ధ్యానించువాడు జీవన్ముక్తుడు, మరణానంతరమందు కైవల్యముక్తి నొందును.

ఓ పృథివీ ! ఈ గీత జనకాదులనేకులకు మోక్షమిప్పించినది. అందువలన గీతాపాఠము అవశ్యకర్తవ్యము. గీతాపాఠమొనరించిన తర్వాత గీతామాహాత్మ్యమును పఠింపవలెను. ఆ విధముగా చేసినవారికి యధోక్తఫలము లభించును. విధి ప్రకారము చేయనివారి పారాయణము శ్రమ మాత్రమే గాని ఫలము లేదు.

ఈ గీతా మహాత్మ్యమును సూతులవారు శౌనకాది యెనుబది యెనిమిది వేల మహర్షులకు వినిపించెను. దీనిని గీతాపారాయణము తరువాత పఠించిన యెడల మహిమ ఎక్కువ కలదు. కారణమేమనగా మనుజుడు, ఫల స్తుతి విన్న పిమ్మట, వాని చిత్తము వేడుకతో కూడియుండును. తన యొక్క అభ్యుదయమును తలపోయుచు, భక్తితో శ్రద్ధతో శివగీతను పఠనము చేయును.

ఇది వరాహపురాణమందలి సూత శౌనక సంవాదమున గీతామహాత్మ్యము సంపూర్ణము



అధ్యాయశ్లోక పాదం వా - నిత్యం యఃపఠేనరః
సయాతి నరతాం యావత్ - మనుకాలం వసుంధరే ॥ 12

గీతాయాః శ్లోకదశకం- సప్త పంచ చతుష్టయం ।
ద్వౌ త్రీనేకం తదర్ధం వా - శ్లోకానాం యః పఠేన్నరః॥ 13

చంద్రలోక మావాప్నోతి - వర్షాణా మయుతం ధ్రువమ్ ।
గీతాపాఠ సమాయుక్తో - మృతోఽ మానుషతాం వ్రజేత్ ॥ 14

గీతాభ్యాసం పునః కృత్వా - లభతే ముక్తి ముత్తమమ్ ।
గీతే త్యుచ్చార సంయుక్తో - మ్రియమాణో గతిం లభేత్ ॥ 15

గీతార్థ శ్రణాఽ సక్తో-మహాపాపయుతోఽ పివా !
కైలాసం సమవాప్నోతి - శంభునా సహమోదతే ॥ 16

గీతార్థం ధ్యాయతే నిత్యం - కృత్వా కర్మాణి భూరిశః
జీవన్ముక్త స్స విజ్ఞేయో దేహాంతే పరమం పదమ్ ॥ 17

గీతామాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః
నిర్ధూత కల్మషాలోకే గీతాయాతాః పరంపదమ్ ॥ 18

గీతాయాః పఠనం కృత్వా - మాహాత్మ్యం నైవ యఃపఠేత్ ।
వృథా పాఠో భవేత్తస్య శ్రమ ఏవ హ్యుదాహృతః॥ 19

ఏతన్మాహాత్మ్య సంయుక్తం - గీతాభ్యాసం కరోతి యః
స తత్ఫల మావాప్నోతి - దుర్లభాం గతి మాప్నుయాత్ ॥ 20

సూత ఉవాచ :

మాహాత్మ్య మేత ద్గీతాయా - మాయ ప్రోక్తం సనాతనం !
గీతాంతేచ పఠేద్యస్తు - యదుక్తం తత్ఫలం లభేత్ ॥ 21

ఇతి శ్రీ వరాహపురాణే శ్రీ గీతా మాహాత్మ్యం సంపూర్ణమ్.

## కాలభైరవాష్టకమ్

దేవరాజసేవ్యమానపావనాంఘ్రిపంకజం
వ్యాళ యజ్ఞసూత్ర మిందు శేఖరం కృపాకరమ్
నారదాది యోగిబృంద వందితం దిగంబరం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే. 1

భానుకోటి భాస్వరం భవాబ్ధితారకం పరం
నీలకంఠమీప్సితార్థదాయకం త్రిలోచనమ్
కాలకాలమంబుజాక్ష మక్షశూల మక్షరం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే. 2

శూలటంకపాశదండపాణిమాదికారణం
శ్యామకాయమాది దేవ మక్షరం నిరామయమ్
భీమవిక్రమం ప్రభుం విచిత్ర తాండవప్రియం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే. 3

భుక్తిముక్తిదాయకం ప్రశస్తచారువిగ్రహం
భక్తవత్సలం స్థితం సమస్తలోక విగ్రహమ్
నిక్వణన్మనోజ్ఞ హేమకింకిణీలసత్కటిం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే. 4

ధర్మసేతుపాలకం త్వధర్మమార్గనాశకం
కర్మపాశ మోచకం సుశర్మదాయకం విభుమ్
స్వర్ణ వర్ణ కేశపాశ శోభితాంగ మండలం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే. 5

రత్నపాదుకా ప్రభాభిరామ పాదయుగ్మకం
నిత్యమ ద్వితీయ మిష్టదైవతం నిరంజనమ్
మృత్యుదర్పనాశనం కరాళదంష్ట్ర భీషణం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే. 6

అట్టహాసభిన్న పద్మజాండకోశ సంతతిం
దృష్టిపాతనష్టపాప జాలముగ్ర నాశనమ్
అష్టసిద్ధి దాయకం కపాలమాలికాధరం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే. 7



భూతసంఘనాయకం విశాలకీర్తిదాయకం
కాశివాసిలోక పుణ్యపాపశోధకం విభుమ్
నీతిమార్గకోవిదం పురాతనం జగత్ప్రభుం
కాశికాపురాధినాథ కాలభైరవం భజే. 8

కాలభైరవాష్టకం పఠంతి యే మనోహరం
జ్ఞానముక్తి సాధనం విచిత్రపుణ్య వర్ధనమ్
శోకమోహదైన్య లోభకోప తాపనాశనం
తే ప్రయాంతి కాలభైరవాంఘ్రి సన్నిధిం ధ్రువమ్. 9

ఇతి శ్రీమచ్ఛంకరాచార్య విరచితం కాలభైరవాష్టకం సంపూర్ణమ్

## శివాపరాధక్షమాపణస్తోత్రమ్

ఆదౌకర్మప్రసంగాత్ కలయతి కలుషం మాతృకుక్షౌస్థితం
మాం విణ్మూత్రామేధ్యమధ్యే క్వథయతి నితరాం జాఠరోజాత
వేదాః యద్యద్వైతత్రదుఃఖం వ్యథయతి నితరాం శక్యతే
కేనవక్తుం క్షంతవ్యోమేపరాధశ్శివశివ శివంభో శ్రీమహాదేవ శంభో. 1

బాల్యేదుఃఖాతిరేకా న్మలలులిత వపుఃస్తన్యపానే
పిపాసానో శక్తశ్చేంద్రియేభ్యో భవగుణజనితా జంతవోమాం
తుదంతి నానారోగాదిదుఃఖాద్దురితపరవశశ్శంకరం
నస్మరామిక్షంతవ్యోశ్శివశివ శివంభో శ్రీమహాదేవ శంభో. 2

ప్రౌఢోऽహంయౌవనస్థోవిషయవిషధరైః పంచభిర్మర్మసంధౌ
దష్టోనష్టో వివేకస్సుతధనయువతి స్వాదుసౌఖ్యేనిషణ్ణః
శైవీచింతావిహీనం మమ హృదయమహో మానగర్వాధిరూఢం
క్షంతవ్యో మే పరాధశ్శివశివ శివంభో శ్రీమహాదేవ శంభో. 3

వార్థక్యే చేంద్రియాణాం వికలగతమతిశ్చాధిదైవాదితాపైః
పాపైరోగైర్వియోగైర్వ్యసనకృశతనుః జ్ఞప్తిహీనం చ దీనమ్
మిథ్యామోహాభిలాపై ర్భ్రమతి మమ మనోధూర్జటేర్ధ్యాన శూన్యం
క్షంతవ్యోమే పరాధశ్శివశివ శివంభో శ్రీమహాదేవ శంభో. 4

స్నాత్వా ప్రత్యూషకాలే స్నపనవిధివిధౌ నాహృతం గాంగతోయం
పూజార్థం వా కదాచిద్బహుతరగహనేఖండ బిల్వీదలాని
నానీతాపద్మమాలా సరసి వికసితా గంధపుష్పైస్త్వదర్థం
క్షంతవ్యోమే పరాధశ్శివశివ శివంభో శ్రీమహాదేవ శంభో. 5

దుగ్ధైర్మధ్వాజ్యయుక్తై ర్దధిగుడసహితైస్స్నాపితం నైవలింగం
నోలిప్తం చందనాద్యైః కనకవిరచితైః పూజితం నప్రసూన్యై
ధూపైః కర్పూర దీపైర్వివిధరసయుతైర్నైవ భక్ష్యోపహారైః
క్షంతవ్యోమే పరాధశ్శివశివ శివంభో శ్రీమహాదేవ శంభో. 6

నోశక్యంస్మార్తకర్మ ప్రతిపదగహనే ప్రత్యవాయాకులాఢ్యే
శ్రౌతేవార్తాకథం మే ద్విజకులవిహితే బ్రహ్మమార్గానుసారే
జ్ఞాతేతత్త్వే విచారే శ్రవణమననయోః కోనిదిధ్యాసిత వ్యః
క్షంతవ్యోమే పరాధశ్శివశివ శివంభో శ్రీమహాదేవ శంభో. 7

ధ్యాత్వా చిత్తేశివాఖ్యం ప్రచురతరధనం నైవదత్తం ద్విజేభ్యో
హవ్యం తే లక్షసంఖ్యైః హుతవహవదనే నార్పితం బీజమంత్రైః
నోదత్తం గాంగతీరే వ్రతపరిచరణే రుద్రజాప్యం నజప్తం
క్షంతవ్యోమే పరాధశ్శివశివ శివంభో శ్రీమహాదేవ శంభో. 8

నగ్నోనిస్సంగశుద్ధస్త్రిగుణవిరహితో ధ్వస్తమోహాంధకారో
నాసాగ్రే న్యస్తదృష్టిర్విదితభవగుణో నైవదృష్టిః కదాచిత్
ఉన్మత్తావస్థయా త్వాం విదితగతమతిశ్శంకరం న స్మరామి
క్షంతవ్యోమే పరాధశ్శివశివ శివంభో శ్రీమహాదేవ శంభో. 9

స్థిత్వాస్థానే సరోజే ప్రణవమయమరుత్కుంభితేసూక్ష్మ
మార్గేశాంతే దాంతే ప్రలీనే ప్రకటిత గహనేదివ్యరూపే శివాఖ్యే
లింగాగ్రే బ్రహ్మవాక్యే సకలగతతనౌ శంకరం నస్మరామి
క్షంతవ్యోమే పరాధశ్శివశివ శివంభో శ్రీమహాదేవ శంభో. 10

హృద్యం వేదాంతవేద్యం హృదయసరసిజే దీపముద్యత్ప్రకాశం
సత్యం శాంతస్వరూపం సకలమునిమనః పద్మషండైక వేద్యమ్
జాగ్రత్స్వప్నే సుషుప్తౌ త్రిగుణ పదహృతం శంకరం నస్మరామి
క్షంతవ్యోమే పరాధశ్శివశివ శివంభో శ్రీమహాదేవ శంభో. 11

చంద్రోద్భాసితశేఖరేస్మరహరేగంగాధరే శంకరే
సర్పైర్భూషితకర్ణ కంఠకుహరే నేత్రోత్థవైశ్వానరే
దంతిత్వక్కృత సుందరాంబరధరే త్రైలోక్యసారే హరే
మోక్షార్థం కురుచిత్తవృత్తిమమలాం మంత్రైస్తు కిం కర్మభి. 12

కింవాఽనేన ధనేన వాజికరిభిః ప్రాప్తేన రాజ్యేనకిం
కింవా పుత్రకళత్ర మిత్ర పశుభిర్దేహేన గేహేన కిమ్



జ్ఞాత్వైతత్క్షణ భంగురం సపదిహి త్యాజ్యం మనోదూరతః
స్వాత్మార్థం గురువాక్యతో భజమనశ్శ్రీ పార్వతీవల్లభమ్. 13

పౌరోహిత్యం రజనిచరితం గ్రామణిత్వం నియోగో
మాఠాపత్యం హ్యనృత వచనం సాక్షివాదః పరాన్నమ్
బ్రహ్మద్వేషః ఖలజనరతిః ప్రాణినాం నిర్దయత్వం
మా భూద్దేవో మమపశుపతే జన్మజన్మాంతరేషు. 14

ఆయుర్నశ్యతి పశ్యతాం ప్రతిదినం యాతి క్షయం యౌవనం
ప్రత్యాయాంతిగతాః పునర్నదివసాః కాలోజగద్భక్షకః
లక్ష్మీస్తోయతరంగ భంగ చపలా విద్యుచ్చలం జీవితం తస్మాన్మాం
కరుణాకరః కరుణయా త్వం రక్ష రక్షాధునా. 15

ఇతి శ్రీమచ్చతురధిక శతప్రబంధ నిర్మాణచాతురీధురీణ
శ్రీమదప్పయదీక్షిత విరచితం శివాపరాధ క్షమాపణ స్తోత్రం సంపూర్ణమ్.

## ద్వాదశజ్యోతిర్లింగ స్తోత్రమ్

సౌరాష్ట్రదేశే విశదేతిరమ్యే జ్యోతిర్మయం చంద్రకళావతంసమ్
భక్తిప్రదానాయ కృపావతీర్ణం తం సోమనాథం శరణం ప్రపద్యే. 1

శ్రీశైలసంగే విబుధాతిసంగే తులాద్రితుంగేఽపి ముదావసంతమ్
తమర్జునం మల్లికపూర్వమేకం నమామి సంసారసముద్రసేతుమ్. 2

అవంతికాయాం విహితావతారం ముక్తిప్రదానాయచ సజ్జనానామ్
అకాలమృత్యోః పరిరక్షణార్థం వందే మహాకాళ మహాసురేశమ్. 3

కావేరికానర్మదయోః పవిత్రేసమాగమేసజ్జనతారణాయ
సదైవ మాంధాతృపురే వసంత మోంకారమీశం శివమేక మీడే. 4

పూర్వోత్తరే ప్రజ్వలికానిధానే సదా వసంతం గిరిజాసమేతమ్
సురాసురారాధితపాదపద్మం శ్రీవైద్యనాథం తమహం నమామి. 5

యామ్యేసదంగే నగరేఽతిరమ్యే విభూషితాంగం వివిధైశ్చభోగైః
సద్భక్తిముక్తిప్రదమీశమేకం శ్రీనాగనాథం శరణం ప్రపద్యే. 6

మహాద్రిపార్శ్వే చ తటే రమంతం సంపూజ్యమానం సతతం మునీంద్రైః
సురాసురైర్యక్షమహోరగాద్యైః కేదారమీశం శివమేకమీడే. 7

సహ్యాద్రిశీర్షే విమలే వసంతం గోదావరీతీరపవిత్రదేశే
యద్దర్శనాత్పాతకమాశు నాశం ప్రయాతి తంత్ర్యంబకమీశమీడే. 8

సుతామ్రపర్ణీ జలరాశియోగే నిబద్ధ్య సేతుం విశిఖైరసంఖ్యైః
శ్రీరామచంద్రేణ సమర్పితం తం రామేశ్వరాఖ్యం నియతం నమామి. 9
యం డాకినీశాకినికాసమాజైః నిషేవ్యమాణం పిశితాశనైశ్చ
సదైవ భీమాదిపదప్రసిద్ధిం త శంకరం భక్తహితం నమామి. 10
సానందమానందవనే వసంత మానందకందం హతపాపబృందమ్
వారాణసీనాథమనాథనాథ శ్రీవిశ్వనాథం శరణం ప్రపద్యే. 11
ఇళాపురే రమ్యవిశాలకేఽస్మిన్సముల్లసంతం చ జగద్వరేణ్యమ్
వందే మహోదారతరస్వభావం ఘృష్ణేశ్వరాఖ్యం శరణం ప్రపద్యే. 12
జ్యోతిర్మయద్వాదశలింగకానాం శివాత్మనాం ప్రోక్తమిదం క్రమేణ
స్తోత్రం పఠిత్వా మనుజోఽతిభక్త్యా ఫలం తదాలోక్యానిశం భజేచ్చ. 13

## అథ ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రము

సౌరాష్ట్రే సోమనాథం చ శ్రీశైలే మల్లికార్జునం ।
ఉజ్జయిన్యామ్ మహాకాళం ఓంకారే అమరేశ్వరం ॥
ప్రజ్వల్యాం వైద్యనాథంచ డాకిన్యాం భీమశంకరం।
సేతుబంధేతు రామేశం నాగేశం దారుకావనే ॥
వారాణస్యాంతు విశ్వేశం త్ర్యంబకం గౌతమీతటే ।
హిమాలయేతు కేదారం ఘృష్ణేశంచ శివాలయే ॥
ఏతాని జ్యోతిర్లింగాని సాయం ప్రాతః పఠేన్నరః।
సప్తజన్మ కృతం పాపం స్మరణేన వినశ్యతి ॥

## శ్రీ నవగ్రహ స్తోత్ర రత్నములు

శ్లో॥ జపాకుసుమ సంకాశం । కాశ్యపేయం మహాద్యుతిం
తమోరిం సర్వపాపఘ్నం । ప్రణతోస్మి దివాకరం
రుద్రాభిషేకం–జపసంఖ్య 6 వేలు దానం–గోధుమలు, సువర్ణం

శ్లో॥ దధిశంఖ తుషారాభం । క్షీరోదార్ణవ సంభవం
నమామి శశినం సోమం శంభోర్మకుట భూషణం
దుర్గాపూజ–జపసంఖ్య 10 వేలు దానం–బియ్యం–వస్త్రం–వెండి

శ్లో॥ ధరణీగర్భ సంభూతం । విద్యుత్కాంచన సన్నిభం
కుమారం శక్తిహస్తం చ।మంగళం ప్రణమామ్యహమ్।
సుబ్రహ్మణ్య పూజ జపసంఖ్య 7 వేలు దానం – కందులు



శ్లో॥ ప్రియంగు కళికాశ్యామం । రూపేణ ప్రతిమం బుధం
సౌమ్యం సత్వగుణోపేతం తం బుధం ప్రణమామ్యహం
శ్రీ మహావిష్ణు పూజ – జపసంఖ్య 17 వేలు దానం – పెసలు

శ్లో॥ దేవానాం చ ఋషీణాం చ । గురుం కాంచన సన్నిభం
బుద్ధిమంతం త్రిలోకేశం।తం నమామి బృహస్పతిం
నమకపారాయణ – జపసంఖ్య 16 వేలు దానం – శనగలు.

శ్లో॥ హిమకుంద మృణాలాభం । దైత్యానాం పరమం గురుం।
సర్వశాస్త్ర ప్రవక్తారం । భార్గవం ప్రణమామ్యహం.
మహాలక్ష్మి పూజ – జపం 20 వేలు దానం – బొబ్బర్లు.

శ్లో॥ నీలాంజన సమాభాసం । రవిపుత్రం యమాగ్రజం
ఛాయా మార్తాండ సంభూతం । తం నమామి శనైశ్చరం
ఈశ్వరాభిషేకం – జపం 19 వేలు. దానం–నువ్వులు–తైలం.

శ్లో॥ అర్ధకాయం మహావీరం । చంద్రాదిత్యాది మర్దనం
సింహికాగర్భ సంభూతం । రాహుం తం ప్రణమామ్యహం.
దుర్గాపూజ – జపం 18 వేలు. దానం – మినుములు.

శ్లో॥ ఫలాశ పుష్ప సంకాశం । తారకాగ్రహ మస్తకం
రౌద్రం రుద్రాత్మజం ఘోరం తం కేతుం ప్రణమామ్యహం
సూర్యనమస్కారం – జపం 7 వేలు. దానం – ఉలవలు.

## ఆదిత్య హృదయము

### ధ్యానం

ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీ నారాయణ స్సరసిజాసన సన్నివిష్టః
కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ హారీ హిరణ్మయ వపుర్ధృత శంఖచక్రః

### స్తోత్రమ్

తతోయుద్ధ పరిశ్రాంతం। సమరేచింతయా స్థితమ్
రావణం చాగ్రతో దృష్ట్వా । యుద్ధాయ సముపస్థితమ్ 1
దైవతైశ్చ సమాగమ్య ద్రష్టు మభ్యాగతో రణమ్
ఉపాగమ్యాఽబ్రవీద్రామ మగస్త్యో భగవన్ ఋషిః 2
రామ రామ మహాబాహో శృణు గుహ్యం సనాతనమ్
యేన సర్వానరీన్ వత్స సమరే విజయిష్యసి 3
ఆదిత్య హృదయం పుణ్యం సర్వశత్రు వినాశనమ్
జయావహం జపేన్నిత్య మక్షయం పరమం శివమ్ 4

సర్వమంగళ మాంగళ్యం సర్వపాప ప్రణాశనమ్
చిన్తాశోక ప్రశమన మాయుర్వర్ధన ముత్తమమ్ 5
రశ్మిమన్తం సముద్యన్తం దేవాసుర నమస్కృతమ్
పూజయస్వ వివస్వన్తం భాస్కరం భువనేశ్వరమ్ 6
సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః
ఏషదేవాసుర గణాన్ లోకాన్ పాతి గభస్తిభిః 7
ఏషబ్రహ్మా చ విష్ణుశ్చః శివస్కందః ప్రజాపతిః
మహేంద్రో ధనదః కాలోయమస్సోమోహ్యపాంపతిః 8
పితరో పసవ స్సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః
వాయుర్వహ్నిః ప్రజాః ప్రాణా ఋతుకర్తా ప్రభాకరః 9
ఆదిత్య సవితా సూర్యః ఖగః పూషాగభస్తిమాన్
సువర్ణ సదృశోభానుః స్వర్ణరేతా దివాకరః 10
హరిదశ్వ స్సహస్రార్చి సప్తసప్తి ర్మరీచిమాన్
తిమిరోన్మథన శ్శంభు స్త్వష్టా మార్తాండ అంశుమాన్ 11
హిరణ్యగర్భ శ్శిశిర స్తపనో భాస్కరో రవిః
అగ్నిగర్భో౽దితేః పుత్ర శ్శంఖ శ్శిశిరనాశనః 12
వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజు స్సామ పారగః
ఘనవృష్టి రపాంమిత్రో వింధ్యవీథీ ప్లవంగమః॥ 13
ఆతపీ మండలీ మృత్యుః పింగళ స్సర్వతాపనః
రవి(కవి)ర్విశ్వో మహాతేజా రక్తః స్సర్వభవోద్భవః 14
నక్షత్ర గ్రహతారాణా మధిపో విశ్వభావనః
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మ నమోస్తుతే 15
నమః పూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః 16
జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః
నమో నమ స్సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః 17
నమః ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః
నమః పద్మప్రబోధాయ మార్తాండాయ నమో నమః 18
బహ్మేశానా౽చ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః 19
తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయా మితాత్మనే
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః 20
తప్త చామీకరా భాయ వహ్నాయే విశ్వకర్మణే
సమస్తమో౽భి విఘ్నాయ రవయే(రుచయే) లోకసాక్షిణే 21
నాశయ త్యేషవై భూతం తథైవ సృజతి ప్రభుః
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః 22
ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః
ఏషచైవాగ్ని హోత్రంచ ఫలం చైవాగ్నిహోత్రిణామ్ 23



వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవచ
యాని కృత్యాని లోకేషు సర్వఏష రవిః ప్రభుః 24
ఏవమాపత్సుకృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ
కీర్తయన్ పురుషః కశ్చి న్నావసీదతి రాఘవ 25
పూజయస్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిమ్
ఏత త్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి 26
అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి
ఏవముక్త్వా తథాగస్త్యో జగామ చ యథాగతమ్ 27
ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకో౽భవత్తదా
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్ 28
ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వా తు పరం హర్షమవాప్తవాన్
త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్ 29
రావణంప్రేక్ష్య హృష్టాత్మాయుద్ధాయ సముపాగమత్
సర్వయత్నేన మహతావధే తస్యధృతో (తో)౽భవత్ 30
అథరవిరవద న్నిరీక్ష్య రామం ముదితమనాః పరమం ప్రహృష్యమాణః
నిశిచరపతి సంక్షయం విదిత్వా సురగణ మధ్యగతో వచ స్త్వరేతి. 31

## మృత్యుంజయ స్తోత్రమ్

**నందికేశ్వర ఉవాచ :**

కైలాసస్యోత్తరే శృంగే శుద్ధస్ఫటికసన్నిభే
తమోగుణవిహీనే తు జరామృత్యువివర్జితే 1
సర్వతీర్థాస్పదాధారే సర్వజ్ఞానకృతాలయే
కృతాంజలిపుటో బ్రహ్మాధ్యానశీలస్సదాశివమ్. 2
పప్రచ్ఛప్రణతో భూత్వా జానుభ్యామవనిం గతః
సర్వార్థసంపదాధారో బ్రహ్మాలోకపితామహః 3

**బ్రహ్మోవాచ :**

కేనోపాయేన దేవేశ చిరాయుర్లోమశో౽భవత్
తన్మేబ్రూహి మహేశాన లోకానాం హితకామ్యయా. 4

**శ్రీసదాశివ ఉవాచ :**

శృణుబ్రహ్మ న్ప్రవక్ష్యామి చిరాయుర్మునిసత్తమః
సంజాతో వర్మణా యేన వ్యాధిమృత్యువివర్జితః 5
తస్మిన్నే కార్ణవే ఘోరేసలిలౌఘపరిప్లుతే
కృతాంతభయనాశాయస్తుతో మృత్యుంజయశ్శివః 6
తస్య సంకీర్తనా న్నిత్యం మర్త్యో మృత్యువివర్జితః
త్వమేవ కీర్తయ బ్రహ్మన్మృత్యుం జేతుం న సంశయః 7

**లోమశ ఉవాచ :**

ఓం దేవాదిదేవ దేవేశ సర్వప్రాణభృతాం వర
ప్రాణినామపి నాథస్త్వం మృత్యుంజయ నమోఽస్తుతే. 8
దేహినాం జీవభూతోఽసి జీవో జీవస్య కారణమ్
జగతాం రక్షకస్త్వం వై మృత్యుంజయ నమోఽస్తుతే 9
హేమాద్రిశిఖరాకార సుధావీచిమనోహర
పుండరీక పరంజ్యోతి ర్మృత్యుంజయ నమోఽస్తుతే. 10
ధ్యానాధార మహాజ్ఞాన సర్వజ్ఞానైకకారణ
పరిత్రాతాసి లోకానాం మృత్యుంజయ నమోఽస్తుతే. 11
నిహతా యేన కాలేన సదేవాసురమానుషాః
గన్ధర్వాప్సరసశ్చైవ సిద్ధవిద్యాధరా స్తథా. 12
సాధ్యాశ్చ వసవోరుద్రా స్తథాశ్వినిసుతావుభౌ
మరుతశ్చదిశో నాగాః స్థావరా జంగమాస్తథా. 13
యేధ్యాయంతి పరాం మూర్తిం పూజయస్త్వమరాధిప
న తే మృత్యువశం యాంతి మృత్యుంజయ నమోఽస్తుతే. 14
త్వమోంకారోఽసి వేదానాం దేవానాం చ సదాశివః
ఆధారశక్తి శ్శక్తీనాం మృత్యుంజయ నమోస్తుతే 15
స్థావరే జంగమే వాపి యావత్తిష్ఠతి మేదినీ
జీవత్విత్యాహ లోకోఽయం మత్యుంజయ నమోఽస్తుతే. 16
సోమసూర్యాగ్ని మధ్యస్థ వ్యోమవ్యాపిన్సదాశివః
కాలత్రయ మహాకాల మృత్యుంజయ నమోఽస్తుతే. 17
ప్రబుద్ధే చాప్రబుద్ధే చ త్వమేవ సృజసే జగత్
సృష్టిరూపేణ దేవేశ మృత్యుంజయ నమోఽస్తుతే. 18
వ్యోమ్ని త్వం వ్యోమరూపోఽసి తేజస్సర్వత్ర తేజసి
ప్రాణినాం జ్ఞానరూపోఽసి మృత్యుంజయ నమోఽస్తుతే. 19
జగజ్జీవో జగత్ప్రాణః స్రష్టా త్వం జగతః ప్రభుః
కారణం సర్వతీర్థానాం మృత్యుంజయ నమోఽస్తుతే. 20
నేతా త్వమింద్రియాణాం చ సర్వజ్ఞాన ప్రబోధకః
సాంఖ్యయోగశ్చ హంసశ్చ మృత్యుంజయ నమోఽస్తుతే. 21
రూపాతీత స్సురూపశ్చ పిండస్థా పదమేవచ
చతుర్విధ ఫలాధార మృత్యుంజయ నమోఽస్తుతే. 22



రేచకే వహ్నిరూపోఽసి సోమరూపోసి పూరకే
కుంభకే శివరూపోఽసి మృత్యుంజయ నమోఽస్తుతే. 23
క్షయం కరోతి పాపానాం పుణ్యానామపి వర్ధనమ్
హేతుస్త్వం శ్రేయసాన్నిత్యం మృత్యుంజయ నమోఽస్తుతే 24
సర్వమాయాకళాతీత సర్వేంద్రియపరావర
సర్వేంద్రియకలాధీశ మృత్యుంజయ నమోఽస్తుతే. 25
రూపం గంధో రసః స్పర్శ శ్శబ్దస్సంస్కార ఏవచ
త్వత్తః ప్రకాశ ఏతేషాం మృత్యుంజయ నమోఽస్తుతే. 26
చతుర్విధానాం సృష్టీనాం హేతుస్త్వం కారణేశ్వర
భావాభావపరిచ్ఛిన్న మృత్యుంజయ నమోఽస్తుతే. 27
త్వమేకో నిష్కళో లోకే సకలం భువనత్రయమ్
అతిసూక్ష్మాతిరూపస్త్వం మృత్యుంజయ నమోఽస్తుతే. 28
త్వం ప్రబోధస్త్వమాధార స్త్వద్బీజం భువనత్రయమ్
సత్త్వంరజస్తమస్త్వం హి మృత్యుంజయ నమోఽస్తుతే. 29
త్వం సోమస్త్వం దినేశశ్చ త్వమాత్మా ప్రకృతేః పరః
అష్టత్రింశత్కలానాథ మృత్యుంజయ నమోఽస్తుతే. 30
సర్వేన్ద్రియాణామాధార స్సర్వభూతగణాశ్రయః
సర్వజ్ఞానమయస్త్వం మృత్యుంజయ నమోఽస్తుతే. 31
త్వమాత్మా సర్వభూతానాం గుణానాం త్వమధీశ్వరః
సర్వానన్దమయాధార మృత్యుంజయ నమోఽస్తుతే. 32
త్వం యజ్ఞ స్సర్వయజ్ఞానాం త్వం బుద్ధిర్బోధలక్షణా
శబ్దబ్రహ్మ త్వమోంకారో మృత్యుంజయ నమోఽస్తుతే. 33

**శ్రీ సదాశివ ఉవాచ :**

ఏవం సంకీర్తయేద్యస్తు శుచిస్తద్గతమానసః
భక్త్యా శృణోతి యో బ్రహ్మన్న స మృత్యువశోభవేత్. 34
న తు మృత్యుభయం తస్య ప్రాప్తకాలం చ లంఘయేత్
అపమృత్యుభయం తస్య ప్రణశ్యతి న సంశయః 35
వ్యాధయో నోపపద్యంతే నోపసర్గభయం భవేత్
ప్రత్యాసన్నాన్తరే కాలే శతైకావర్తనే కృతే. 36

మృత్యుర్నజాయతే తస్య రోగాన్ముచ్యతి నిశ్చితమ్
పంచమ్యాం వాదశమ్యాంవాపౌర్ణమాస్యామథాపివా. **37**
శతమావర్తయే ద్యస్తు శతవర్షం స జీవతి
తేజస్వీ బలసంపన్నో లభతే శ్రియముత్తమామ్. **38**
త్రివిధం నాశయేత్పాపం మనోవాక్కాయసంభవమ్
అభిచారాణి కర్మాణి కర్మాణ్యాథర్వణాని చ **39**
ఇదం రహస్యం పరమం దేవదేవస్య శూలినః
దుఃస్వప్న నాశనం పుణ్యం సర్వవిఘ్నవినాశనమ్. **40**

ఇతి శ్రీనృసింహపురాణే శివబ్రహ్మసంవాదే మార్కండేయకృతం
మృత్యుంజయస్తోత్రమ్

## లింగాష్టకమ్

బ్రహ్మమురారి సురార్చితలింగం నిర్మల భాసిత శోభితలింగం
జన్మజదుఃఖ వినాశకలింగం తత్ప్రణమామి సదాశివలింగం 1
దేవముని ప్రవరార్చితలింగం కామదహన కరుణాకరలింగం
రావణదర్ప వినాశకలింగం తత్ప్రణమామి సదాశివలింగం 2
సర్వసుగంధి సులేపితలింగం బుద్ధివివర్ధన కారణలింగం
సిద్ధసురాసుర వందితలింగం తత్ప్రణమామి సదాశివలింగం 3
కనకమహామణి భూషితలింగం ఫణిపతివేష్టిత శోభిత లింగం
దక్షసుయజ్ఞ వినాశనలింగం తత్ప్రణమామి సదాశివలింగం 4
కుంకుమచందన శోభితలింగం పంకజహార సుశోభిత లింగం
సంచితపాప వినాశనలింగం తత్ప్రణమామి సదాశివలింగం 5
దేవగణార్చిత సేవితలింగం భావైర్భక్తిభి రేవచలింగం
దినకరకోటి ప్రభాకరలింగం తత్ప్రణమామి సదాశివలింగం 6
అష్టదళోపరి వేష్టితలింగం సర్వసముద్భవ కారణలింగం
అష్టదరిద్ర వినాశకలింగం తత్ప్రణమామి సదాశివలింగం 7
సురగురు సురవరపూజిత లింగం సురవనపుష్ప సదార్చితలింగం
పరమపదంపరమాత్మకలింగం తత్ప్రణమామి సదాశివలింగం 8
లింగాష్టక మిదంపుణ్యం యఃపఠేచ్ఛివసన్నిధౌ
శివలోక మవాప్నోతి శివేన సహమోదతే. 9



## బిల్వాష్టకమ్

త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రం చ త్రియాయుధం
త్రిజన్మ పాపసంహారం ఏకబిల్వం శివార్పణమ్ **1**
త్రిశాఖైర్బిలపత్రైశ్చ అచ్ఛిద్రైః కోమలై శ్శుభైః
శివపూజాం కరిష్యామి ఏకబిల్వం శివార్పణమ్. **2**
దర్శనం బిల్వవృక్షస్య స్పర్శనం పాపనాశనమ్
అఘోరపాపసంహారం ఏకబిల్వం శివార్పితమ్ ॥ **3**
సాలగ్రామేషు విప్రేషు తటాకే వనకూపయోః
యజ్ఞకోటి సహస్రాణాం ఏకబిల్వం శివార్పితమ్ ॥ **4**
దంతకోటి సహస్రేషు అశ్వమేథశతానిచ
కోటికన్యాప్రదానేన ఏకబిల్వం శివార్పితమ్ ॥ **5**
ఏకం చ బిల్వపత్రైశ్చ కోటియజ్ఞ ఫలం లభేత్
మహాదేవైశ్చ పూజార్థం ఏకబిల్వం శివార్పితమ్ ॥ **6**
కాశీక్షేత్రే నివాసంచ కాలభైరవ దర్శనమ్
గాయప్రయాగ మే దృష్ట్వా ఏకబిల్వం శివార్పితమ్ ॥ **7**
ఉమయా సహ దేవేశం వాహనం నందిశంకరమ్
ముచ్యతే సర్వపాపేభ్యో ఏకబిల్వం శివార్పితమ్ ॥ **8**

## విశ్వరూప పరమేశ్వర స్తుతి

**ఋషయః :**

త్వామేకమీశం పురుషం పురాణం ప్రాణేశ్వరం రుద్రమనంతయోగమ్
సర్వేనమామో హృదిసన్నివిష్టం ప్రచేతసం బ్రహ్మమయం పవిత్రమ్. **1**
త్వాం పశ్యంతిమునయో బ్రహ్మయోనిం శ్రాంతాశ్శాంతా హృదయేరుక్మవర్ణమ్
ధ్యాత్వాత్మస్థమచలంతే శరీరేకవింపరేభ్యః పరమం పరంచ. **2**
త్వత్తః ప్రసూతాజగతః ప్రసూతిస్సర్వాత్మభూస్త్వం పరమాత్మభూతః
అణోరణీయాన్ మహతో మహీయాన్ త్వామేవ సర్వం ప్రవదంతి సంతః**3**
హిరణ్యగర్భో జగదంతరాత్మా త్వత్తోహితః పురుషః పురాణః
సజాయామానో భగవాన్విసృష్టో యథా విధానం సకలం ససర్జ. **4**
త్వత్తోవేదా స్సకలాస్సంప్రసూతా స్త్వయ్యేవాం తేసంస్థితింతే లభంతే
పశ్యామస్త్వాం జగతో హేతు భూతం నృత్యన్తం స్వే హృదయే సన్నివిష్టమ్. **5**
బ్రహ్మైవేదం భ్రామ్యతే బ్రహ్మచక్రం మాయావీత్వం జగతా మేకనాథః
నమామస్త్వాం శరణం సంప్రపన్నాస్సంవిత్పతిం దివ్యనృత్తే ప్రవృత్తమ్. **6**

పశ్యామస్త్వాం పరమాకాశమధ్యే నృత్యంతం తే మహిమానంస్మరామః
సర్వాత్మానం బహుధా సన్నివిష్టం బ్రహ్మానందం చానుభూయానుభూయ. 7
ఓంకారస్త్వం వాచకోముక్తిబీజం త్వమక్షరం ప్రకృతౌగూఢరూపః
తత్వాతీతం ప్రవదంతీహ సంతస్స్వయంప్రభం భవతోపశ్యరూపమ్. 8
స్తువంతి త్వాం సర్వత స్సర్వవేదాః నమంతి త్వామృషయఃక్షీణదోషాః
శాంతాత్మానం సత్యసంధం వరిష్ఠం విశంతి త్వాంయతయోబ్రహ్మనిష్ఠా. 9
ఏకోవేదో బహుశాఖో హ్యనంతోత్వామేవైకంబోధయ త్యేకరూపమ్
వేద్యంతం త్వాం శరణం యే ప్రపన్నాస్తేషాం ముక్తిశ్శాశ్వతీ నేతరేషామ్. 10
భవానీశోఽ నాదిమాంస్తేజసాత్మా బ్రహ్మావిష్ణుః పరమేష్ఠీ వరిష్ఠః
స్వాత్మానందమనుభూయానుభూయ శేతే స్వయంజ్యోతిరచలో నిత్యముక్తః
ఏకోరుద్రస్త్వం కరోషీహవిశ్వం త్వం పాలయస్యఖిలం విశ్వరూపః
త్వయ్యేవాంతే విలయం విందతీదం నమామస్త్వాంశరణంసంప్రపన్నాః 12
త్వామేకమాహుః కవిమేకరుద్రం ప్రాణం బృహంతం హరిమగ్నిమీశమ్
ఇంద్రం మృత్యుమఖిలం చేకితానంధాతారమాదిత్యమనేకరూపమ్. 13
త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరంనిదానమ్
త్వమవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా సనాతనస్త్వం పురుషోత్తమోఽ సి. 14
త్వమేవ విష్ణుశ్చతురాననస్త్వవం త్వమే రుద్రో భగవానపీశః
త్వం విశ్వనాభిః ప్రకృతిః ప్రతిష్ఠాసర్వేశ్వరస్త్వం పరమేశ్వరోఽ సి. 15
త్వామేకమాహుః పురుషం పురాణమాదిత్యవర్ణం తమసఃపరస్తాత్
చిన్మాత్రమవ్యక్త మనంత రూపం త్వం బ్రహ్మశూన్యం ప్రకృతిర్గుణశ్చ. 16
యదంతరాసర్వమిదం విభాతి యదవ్యయం నిర్మలమేకరూపమ్
కిమప్యచింత్యం తవరూపమేత త్తదంతరాయత్ప్రతిభాతి తత్త్వమ్. 17
యోగేశ్వరం రుద్ర మనంతశక్తిం పరాయణం బ్రహ్మతనుం పురాణమ్
సర్వే నమామశ్శరణార్థినస్త్వాం ప్రసిద్ధభూతేశపతే మహేశ. 18
త్వత్పాదపద్మ స్మరణాదశేష సంసారబీజంవిలయం ప్రయాతి
మనోనియమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయామోవయమేకమీద్యమ్. 19
నమోఽ స్తురుద్రాయ కపర్దినేతే నమోమహాదేవనమశ్శివాయ

ఇతి శ్రీ కూర్మపురాణే ఉత్తరభాగే సనకాదికృత శ్రీవిశ్వరూపశివస్తుతిః



## పారాయణంగ శివ పంచాక్షరీ జప విధానము

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్।
ప్రసన్న వదనం ధ్యాయే సర్వవిఘ్నోపశాంతయే ।
అగజానన పద్మార్కం గజానన మహర్నిశమ్ ।
అనేకదంతం భక్తానాం ఏకదంతముపాస్మహే ॥

అని పఠించి గణపతికి నమస్కారముచేయవలయును. తరువాత మూడు సార్లు ఆచమనము చేయవలెను. ఆచమనము చేయునపుడు చూపుడువేలుగాని, ఉంగరము వేలుగాని మడిచి చేతిని దొప్పవలె ఉంచవలెను. దానియందు ఒక ఉద్ధరణితో నీళ్ళువేసి ఓం కేశవాయ స్వాహా అని చెప్పుచు మొదటి పర్యాయమునోటిలోనికి నీరు తీసుకొనవలెను. అదే విధముగా ద్వితీయ పర్యాయము ఓం నారాయణాయ స్వాహా అని చెప్పుచు నోటిలోనికి నీరు తీసుకొనవలెను. మూడవపర్యాయమును చేతిని దొప్పవలె నుంచి ఓం మాధవాయస్వాహా అని పలుకుచు నోటిలోనికి నీరు తీసుకొనవలెను. తరువాత చేతులు జోడించి భగవంతుని నామము క్రింది విధముగా పలుకవలెను. ఓం గోవిందాయనమః ఓం విష్ణవే నమః ఓం మధుసూదనాయ నమః ఓం త్రివిక్రమాయ నమః, ఓం వామనాయ నమః ఓం శ్రీధరాయనమః ఓం హృషీకేశాయనమ ఓం పద్మనాభాయనమః ఓం దామోదరాయ నమః ఓం సంకర్షణాయ నమః ఓం వాసుదేవాయనమః ఓం ప్రద్యుమ్నాయనమః ఓం అనిరుద్ధాయనమః ఓం పురుషోత్తమాయనమః ఓం అధోక్షజాయ నమః ఓం నారసింహాయ నమః ఓం అచ్యుతాయనమః ఓం జనార్దనాయ నమః ఓం ఉపేంద్రాయనమః ఓం హరయే నమః ఓం శ్రీకృష్ణాయ నమః (ప్రాణాయామ విధానము గురువులవద్ద నేర్చవలెను.) క్రింది విధము కేవలము లౌకికమే తరువాత ముక్కుపట్టుకొని ప్రాణాయామము చేయుము ప్రాణాయామము చేయునపుడు క్రింది విధముగా పలుకుము. ఓం ప్రణవస్య పరబ్రహ్మఋషిః పరమాత్మా దేవతా సుతలంఛందః దైవీగాయత్రీఛందః ప్రాణాయామేవినియోగః ఓం భూః ఓం భువః ఓంసువః ఓంమహః ఓం జనః ఓం తపః ఓం సత్యం ఓం తత్స వితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ఓమాపో జ్యోతీరసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం (ముక్కువదలుము, తరువాత క్రింది విధముగా సంకల్పము చేయుము శుభే శోభనే ముహూర్తే అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్థే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే

జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణదిగ్భాగే శ్రీశైలస్య ....భాగే శ్రీకృష్ణాకావేర్యోః ...ప్రదేశే...గృహే అస్మిన్ వర్తమానేన వ్యావహారిక చంద్ర మానేన..నామ సంవత్సరే...ఆయనే...ఋతౌ...మాసే ...పక్షే..తిథౌ...వాసర యుక్తాయాం శుభనక్షత్ర శుభయోగ శుభకరణ ఏవం గుణవిశేషణ విశిష్టా యాం శుభతిథౌ మమ శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శ్రీ శివనామ సహస్ర పారాయణాంగ భూత యథాశక్తి శివపంచాక్షరీ మంత్ర జపం కరిష్యే. (నీళ్ళు వదలవలయును.) ఇచట కొందరు పరమాత్మ ధ్యానము చేతురు. ఇది కేవలము సంప్రదాయమే) శ్రీ సదా శివస్వరూప వామదేవఋషిః దేవతా అని అనునపుడు శిరస్సుపై హస్తమునుంచవలెను. ఛందః అని అనునపుడు నోటిపై హస్తమునుంచుము. బీజమ్ అని అనునపుడు కుడిరొమ్ముపై హస్త మునుంచవలెను. శక్తిః అని అనునపుడు ఎడమరొమ్ముపై తరువాత పూర్తి హస్తమునుంచవలెను. కీలకమ్ అని అనునపుడు కుడిచేతి రెండవవేలును ఎడమచేతి రెండవ వ్రేలితో తాకించవలెను. పంక్తీఛందః శ్రీ సదాశివోదేవతా ఓం బీజం ఓం నమః శక్తి, ఓం శివాయేతి కీలకం మమ శ్రీ సాంబసదా శివప్రీత్యర్థే జపే వినియోగః

**కరన్యాసః**

ఓం ఓం సర్వజ్ఞ శక్తిధామ్నే అంగుష్ఠాభ్యాం నమః
ఓం నం నిత్యశక్తి ధామ్నే తర్జనీభ్యాం నమః
ఓం మం అనాది బోధశక్తి ధామ్నే మధ్యమాభ్యాం నమః
ఓం శిం స్వతంత్రశక్తి ధామ్నే అనామికాభ్యాం నమః
ఓం వాం (వం) నిత్యలుక్త శక్తి ధామ్నే కనిష్ఠికాభ్యాం నమః
ఓం యం అనంతశక్తి ధామ్నే - కరతల కరపృష్ఠాభ్యాం నమః

**హృదయన్యాసః**

ఓం ఓం సర్వజ్ఞశక్తిధామ్నే - హృదయాయ నమః
ఓం నం నిత్యశక్తిధామ్నే - శిరసే స్వాహా
ఓం మం అనాది బోధశక్తి ధామ్నే - శిఖాయైవషట్
ఓం శిం స్వతంత్ర శక్తిధామ్నే - కవచాయ హుం
ఓం వం (వాం) నిత్యలుక్తశక్తిధామ్నే - నేత్రత్రయా వౌషట్
ఓం యం అనంతశక్తిధామ్నే - అస్త్రాయఫట్
ఓం భూర్భువస్సువరోం ఇతి దిగ్బంధః - ధ్యానం



**ధ్యాన శ్లోకము**

**చంద్రోద్భాసితశేఖరేస్మరహరే గంగాధరే**
**సర్పైః భూషిత కంఠకర్ణవివరే నేత్రోత్థ వైశ్వానరే**
**దంతిత్వక్కృత సుందరాలంబరధరే త్రైలోక్యసారేహరే**
**మోక్షార్థం కురుచిత్త వృత్తి మమలాం అన్యైస్తుకింకర్మభిః**

(చంద్రునిచే ప్రకాశించు జటాజూటముగలవాడును, మన్మథుని నశింప జేసినవాడును, గంగాధరుడును, శుభకరుడును, మెడయందు చెవితూము యందు పాములను ఆభరణములుగా ధరించిన వాడును, వైశ్వానరాగ్ని మూడవ నేత్రముగా గలవాడును, గజచర్మముచే అందముగా కప్పడేవాడు, త్రిలోకసారుడును, భక్తుల పాపతాప అజ్ఞానముల హరించువాడగు శివపర మాత్మను మోక్షార్థమయి ధ్యానింపుము. లౌకికములయిన ఇతర కర్మలతో నీకు వచ్చు లాభమేమి? ( ఈభావము కేవలము పౌరాణికము - ఇది కేవలం స్వేచ్ఛానువాదమును.)

కొందరు క్రింది శ్లోకమును గూడా ధ్యానము కొరకుపయోగింతురు.

శాంతం పదాపనస్థం-శశిధరమకుటం-పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రంచ ఖడ్గం పరశుమభయదం దక్షభాగే వహంతం
నాగం పాశంచ ఘంటాం వదరమభయదం చాంకుశం వామభాగే
నానాలంకాయుక్తం స్ఫటిక మణినిభం పార్వతీశం నమామి.

(శాంత స్వరూపుడు, పద్మాసనమందున్నవాడు, చంద్రశేఖరుడును, ఐదు మోములు గలవాడును, మూడు కన్నులవాడును, కుడివైపు చేతుల యందు శూలవజ్ర ఖడ్గపరశువులు ధరించిన అభయహస్తముతో నలంకృతు డయినవాడును, నాగము, పాశము, ఘంటము అను వానిని ధరించి వరదా భయహస్తములతో నొప్పుచుండు ఎడమభాగము గలవాడును, అనేకాలంకార యుతుడును స్ఫటిక మణివలె మిగుల స్వచ్ఛుడును అయిన పార్వతీపతిని ధ్యానించుచున్నాను (పౌరాణికార్థము స్వేచ్ఛానువాదము)

**తరువాత పంచపూజలు**

ఓం లం పృథివీతత్త్వానే ఓం శ్రీ సాంబసదాశివాయ గంధంకల్పయామి
ఓం హం ఆకాశతత్త్వాత్మనే ఓం శ్రీ సాంబసదాశివాయ పుష్పంపూజయామి
ఓం యం వాయుతత్త్వాత్మనే ఓం శ్రీసాంబసదాశివాయ ధూపమాఘ్రాపయామి

ఓం రం తేజస్తత్త్వాత్మనే ఓం శ్రీ సాంబసదాశివాయ దీపం దర్శయామి

ఓం వం అమృతత్త్వాత్మనే ఓం శ్రీ సాంబసదాశివాయ అమృతనైవేద్యంసమర్పయామి.

ఓం సం సర్వతత్త్వాత్మనే ఓం శ్రీ సాంబసదా శివాయ సర్వోపచారపజాంకల్పయామి.

మనుః

ఓం నమశ్శివాయ అను మంత్రము కనీసం 108 మారులు చేయుము. జపమును నీటితో పరమేశ్వరునికై ఓం తత్సత్ శ్రీ సాంబసదాశివార్పణ మస్తు అని చెప్పుచు వదలవలెను.కొందరు ఇచటనే దిగ్విమోచనము చేతురు. కొందరు పారాయణానంతరం పూజచేసి దిగ్విమోచనము చేతురు. ఇది కేవలం సాంప్రదాయముగాకనబడుచున్నది.

**జపాంగ శివపంచాక్షరీ మంత్రజపం (మరియొకపద్ధతి)**

ఆచమనం నుండి - సంకల్పం వరకు మామూలే.

మమశ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం యధాశక్తి పారాయణాంగ శివ పంచాక్షరీ మంత్రజపం కరిష్యే (నీళ్ళు వదలవలెను.)

అస్యశ్రీ ప్రణవ పంచాక్షర మహామంత్రస్య బ్రహ్మ ఋషిః గాయత్రీ ఛందః శ్రీ సాంబసదాశివోదేవతా ఓం బీజం, ఓం నమః ఓం శక్తిః శివాయ ఇతికీలకం, మమశ్రీ సాంబసదాశివదేవతాముద్దిశ్య శ్రీ సాంబసదాశివ దేవతా ప్రీత్యర్థం యధాశక్తి జపే వినియోగః కొందరు తమ సంప్రదాయాను సారము ఇచటనే ధ్యానము సేతురు. మరికొందరు న్యాసానంతరము ధ్యానము సేతురు. ఇది కేవతలము సంప్రదాయము లౌకికము.

ఓం ఓం అంగుష్ఠాభ్యాం నమః
ఓం నం తర్జనీభ్యాం నమః
ఓం మం మధ్యమాభ్యాం నమః
ఓం శిం అనామికాభ్యాం నమః
ఓం వాం కనిష్ఠికాభ్యాం నమః
ఓం యం కరతల కరపృష్ఠాభ్యాం నమః
కరన్యాసము తరువాత హృదయ న్యాసము చేయవలెను.
ఓం ఓం హృదయాయ నమః
ఓం నం శిరసే స్వాహా
ఓం మం శిఖాయై వషట్



ఓం శిం కవచాయ హుం
ఓం వాం నేత్రత్రయా వౌషట్
ఓం యం అస్త్రాయఫట్

ఓం భూర్భువస్సువ రోమితి దిగ్బంధః ధ్యానం ఇచట ధ్యానము సేయు నది. ఏదైన ఒక శ్లోకమును ధ్యానించునది. క్రింది శ్లోకములందలి భావము కువలము పౌరాణికము సేచ్ఛానువాదము.

**త్రయీవేద్యం హృద్యం త్రిపుర హరమాద్యం త్రినయనం**
**జటాభారోదారం జ్వలదురగహారం మృగధరం**
**మహాదేవం వందేహం మృదుసదయ భావం**
**పశుపతిం శివాలంబం సాంబం శివమపిభజే.**

(మూడు వేదములచే తెలియదగినవాడును మనోహరుడును, త్రిపురా సరమర్దకుడును పాముదండలు ధరించువాడును, లేడిపల్లను ధరించిన వాడును దేవతలందరిలో మిగుల గొప్పవాడును, తొలియందున్నవాడును, త్రినేత్రుడును దయతో గూడిన కోమల హృదయుడును, పశుపతియు పార్వతికి ఆధారమయినవాడును, పార్వతిని కూడినవాడును అగు పరమేశ్వ రుని మదిని ధ్యానిస్తాను.

**ధ్యాయేన్నిత్యం మహేశం రజతగిరినిభం చారు చంద్రావతంసం**
**రత్నకల్పో జ్వలాంగం పరశుమృగవరాభీతి హస్తం**
**ప్రసన్నం పద్మాసనం నమం వాస్తుతమమరగణైః**
**వ్యాఘ్రకృత్తింవసానం విశ్వాద్యం విశ్వంద్యం నిఖిల భయాపహారం**

పంచవక్త్రం, త్రినేత్రం, మహేశ్వరుడను కైలాసమువలె తెల్లని కాంతిగల వాడును, అందమైన జాబిల్లి సిగయందుగల వాడును, రత్నముతో సమాన ముగా మనోహరమైన, స్వచ్ఛమైన ప్రకాశించు శరీరము గలవాడును, లోకములన్నింటిని గొప్పగా శాసించువాడును, పరశు వును, ధరించు వాడును అభయవరదహస్తములతోగూడి లేడి పిల్లను ధరిం చినవాడును, ప్రసన్నుడును, పద్మమునందు ఆసీనుడైనవాడును, దేవతా గణములచే నమస్కరింపబడుచు స్తుతింపబడువాడును, వ్యాఘ్రచర్మాంబర ధారియు, విశ్వాద్యుడును, విశ్వవ్యందుడును, తాపత్రయ హరుడును, ఐదు మోములు, మూడు నేత్రములు గల పరమాత్మను ధ్యానిస్తున్నాను.

## పారాయణాంగ శివపూజ

**శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్**
**ప్రసన్నవదనం ధ్యాయే సర్వవిఘ్నోపశాంతయే**
**అగజానన పద్మార్కం గజానన మహర్నిశమ్**
**అనేక దంతం భక్తానాం ఏకదంత ముపాస్మహే**

ఈ శ్లోకములు చదువుచు గణపతికి అక్షతలువేసి నమస్కరింపవలెను.

తరువాత మూడు పర్యాయములు ఆచమనము చేయవలెను. ఆచమనం చేయునపుడు చూపుడు వ్రేలుగాని, ఉంగరపు వ్రేలుగాని లోపలికి ముడువవలెను. దొప్పవలె మారిన చేతిలోనికి నీరు తీసుకొని ఓం కేశవాయ స్వాహా అని చెప్పి మొదటి పర్యాయము నీరు తీసుకోవలెను. చేతిలోనికి నీరు తీసుకొని ఓం నారాయణస్వాహా అని చెప్పుచు రెండవపర్యాయము నీరు తీసుకోవలెను. మూడవమారు చేతిలోనికి నీరుతీసుకొని ఓం మాధవాయస్వాహా అని చెప్పుచు నీరు తీసుకోవలెను. తరువాత చేతులు జోడించి భగవంతుని నామములు క్రింది విధముగా పఠింపవలెను.

ఓం గోవిందాయనమః ఓం విష్ణవే నమః ఓం మధుసూదనాయ నమః ఓం త్రివిక్రమాయ నమః, ఓం వామనాయ నమః ఓం శ్రీధరాయనమః ఓం హృషీకేశాయనమ ఓం పద్మనాభాయనమః ఓం దామోదరాయ నమః ఓం సంకర్షణాయ నమః ఓం వాసుదేవాయనమః ఓం ప్రద్యుమ్నాయనమః ఓం అనిరుద్ధాయనమః ఓం పురుషోత్తమాయనమః ఓం అధోక్షజాయ నమః ఓం నారసింహాయ నమః ఓం అచ్యుతాయనమః ఓం జనార్దనాయ నమః ఓం ఉపేంద్రాయనమః ఓం హరయే నమః ఓం శ్రీకృష్ణాయ నమః

(ప్రాణాయామ విధానము గురువులవద్ద నేర్వవలెను.)

క్రింది విధము కేవలము లౌకికమే తరువాత ముక్కుపట్టుకొని ప్రాణాయామము చేయుము ప్రాణాయామము చేయునపుడు క్రింది విధముగా పలుకుము. ఓం ప్రణవస్య పరబ్రహ్మఋషిః పరమాత్మా దేవతా సుతలంఛందః దైవీగాయత్రీఛందః ప్రాణాయామేవినియోగః ఓం భూః ఓం భువః ఓంసువః ఓంమహః ఓం జనః ఓం తపః ఓం సత్యం ఓం తత్స వితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ఓమాపో జ్యోతీరసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం ముక్కువదలుము, తరువాత క్రింది విధముగా సంకల్పము చేయుము శుభే శోభనే ముహూర్తే అద్య



బ్రహ్మణః ద్వితీయ పరార్ధే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణదిగ్భాగే శ్రీశైలస్య ....భాగే శ్రీకృష్ణాకావేర్యోః ...ప్రదేశే...గృహే అస్మిన్ వర్తమానేన వ్యావహారిక చంద్ర మానేన..నామ సంవత్సరే...ఆయనే...ఋతౌ...మాసే ...పక్షే...తిథౌ...వాసర యుక్తాయాం శుభనక్షత్ర శుభయోగ శుభకరణ ఏవం గుణవిశేషణ విశిష్టా యాం శుభతిథౌ మమ శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శ్రీ శివనామ సహస్ర పారాయణాంగ భూత యథాశక్తి శివపంచాక్షరీ మంత్ర జపం కరిష్యే. (నీళ్ళు వదలవలయును.) (శివపూజ లింగమునగాని చిత్రమునగాని పుస్తక ముపైగాని చేయవచ్చును.) తరువాత కలశపూజ చేయవలెను.

**కలశారాధన** : ఏ పాత్రనైనగాని కలశమునకు ఉపయోగించవచ్చును. (అల్యూమినియంపాత్ర అయఃపాత్ర అంత శ్రేయోదాకముకావు) కలశపాత్ర యందు నీళ్ళుపోసి పసుపు కుంకుమ పుష్పములు గంధాక్షతలు వేసి దానిపై రెండు చేతులు బోర్లించి క్రింది శ్లోకములు చదువుము.

**కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్ర సమాశ్రితాః**
**మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్యేమాతృగణాస్మృతాః**
**కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా**
**ఋగ్వేదోథ యజుర్వేద స్సామవేదోహ్యథర్వణం**
**అంగైశ్చ సహితాః సర్వే కలశేతు సమాశ్రితాః**
**ఆయాంతు దేవపూజార్థం దురితక్షయ కారకాః**
**గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతీ నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు.**

కలశమందలి నీటినిపూజా ద్రవ్యాలపై దేవునిపై తనమీద చల్లుకో వలెను. తరువాత నిర్విఘ్నముగా పారాయణ కార్యక్రమము జరుగుటకు గణాధిపతిని ఈ పూజా ప్రారంభమందు నుడివిన శ్లోకములతోనుతించ వలెను. లేక శక్తులయినవారు గణపతిని క్రముకముపైగాని హరిద్రతోగాని చేసిన ఆకారముపైగాని క్రింది విధముగా పూజింపవచ్చును.

ఓం లం పృథివీతత్త్వాత్మనే మహాగణాధిపతయే నమఃగంధం పరికల్పయామి
ఓం హం ఆకాశతత్త్వాత్మనే మహాగణాధిపతయే నమఃపుష్పం పరికల్పయామి
ఓం యం వాయుతత్త్వాత్మనే మహాగణాధిపతయే నమఃధూపం పరికల్పయామి

ఓం రం తేజస్తత్త్వాత్మనే మహాగణాధిపతయే నమఃదీపం పరికల్పయామి

ఓం వం అమృత తత్త్వాత్మనే మహాగణాధిపతయే నమః

అమృతోపహార నైవేద్యం పరికల్పయామి

ఓం సం సర్వతత్త్వాత్మనే మహాగణాధిపతయేనమఃసర్వోపచారపూజాంపరికల్పయామి

పారాయణాంగ గణపతి ఈ మాత్రం చాలును. తరువాత సాంబసదాశివుని క్రింది మంత్రము తెలుపుచూ ఆవాహనము చేయుము.(కొందరు ఈ మంత్ర మునే ప్రాణప్రతిష్ఠాపనకు ఉపయోగింతురు.)

**అసునీత పునరస్మాసు చక్షుః పునః**
**ప్రాణమిహనోదేహిభోగమ్ జ్యోకృశ్యేమ సూర్యముచ్చరంత**
**మనుమతే మృడయాన స్వస్తిఅమృతంవైప్రాణాః**
**అమృతమాపః ప్రాణానేవ యథాస్థాన ముపహ్వయతే**

అని అక్షితలు వేసి క్రింది శ్లోకం ధ్యానం చెయ్యవలెను.

**ఈశ గిరీశ పరేశ మహేశ బిలేశయ భూషణభోన్ ।**
**సాంబసదాశివ శంభో శంకర శరణం మే తవ చరణయుగమ్॥**

### శ్రీశివనామ సహస్ర పారాయణాంగ లఘుపూజ

#### ఆవాహనము

అక్షతలు వేసి క్రింది శ్లోకముతో స్వామిని ఆవాహన చేయుము.

కైలాస శిఖరే రమ్యేగిరిజా సహిత ప్రభో ।
ఆగచ్ఛ దేవ దేవేశ సర్వాధార జగత్పతే ॥

#### ఆసనము

అక్షతలువేసి ఆసనము వేయుచున్నట్లు భావింపుము
సురాసుర శిరోరత్న పద్మాంబుజ వరప్రద
ప్రమధాధిప మద్దత్త మాసనం ప్రతిగృహ్యతాం
శ్రీ సాంబసదాశివాయ నమః ఆసనం సమర్పయామి

#### పాద్యం

గంగాధర నమస్తేస్తు త్రిలోచన వృషధ్వజ
పాద్యం గృహాణ దేవేశ గౌరీప్రియ జగత్పతే
ఒక ఉద్ధరిణి నీరు స్వామి పాద్యార్థము వేయుము
(ఆచమనమునకు తప్ప పూజకంతకును కలశోదకమే వాడవలెను.)



శ్రీ సాంబసదాశివాయ నమః పాద్యం సమర్పయామి.

#### అర్ఘ్యం

అర్ఘ్యం గృహాణ ! భగవన్ ! భక్త్యాదత్తం మహేశ్వరః
ప్రయచ్ఛమే యశస్తుష్టిం, భక్తానామిష్టదాయక!
శ్రీ సాంబసదాశివాయనమః అర్ఘ్యం సమర్పయామి
ఉద్ధరితో నీళ్ళువేయుము. తరువాత క్రింది మంత్రములతో కలశము నందలి నీరు ఉపయోగించి పువ్వుతో స్నానము చేయించుము.

* ఆప్యాయ స్వసమేతుతే విశ్వతస్సోమ వృష్టియమ్ భవా వాజస్య సగంధే
శ్రీ సాంబసదాశివాయ నమః - క్షీరేణ స్నాపయామి.
(పాలు ఉన్నచో పూవును దానితో అద్ది స్నానము చేయించవలెను. లేనిచో కలశోదకము చాలును.)

* దధిక్రావణ్ణో అకారిషం జిష్ణో రశ్వస్యవాజినః
సురభినో ముఖాకర త్ప్రణ ఆయూగ్ంషి తారిషత్
శ్రీ సాంబసదాశివాయ నమః శ్రీ సాంబసదాశివాయ నమః
(దధ్నాస్నాప యామి) పెరుగు ఒకవేళ ఉన్నచో దానితో పూవునద్ది స్నానము చేయింప వలెను. లేనిచో కలశోదకమే చాలును.

* శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవ స్సవితోత్పునా త్వచ్ఛిద్రేణ
పవిత్రేణ వసో స్సూర్యస్యరశ్మిభిః శ్రీసాంబసదాశివాయ నమః
ఆజ్యేనస్నాపయామి నేయి ఉన్నచో దానిలో పూవునద్ది స్నానము చేయింప వలెను. లేనిచో కలశోదకమే చాలును.

* మధువాతాఋతాయతే మధుక్షరంతిసింధవః-మాధ్వీర్నస్సంత్వో
షధీః - మధునక్తముతోషసి మధుమత్పార్థివగ్ంరజః - మధుద్యౌరస్తు
నః పితా మధు మాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తుసూర్యః - మాధ్వీ
ర్గావోభవంతునః - శ్రీసాంబసదాశివాయనమః మధునాస్నాపయామి
తేనెయందు పూవునద్ది స్నానము చేయింపుము లేనిచో కలశోదకమేచాలు.

* స్వాదుః పవస్వదివ్యాయ జన్మనే స్వాదురింద్రాయ సుహవీతునామ్నే
స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే బృహస్పతయే మధుమాగ్ం అథాభ్యః
శ్రీ సాంబసదాశివాయనమః శర్కరయాస్నాపయామి (చక్కెరతో అభిషేకించుము లేనిచో కలశోదకమే చాలును.)

యాఃఫలినీర్యా అఫలా అపుష్పాయాశ్చపుష్పిణీః బృహస్పతి ప్రసూతా
స్తానో ముంచంత్వగ్ంహసః శ్రీ సాంబసదాశివాయనమః -

ఫలోదకేనస్నాపయామి (ఫలోదకములచే అభిషేకింపుము లేనిచో కలశోదకము
ఆపోహిష్ఠామయోభువఃస్తాన ఊర్జేదదాతన మహేరణాయ చక్షసే
యో వశ్శివతమో రసస్తస్య భాజయతేహనః - ఉశతీరివమాతరః
తస్మా ఆరంగ మామవో యస్యక్షయాయ జిన్వథ ఆపోజన యధాచనః
శ్రీ సాంబసదా శివాయ నమః శుద్ధోదక స్నాపయామి. (పూవుతో కలశోదక
స్నానముచేయించుము). * ఈ గుర్తు వున్నవి వేదమంత్రములు.

స్వరయుక్తముగా మంత్రము పలుకలేనివారు శ్లోకముచ్చరించినచాలును
(పరమాత్ముడు భక్తాధీనుడని మరువరాదు.)

(పై మంత్రములు సుస్వరముగా పలుకలేనివారు క్రింద శ్లోకములు
చెప్పి పూవుతో అభిషేకించినను చాలును.)

స్నానం పంచామృతైః దేవగృహాణసురనాయక
అనాథనాథ సర్వజ్ఞ అవ్యయానంత శంకర
శ్రీ సాంబసదాశివాయ నమః - పంచామృత స్నానం సమర్పయామి.
గంగాదిజలసంయుక్తం మయాదత్తమనుత్తమమ్
స్నానం స్వీకురుదేవేశ సదాశివ నమోస్తుతే
శ్రీ సాంబసదాశివాయనమః శుద్ధోదక స్నానం సమర్పయామి.

**వస్త్రం** : మంత్రము

అభివస్త్రా స్రువసనాన్యర్షాభిదేనో - సుదుఘాఃపూజమానః
అభిచంద్రా భర్తవేనో హిరణ్యాభ్యశ్వాన్ రధినో దేవసోమ
శ్రీ సాంబసదాశివాయ నమః వస్త్రయుగ్మం సమర్పయామి.

శ్లో॥ వస్త్రయుగ్మం సదాశుభ్రం సుమనోహరమిదం శుభం
దదామిదేవ దేవేశ భక్త్యేదం ప్రతిగృహ్యతాం
శ్రీ సాంబసదాశివాయ నమః వస్త్రయుగ్మం సమర్పయామి

* యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతే ర్యత్సహజంపురస్తాత్
ఆయుష్యమగ్ర్యం ప్రతిముచం శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తుతేజః
శ్రీ సాంబసదాశివాయనమః యజ్ఞోపవీతం సమర్పయామి.
స్వర్ణయజ్ఞోపవీతం చ కాంచనం చోత్తరీయకం ।



రుద్రాక్షమాలయా యుక్తం దదామి స్వీకురు ప్రభో ॥
శ్రీసాంబ సదాశివాయ నమః యజ్ఞోపవీతం సమర్పయామి.
గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్పాంకరీషిణీమ్
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయేశ్రియమ్
శ్రీ సాంబసదాశివాయనమః శ్రీగంధం ధారయామి

శ్లో॥ శ్రీ గంధం చందనోన్మిశ్రం కర్పూరేణ సుసంయుతమ్
విలేపనం సురశ్రేష్ఠ ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్
శ్రీ సాంబసదాశివాయనమః శ్రీ గంధం ధారయామి

* అయనేతే పరయాణే దూర్వారోహంతు పుష్పిణీః
హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహాఇమే
శ్రీ సాంబసదాశివాయనమః సకల భరణార్థ మక్షతాన్ సమర్పయామి
అక్షతోసి స్వభావేన భక్తానామక్షతంపదం
దదామినాథమద్దత్తై రక్షతైః ప్రీయతాంభవాన్
సకలా భరణార్థ మక్షతాన్ సమర్పయామి

* పుష్పావతీః ప్రసూవతీః ఫలినీర ఫలా ఉత అశ్వాఇవ సజిత్వరీ
వీరుధఃపార యిష్ణవః- శ్రీసాంబసదాశివాయనమః పుష్పైపూజయామి
కల్పవక్షప్రసూనైస్త్వం పూర్వైరభ్యర్చితంసురైః
కుంకుమైః పార్థివైరేభి రిదానీ మర్చతాంమయా
శ్రీ సాంబసదాశివాయనమః ధూపమాఘ్రాపయామి

1. ఓం హరాయనమః
2. ఓం లలాటనేత్రాయనమః
3. ఓం గంగాధరాయనమః
4. ఓం మహాదేవాయ నమః
5. ఓం పశుపతయే నమః
6. ఓం త్రినేత్రాయ నమః
7. ఓం రుద్రాయ నమః
8. ఓం శర్వాయనమః
9. ఓం శంభవేనమః
10. ఓం చంద్రమౌళయే నమః

ఓం సాంబసదాశివాయనమః-
నానావిధపరిమళపత్రపుష్పాక్షతాన్ సమర్పయామి

శ్లో॥ వనస్పత్యుద్భవైర్దివ్యైర్నానాగంధైస్సు సంయుతః
ఆఘ్రేయ స్సర్వదేవానాంధూపోయం ప్రతిగృహ్యతాం
ఓం సాంబసదాశివాయనమః ధూపమాఘ్రాపయామి

శ్లో॥ సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినాయోజితంమయా
గృహాణ మంగళం దీపం త్రైలోక్య తిమిరాపహం
భక్త్యాదీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే
త్రాహిమాంనరకాద్ఘోరా ద్దివ్యజ్యోతిర్నమోస్తుతే
ఓం సాంబసదాశివాయనమః దీపం దర్శయామి

నైవేద్యమిచ్చుటకు ముందు కొంత పంచాక్షరీ జపం చేయుట మంచిది.

నైవేద్యం ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వరేణ్యమ్ భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ సత్యంత్వర్తేన పరిషంచామి అమృతమస్తు అమృతోపస్తరణమసి ఓం ప్రాణాయస్వాహా ఓం అనాయ స్వాహా ఓం వ్యానాయస్వాహా ఓం ఉదానాయస్వాహా ఓం సమానాయస్వాహా శ్రీ సాంబసదాశివకదేవతా ప్రీత్యర్థం యధాసంభవిత నైవేద్యం...సమర్ప యామి. మధ్యే మధ్యే ఉదక పానీయం సమర్పయామి హస్తప్రక్షాళనం సమర్పయామి. పాదప్రక్షాళనం సమర్పయామి. శుద్ధాచమనీయం సమర్ప యామి.

శ్లో॥ నైవేద్యం షడ్రసోపేతం ఫలలడ్డుకసంయుతమ్
భక్ష్యభోజ్య సమాయుక్తం ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్
శ్రీ సాంబసదాశివాయ నమః యధాసంభవిత...నైవేద్యం సమర్ప యామి మధ్యేమధ్యే ఉదకపానీయం సమర్పయామి. హస్తప్రక్షాళనం సమర్ప యామి.పాదప్రక్షాళనం సమర్పయామి. శుద్ధాచమనీయం సమర్పయామి.

శ్లో॥ పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం ।
కర్పూర చూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్॥
శ్రీ సాంబసదాశివాయనమః తాంబూలం సమర్పయామి.
హిరణ్యగర్భ గర్భస్థం హేమబీజం విభావసోః
అనంతపుణ్యఫలద మతశ్శాంతిం ప్రయచ్ఛమే
సువర్ణపుష్ప దక్షిణాం సమర్పయామి.



హిరణ్య పాత్రం మధోః పూర్ణం దధాతి మధవ్యోసానీతి ఏకధా బ్రహ్మణ ఉపహారతి– ఏకధైవ యజమాన ఆయుస్తేజోదధాతి దివ్యమంగళ హారతిక్యం సమర్పయామి.

శ్లో॥ ఘృతవర్తి సహస్రైశ్చ కర్పూర శకలైస్తథా
నీరాజనం మయాదత్తం గృహాణ వరదోభవ
శ్రీసాంబసదాశివాయనమః మంగళహారతిక్యం సమర్పయామి.

శ్రీసాంబసదాశివదేవతాభ్యోం నమః పునః పూజంచ కరిష్యే ఛత్రంధార యామి, చామరాభ్యాం వీచయామి, నృత్యం దర్శయామి, గీతం శ్రావయామి, ఆందోలికామావాహయామి సమస్త రాజోపచారభక్త్యోపచార శక్త్యోపచార పూజాం సమర్పయామి.

వైదిక మంత్రములచే పూజింపలేనివారు శ్లోకములతో పూజ చేయవచ్చును.

యస్యస్మృత్యాచ నామోక్త్య తపః పూజాక్రియాదిషు
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే తమచ్యుతం
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం పరమేశ్వర యత్పూజితం
మయాదేవ పరిపూర్ణం తదస్తుమే.

అనేన యధాసంభవిత పారాయణాంగపూజనేన భగవాన్ సర్వాత్మకః శ్రీ సాంబసదాశివ దేవతా సుప్రీణాతు నైవేద్యాంత పూజమాత్రమే చేసి, పారా యణమొనర్చి హారతి పునః పూజచేయడం, దిగ్విమోచన చేయడం, సమ్ప్ర దాయం (ఎవరిసమ్ప్రదాయంవారు పాటించడమంచిది.)

## పారాయణ పూర్వభాగము (స్వేచ్ఛానువాదం)

### శ్రీవేదవ్యాస ప్రణీత మహాభారతాంతర్గత శివనామస్తోత్రమ్

### 1. శివధ్యానము

వందే శంభుముమాపతిం సురగురుం వందేజగత్కారణమ్
వందే పన్నగ భూషణం మృగధరం వందే పశూనాం పతిమ్
వందే సూర్యశశాంక వహ్నియనమ్ వందే ముకుంద ప్రియమ్
వందే భక్త జనాశ్రయంచ వరదం వందే శివమ్ శంకరమ్.

స్వేచ్ఛానువాదం : సత్త్వ గుణాధికులగు దేవతల (సజ్జనుల)లో మిగుల శ్రేష్ఠుడును, లోకముల రక్షించు మహామాయను రక్షించువాడును పరమా నంద రూపియైన పరమాత్మకు నమస్కరిస్తున్నాను. విశ్వమునకు మూలకార

